అపరాధ పరిశోధన అనుబంధం—40

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## గుండెలు ఆగిన శవాలు

రచన : కె. బి. ఎస్. కుమార్

## నేరస్తులోపాఖ్యానం!

రచన : యం. కె. వి. శాస్త్రి

## రహస్య నగరం

రచన : సంపత్

## శవాలు చెప్పిన కథలు

రచన : అజీజ్

'శాస్త్యేరా' సీరియల్ - ఐదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—40
ఏప్రిల్, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

Geda
Ranga Rao
6-4-77

గెడా రంగారావు

# గుండెలు ఆగిన శవాలు!!

కె. బి. ఎస్. కుమార్

అతనికి నలభైఐదేళ్లుంటాయ్...

చామన చాయ. పొడుగ్గా వున్నాడు. అక్కడక్కడ నెరిసిన తల. కళ్ళకి రిమ్‌లెస్ కళ్ళజోడు. దిగులుతో ముడుచుకు పోయిన గంభీరమైన ముఖం. నలిగిన బట్టలు. ఎడం చేతికి వాచి. ఆకు చెప్పులు.

"జలంధర్ గారూ! ఫీజు ఎంతైనా ఇచ్చుకుంటాను. నా బిడ్డని చంపినవాళ్ళని ఉరికంబం ఎక్కించండి..." జేబులోంచి వంద రూపాయల కట్ట తీశాడు జగదీష్‌బాబు.

"ఆవేశ పడకండి. డబ్బు కాదు ప్రధానం. వాటిని జేబులోనే వుంచి అసలు విషయం చెప్పండి..." నెమ్మదిగా అన్నాడు డిటెక్టివ్ జలంధర్.

నీళ్ళు నిండిన కళ్ళని జేబు రుమాలుతో తుడుచుకుని చెప్పటం ప్రారంభించాడు జగదీష్‌బాబు.

"కాత్యాయని నాకు లేక లేక కలిగిన కూతురు. ప్రాణ ప్రదంగా పెంచుతూ వచ్చాను. అలాంటి తల్లి లేని నా కూతురు ఈనాడిలా దారుణ మరణానికి గురైతే ఎలా వుంటుంది జలంధర్ గారూ! మీరే చెప్పండి..." ఏడుస్తూ అన్నాడు జగదీష్‌బాబు.

"ఆ మాత్రం అర్థ చేసుకోలేని అవివేకిని కాను. జగదీష్ గారూ! ఆయుస్సు తీరి చస్తేనే ఎంతో బాధ పడతాం. మరి అలాంటి పరిస్థితిలో అందులోనూ ముందు జీవితాన్ని మూడు పువ్వులు, ఆరు కాయలుగా అనుభవించ వలసిన అమ్మాయి హత్య చెయ్యబడితే ఆ కన్నతండ్రి అనుభవించే బాధను ఊహించుకోగలను... చెప్పండి." వుద్వేగంగా అన్నాడు జలంధర్.

"నేను దాదాపు పదిన్నర - పదకొండు మధ్య ప్రాంతంలో వచ్చాను విజయవాడ నుండి. పోర్టికోలో అమ్మాయి కారాగి వుంది. అమ్మాయి ఎప్పుడు బయటినుండి వచ్చినా షెడ్డులో పెట్టి తాళం వేస్తుంది. అదే ఆశ్చర్యంతో కారు దిగి అమ్మాయి కారును సమీపించాను. తలుపు తెరిచి చూసి ప్రమాన్పడిపోయాను..." ఒక్క క్షణం ఆగి మళ్ళీ ప్రారంభించాడు జగదీష్‌బాబు.

"...అమ్మాయి మరణించి వుంది! ముఖం చాల భయంకరంగా వుంది!! కెవ్వున కేక వేశాను. నౌకర్లు అదిరి పడి లేచి తలుపులు తెరిచారు. పరిస్థితి తెల్సుకుని అందరూ నోళ్ళు వెళ్ళబెట్టారు. ఎవ్వరూ ఏమీ చెప్పలేక పోయారు. నాకాళ్ళూ చేతులు ఆడలేదు.

ఇలా పరిగెత్తు కొచ్చేశాను. ఈ విషయంలో మీరు నాకు సంపూర్ణ సహకారాన్నందించి ఆ దుర్మార్గుణ్ణి సాధ్యమైనంత త్వరలో పట్టుకోవాలి. అంతే డిటెక్టివ్ గారూ!'' అన్నాడు జగదీష్‌బాబు.

''శవం ఎక్కడుంది?''

''కారులోనే వుంది.''

''పదండి చూద్దాం. దారిలో మాట్లాడుకోవచ్చు.''

''డిటెక్టివ్ గారూ! చిన్న రిక్వెస్ట్...''

''ఏమిటి?''

''అమ్మాయి ఇలా దారుణ హత్యకు గురైందని అందరికీ తెలీటం నాకిష్టం లేదు. దయచేసి ఈ విషయాన్ని గుప్తంగా వుంచండి. రహస్యంగా పరిశోధన ప్రారంభించండి... ప్లీజ్...''

''కనీసం పోలీసు బలగానికైనా తెలియజెయ్యవలసుంటుంది జగదీష్‌గారూ! మా యిద్దరి వల్లే అవుతుందని అనుకోవటం కొన్ని సమయాల్లో పొరపాటు. అత్యవసర పరిస్థితుల్లో వారి సహాయ సహకారాలని తప్పనిసరిగా పొందవలసి వస్తుంది. అలాంటప్పుడు మీరిలా...''

''తప్పనిసరైతే అత్యవసరమైన వాళ్ళకి మాత్రం తెలిస్తే ఫర్వాలేదు. కాని పత్రికల వరకు వెళ్ళటం నాకు చాల బాధగా వుంటుంది.''

''అలాగే... మీరన్నట్టుగా ఈ విషయం అత్యవసరమైన వాళ్ళకి తప్ప అన్యులెవరికీ తెలిసే అవకాశం ఇవ్వను. సరేనా?''

''థాంక్స్...''

''పదండి.''

ఇద్దరూ లేచారు. డిటెక్టివ్ అసిస్టెంట్ శ్రీనివాస్ వారిని అనుసరించాడు.

## 2

"మీ యింట్లో మొత్తం ఎందరున్నారు? ఎవరెవరు?" దారిలో జగదీష్‌బాబును ప్రశ్నించాడు, డిటెక్టివ్ జలంధర్.

"నేను, నలుగురు నౌకర్లు."

"మీరే వూరైనా వెడితే ఇల్లు వారి స్వాధీనంలోనే వుంటుందా?"

"అవును."

"మీ నౌకర్లందరూ నమ్మకస్థులని ధూఢిగా చెప్పగలరా?"

"ఆఁ... నలుగురూ దాదాపు ఏడెనిమిది సంవత్సరాలుగా మా యింట్లోనే పని చేస్తున్నారు. ఇంత వరకూ నాకు తెలీకుండా ఇంట్లోంచి అగ్గిపెట్టె కూడ బయటికి పోలేదు."

"ఇఫ్ యూ డోంట్ మైండ్, మీరు విజయవాడ వెళ్ళిన పనేమిటో చెప్పగలరా?"

"మా అమ్మాయికి సంబంధం చూట్టానికెళ్ళాను."

"ఫిక్స్ చేశారా?"

"ఇంకా చెయ్యలేదు. అమ్మాయి బ్రతుకుంటే త్వరలోనే అయ్యేదేమో! అమ్మాయి ఫోటో తీసికెళ్ళాను. నే వెళ్ళేసరికి అబ్బాయి వూళ్ళో లేడు. ఫోటో తీసుకున్నారు. వచ్చాక మాట్లాడి ట్రంకాల్ చేస్తామన్నారు."

"బైదిబై _ మీరీ సంబంధం చూస్తున్నట్టు మీ అమ్మాయికి తెల్సా?"

"ఊఁ హూఁ..."

“మీ అమ్మాయికి, ఆ అబ్బాయికి పరిచయం వుందా?”

“లేదు. అసలు అమ్మాయి అతని ముఖమైనా చూళ్లేదు.”

“మీ అమ్మాయి కెవరైనా బోయ్ ఫ్రెండ్స్ ఉన్నారా?”

“చదువుకున్న పిల్ల. అందరితోనూ చనువుగానే వుండేది.” మధ్య మధ్యన కళ్ళు తుడుచుకుంటూ ముక్కు చీదుతున్నాడు జగదీష్‌బాబు.

“మీ అమ్మాయి ఎవర్నైనా ప్రేమిస్తున్నట్టుకాని ఎవరితో నైనా తిరుగుతూన్నట్టుకాని మీకు తెల్సా?”

“లేదు...” ఆ ప్రశ్న జగదీష్‌బాబుకి బాధను కల్గించింది. అయినా తప్పదు.

“థాంక్స్... ప్రస్తుతానికివి చాలు. శవాన్ని చూశాక అవసరమైతే మరికొన్ని ప్రశ్నలు వేస్తాను.” జేబులోంచి రెడ్ విల్స్ పాకెట్ తీశాడు డిటెక్టివ్ జలంధర్.

# 3

ఆమె... కాత్యాయని శవం కాడిలాక్‌లో డ్రైవింగ్ సీట్లోనే వుంది. వెనుక సీట్‌వైపు చూస్తుండగా ప్రాణం పోయింది. కళ్ళు తెరవబడే వున్నాయ్!

శవాన్ని తదేకంగా చూశారు డిటెక్టివ్ ద్వయం.

కారు వద్దే కూర్చుని వున్నారు నౌకర్లు దిగులు పడ్డ ముఖాలతో.

“మీరంతా లోనికి వెళ్ళండి” నౌకర్లని ఆదేశించాడు జగదీష్‌బాబు. మౌనంగా వెళ్ళిపోయారు.

“మీ అమ్మాయి నెవరూ హత్య చేయలేదు జగదీష్ గారూ!” డిటెక్టివ్ జలంధర్ అన్నాడు.

“మరి... ఆత్మహత్య చేసుకొనుంటుందంటారా?”

వెంటనే అన్నాడు జగదీష్‌బాబు.

మౌనంగా వుండిపోయాడు జలంధర్.

"అంత అవసరం దానికేముంది?"

"జగదీష్‌గారూ! అలా చూడండి బాక్‌సీట్ కేసి చూస్తూండగా అమ్మాయి ప్రాణం పోయింది..."

"...అవును బాస్! వెనక్కి చూస్తోందంటే వెనక సీట్లో ఏదైనా వుండి వుండాలి. లేదా ఎవరైనా వుండి వుండాలి."

"కరెక్ట్... ముఖంలో ఆశ్చర్యం, భయం స్పష్టంగా కన్పిస్తోన్నాయి. దీన్ని బట్టి ఆశ్చర్యకరమైన భయంకరమైన సన్నివేశం ఆమెకక్కడ కనుపించి వుండాలి. ఆ షాక్ వల్ల ఆమె గుండె ఆగిపోయి వుంటుందని తేలిగ్గా వూహించవచ్చు కదూ!" శ్రీనివాస్ వైపు చూశాడు డిటెక్టివ్.

"ఏ మాత్రం సందేహం లేదు."

"అలాంటి సంఘటన ఎదురవటానికి ఆస్కారం వుందంటారా? శ్రీనివాస్‌గారూ!" అడిగాడు జగదీష్‌బాబు.

"ఎందుకుండదు? ఆలోచిస్తే తేలవచ్చు."

"జగదీష్‌గారూ! ఫొటోగ్రాఫర్ని ఇన్‌స్పెక్టర్ని పిలవాలి. ఫోనుందా?" జగదీష్ వైపు చూశాడు జలంధర్.

"జలంధర్‌గారూ! నే చెప్పిన విషయం..."

"గుర్తుంది లెండి. వారితో కూడ చెబుతాను."

"పదండి..." లోనికి దారి తీశాడు జగదీష్‌బాబు.

డయల్ చేశాడు జలంధర్. ఇన్స్‌పెక్టర్ చక్రవర్తి పలికాడు.

"హలో ఇన్స్‌పెక్టర్! నేను జలంధర్‌ని మాట్లాడు

తున్నాను. ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్‌ని, ఫొటోగ్రాఫర్ని తీసుకొని వెంటనే రావాలి..." అడ్రసు చెప్పాడు.

"వాట్ హేప్పెండ్?" అవతల్నుంచి ఆదుర్దాగా అన్నాడు చక్రవర్తి.

"వచ్చాక చెబుతాను. పదినిముషాల్లోగా మీరిక్కడుండాలి." సమాధానాని కెదురు చూడకుండా ఫోన్ పెట్టేసి శ్రీనివాస్ వైపు తిరిగాడు జలంధర్.

"వాసూ! వాళ్ళొస్తే రిసీవ్ చేసుకో. ఈలోగా నేను నౌకర్లతో మాట్లాడ్తాను."

"ఓకే బాస్..." వెళ్ళాడు శ్రీనివాస్.

"జగదీష్‌గారూ! ప్రత్యేకంగా వున్న ఓరూమ్ చూపించండి."

"అదుగో నా ఆఫీస్ రూమ్..." ఓ ప్రక్కగా చూపించాడు జగదీష్‌బాబు.

"మీ నౌకర్లల్లో ఒక్కొక్కర్నీ విడిగా పంపండి లోనికి. చివరగా మీరు రండి..." జగదీష్ చూపించిన గదివైపు నడిచాడు జలంధర్.

మొదటగా ఓ నౌకరొచ్చాడు గదిలోకి.

"నీ పేరు?"

"గోపయ్య బాబయ్యా!"

"ఎన్నాళ్ళ నుండి పనిచేస్తున్నా విక్కడ?"

"ఎనిమిదో ఏడు బాబూ!"

"ఈ ఎనిమిదేళ్ళలో మీ అయ్యగార్ని గూర్చి నీకు బాగా తెలిసుండాలి."

"ఎన్నలాంటోరు బాబయ్యా! ఎవురికీ అపకారమంటూ చేసెరగరు. ఆరేమో ఆరి యాపారమేంటో. అంతే. ఓరి

జోలికంటూ పోరు..."

"ఆయనకి ఒక్కతే కూతురు కదూ! ఇప్పుడు చని పోయిన అమ్మాయి..."

"అవునండీ..."

"ఆ అమ్మాయి స్వభావం?"

"తండ్రికి పూర్తిగా యతిరేకం బాబయ్యా! అంటే పూర్తిగా కాదు. ఆరి మనసూ మంచిదే! కాని చిలిపి చేట్ల లెక్కువ. తన మాటే నెగ్గించుకునే సాబావం..."

"కోపంకూడ ఎక్కువేనా?"

"ఎక్కువేకాని బాబయ్యా! అది నీటిమీద బుగ్గలాంటిదైతే, ఇట్టా వస్తుంది మళ్లా అంతలోనే పోతుంది."

"మీ అయ్యగారు, అమ్మగారు అప్పుడప్పుడూ తగవులాడుకునే వారా?"

"చిన్న చిన్న యిసయాల్లో కూడ అప్పుడప్పుడు చిలిపిగా తగువులాడుకునే వారండి. అయితే అవన్నీ అప్పటికప్పుడే! మళ్ళీ అమ్మాయిగారు లేందే అయ్యగారికి ముద్ద మింగుడు పడదు. అయ్యగారు లేందే అమ్మాయిగారికి బువ్వ తిన్నట్టుండదు."

"అమ్మాయిగారు మరణించక ముందు - అంటే ఆరోజు ఉదయంకాని సాయంత్రంకాని ఇద్దరికీ తగవు జరిగిందా?"

"లేదండి... అసలయ్యగారూళ్ళో లేందే!"

"ఈ రోజు రాత్రి నువ్వెప్పుడు పడుకున్నావ్?"

"తొమ్మిదిన్నరకు."

"వెంటనే నిద్రపోయావా?"

"లేదు బాబయ్యా! పడుకున్నాక పదినిమిసాలకి నిద్ర పట్టింది."

"మీ అయ్యగారి కోసం ఎవరేనా వస్తుండే వారా?"

"ఎంతో మంది వస్తూండే వారు బాబయ్యా!"

"అమ్మాయిగారి కోసం?"

"అరి కోసమూ వస్తుండే వారు."

"అంతా ఆడపిల్లలేనా?"

"అవును."

"ఆఁ... ఇందాక మీ అయ్యగారు, అమ్మాయిగారు తమాషాగా కీచులాడుకునే వారన్నావ్ గా! ఓ చిన్న ఉదాహరణ చెప్పగలవా?"

"ఆఁ... మూడు రోజుల కిందట అయ్యగారి కారు ట్రబులిచ్చింది. ఏదో తొందర పనున్నందున అమ్మాయిగారి కారు తీసికెళ్లారు. వచ్చింతర్వాత కోప్పడింది. ట్రబులిస్తే టాక్సీలో ఎళ్ళాలిగాని నా కారు తీసికెడితే నాకేదైనా అవసరమొస్తే నేనెలా ఎల్లాలి? అని..."

"అమ్మాయిగారు అప్పుడప్పుడూ అనుకోకుండా బయటికెడుతూంటూరా?"

"ఎప్పుడో ఓ సారి..."

"ఈ రోజు వుదయం వెళ్లారా?"

"ఎల్లారండి..."

"ఊరికేనా? ఏదైనా పనిపైనా?"

"తెలీదండీ..."

"ఎన్ని గంటలకి?"

"పది గంటల కెల్లారండి... మళ్ళీ ఓ గంటకల్లా వొచ్చేశారు. తిరిగి సాయంత్రం ఐదు గంటల కెళ్ళారు."

"ఎక్కడికైనా వెడితే చెప్పి వెళ్ళరా?"

"నాతో సెప్పలేదండీ... గోవిందమ్మతో సెప్పారేమో!"

"ఆవిడెవరు?"

"ఈ యింట్లో వంట మనిసి..."

"సరే. నువ్వెళ్ళి గోవిందమ్మని పంపించు."

"దండాలండి..." వెళ్ళిపోయాడు గోపయ్య.

కుర్చీకి ఆనుకొని సిగరెట్ తీశాడు జలంధర్. వెలిగించుకునేలోగా దాదాపు ముప్పై సంవత్సరాల ఆడమనిషి లోనికి ప్రవేశించింది కాస్త బెరుగ్గా.

"నీ పేరు గోవిందమ్మ కదూ!" గట్టిగా దమ్ము పీల్చి ప్రశ్నించాడు జలంధర్.

"అ... అవును బా...బూ!" తడబడిందామె.

"ఎన్నేళ్ళ క్రితం చేరావిక్కడ?"

"దాదాపు ఆరు సంవత్సరాలైంది."

"నీ డ్యూటీ ఏమిటి?"

"ఇల్లు వూడ్చడం, అంట్లు తోమటం, వంటచెయ్యటం, అమ్మాయిగారికి కావలసిన సదుపాయాలు చూట్టం."

"ఈ రోజు ఉదయం కాత్యాయని ఎక్కడికెళ్ళింది?"

"ఎక్కడికో వెళ్ళింది. చెప్పలేదు." ఆమె ముఖంలో గాభరా కన్పించింది.

"అబద్ధం చెప్పటానికి ప్రయత్నించకు. ఆమె తన స్నేహితుణ్ణి కలుసుకోటానికి వెళ్ళింది. అవునా?" రెట్టించాడు జలంధర్.

"ఆ...అవును." చెప్పక తప్పలేదు గోవిందమ్మకి.

"చెప్పు... అతనెవరు?" అనాలోచితంగా కలిగిన అయిడియాకి మనసులోనే నవ్వుకుంటూ అడిగాడు జలంధర్.

"అతను... అతని పేరు."

"నిర్భయంగా చెప్పు..."

"అశోక్ కుమార్... దయచేసి అయ్యగారికి ఈ విషయం తెలియనివ్వకండి. మీకు పుణ్యముంటుంది. తెలిస్తే నా ప్రాణం తీస్తారయ్యగారు. అతనెవరో నాకూ తెలీదు, దేవుడి మీదొట్టు." అమాయకంగా నెత్తిమీద చెయ్యి పెట్టుకుంది గోవిందమ్మ. ఆమె కళ్ళలో నీళ్లు తిరిగాయ్.

"నువ్వెప్పుడైనా చూశావా అతన్ని?"

"ఒక్కసారి చూశాను."

"ఎప్పుడు? ఎక్కడ?"

"నెల క్రితం అమ్మాయి పుట్టిన రోజు పండగ జరిగింది. ఆ రోజు ఎంతో సంతోషంగా గడిచిపోయింది. ఆ రాత్రే అత్యవసరమైన పనిమీద తెనాలి వెళ్ళిపోయారయ్యగారు. మూడు రోజులదాకా రానని చెప్పారు. ఆ మరురోజు ఆ అబ్బాయిని తీసుకొచ్చింది కాత్యాయనమ్మ. నాతోనే వంట చేయించి అతనికి పెట్టింది."

"వారిద్దరూ ప్రేమించుకున్నారా?"

"అవును."

"శారీరకంగా వారిద్దరికీ సంబంధం వుందా?"

"వుంది. ఆ రోజు మధ్యాహ్నం భోంచేశాక ఓ అరగంటయ్యాక ఇద్దరూ కాత్యాయనమ్మ గదిలోకెళ్ళి తలుపు లేసుకున్నారు. గంటన్నర వరకూ బయటికి రాలేదు."

"అతని గురించి నీకేమైనా తెల్సా?"

"అంతకు మించి నాకేం తెలియదు. అయినా ఒక్కసారి చూసినంత మాత్రాన్నే ఏం తెలుస్తుంది?"

"వాళ్ళిద్దరి విషయం నీకు తెలుసునని కాత్యాయనికి తెల్సా?"

"తెలుసు. ఆమే చెప్పింది. ఎవరితోనూ చెప్పొద్దంది."

"ఎవరితోనైనా చెప్పావా?"

"ఇప్పుడు మీతో చెప్పాగా?"

"రైట్... అశోక్కుమార్ వచ్చిన రోజు మిగతా ముగ్గురు నౌకర్లూ ఇక్కడే వున్నారా?"

"లేరు. ఏదో పని కల్పించి ముగ్గుర్నీ బయటికి పంపించేసింది కాత్యాయనమ్మ."

"అమ్మాయెప్పుడైనా తనలో తను బాధ పడ్డంకాని, కుమిలిపోవటం కాని చూశావా?"

"లేదు."

"అశోక్కుమార్ ఫోటో ఏదైనా వుందా?"

"లేదు... ఆఁ... వుంది... ఇద్దరూ కలిసి తీయించుకున్న ఫోటో ఒకటి వుంది."

"తీసుకు రా... వద్దులే... అదక్కడే వుండనివ్వు. నేనిక్కడి నుండి బయటకు వెళ్ళేటప్పుడు డైరీ ఇక్కడుంచి వెడతాను. సమయం చూసుకుని గుట్టుగా తెచ్చి పెట్టెయ్ అందులో. ఇక నువ్వెళ్ళొచ్చు."

తలూపి నమస్కారం చేసి వెళ్ళిపోయింది గోవిందమ్మ నుదుటికి పట్టిన చెమటని తుడుచుకుంటూ.

హుషారుగా మరో సిగరెట్ వెలిగించుకున్నాడు జలంధర్. ఇంతలో మూడో వాడొచ్చాడు.

"నా పేరు ఖాన్ అయ్‌గోరూ!" అన్నాడు.

"పూర్తి పేరు?" గుండెల నిండా పొగ పీల్చి ప్రశ్నించాడు జలంధర్.

"ఖాదర్ ఖాన్."

"ఎన్నాళ్ళైంది నువ్వు పన్లో చేరి?"

"గోపయ్యా, నేను ఒకేసారి చేరాం."

"ఒకే రోజా?"

"అవును."

"మీరు రాక ముందు ఎవరెవరున్నారు నౌకర్లు?"

"డ్రైవరు దేవిడు, వంట మనిషి మాణిక్యమ్మ."

"ఆమేమైంది?"

"ఆమె వంటచేసి వచ్చే జీతంలో కొడుకును చదివిస్తూండేది. అతని చదువు అయిపోయిన తర్వాత వెంటనే వచ్చి తీసికెళ్ళాడు."

"నిన్ను, గోపయ్యాని ఒకేసారి పన్లోకి తీసుకోవలసిన అవసరం మీ అయ్యగారికి రావడానికి కారణం?"

"అనుకోకుండా జరిగింది. అప్పుడు అయ్‌గారి యాపారం ఇలా సాగడంలేదు. అదీగాక అమ్మాయిగోరు అప్పుడు ఎనిమిది, తొమ్మిదేళ్ళ వయసులో వున్నారు. అయ్‌గోర్ని బాగా ఏడిపిస్తూండేవోరు. అయ్‌గోరు పూరిగ్గాని, బయటిగ్గాని ఎడితే అమ్మాయిని సముదాయించేవో రెవరు?"

"మాణిక్యమ్మ వుండేదన్నావ్ గా!?"

"ఉండేది. కాని ఆమెకు యింటిపన్లో, వంటపన్లో మధ్యాన్నం వరకు, సాయంకాలం ఆరునుండి తొమ్మిది వరకూ సరిపోతూండేది. ఆ సమయాంలో, ఈ సమయంలో పాపని చూడ్డాని కెవరూ లేకపోయారు. అందుకే గోపయ్యను పాపకోసమే పన్లోకి తీసుకున్నా రయ్‌గోరు."

"అయితే యిద్దరిలో నువ్వే ముందొచ్చావన్నమాట."

"లేదు. తర్వాత నే వచ్చాను."

"నువ్వెలా చేరావ్?"

"అప్పుడు నాకు పదిహేడేండ్లు. ఓ మంగుల షాపులో

పనేస్తూండేవాణ్ణి. ఓరోజు మా బంధువుల యింట్లో పెండ్లి జరిగింది. నాకు సెలవు దొరక్క పోవడంతో మా నాన్న, అమ్మ చెల్లాయి వెళ్ళారు. తిరిగొచ్చేటప్పుడు రైలు ప్రమాదంలో చచ్చిపోయారు. ఆ బాధతో వారంరోజులు పనికి పోలేదు నేను. మా యజమానికి కోపంవచ్చి నన్ను పన్లోంచి తీసేశారు.

మూడురోజులు తిండిలేకుండా ఆకలికి ఆపుకోలేక పోయాను. నడుస్తూండగా ఓ హోటల్ ముందు అయ్‌గోరు ఎవరితోనో మాట్లాడుతూ కన్పించారు. తెలీకుండా ఆయన జేబులోంచి పర్సు తీశాను. అక్కడే వున్న డేవిడ్ నన్ను పట్టుకున్నాడు. జనం పోగయ్యారు. నాలుగైదు దెబ్బలు పడ్డాయ్ నామీద.

అయ్‌గోరు అందర్నీ వారించి నా వివరాలు కనుక్కున్నారు. జాలిపడి హోటల్లో కడుపునిండా తిండి పెట్టించారు. నా కథ విని జాలితో ఆరితోపాటే నన్నూ తీసుకొచ్చి తనదగ్గర నౌకరుగా పెట్టుకున్నారు. నేనొచ్చానని గోపయ్యాను తీసెయ్యలేదు. నేను తోటపని, పై చిల్లర పనులు చేస్తుండేవాణ్ణి" అంతటితో ఆగాడు ఖాన్.

"ఐ. సీ. నెలరోజుల క్రితం కాత్యాయని పుట్టినరోజు పండగ జరిగిందా?"

"అవును. జరిగింది."

"ఆ మరుసటిరోజు మధ్యాహ్నం నువ్వింట్లో నే వున్నావా?"

"లేనయ్‌గోరూ!"

"ఎక్కడి కెళ్ళావ్?"

"పక్క వూళ్ళో తన స్నేహితురాలుందని ఆమెకో

ఉత్తరం ఇచ్చిరమ్మని చెప్పి పంపింది ముగ్గుర్నీ."
"ఇచ్చేశారా?"
"ఉఁహూఁ. ఆమె అడ్రస్ కోసం తిరిగి తిరిగి వచ్చాం. సంవత్సరం క్రిందటే ఆ వూరు వదిలి పోయిందని తెల్సింది."
"ఆల్ రైట్. నువ్వెళ్ళొచ్చు."

సలామ్ చేసి వెళ్ళిపోయాడు ఖాదర్ ఖాన్.

డేవిడ్ ప్రవేశించాడు.

## 4

"హలో! కమాన్. మీ కోసమే యెదురుచూస్తున్నాను."

"వాట్ శ్రీనివాస్! వాట్ హేపెండ్! విషయం చెప్పకుండా ఫొటోగ్రాఫర్ని, ఫింగర్ ప్రింట్ ఎక్స్పర్ట్ని పిల్చుకురమ్మని ఫోన్ చేశాడు మీ బాస్. కొంపదీసి హత్య కాదు కదా!"

"హత్య కాకపోతే మీతో ఏం పని?" నవ్వుతూ కాడిలాక్ వైపు నడిచాడు శ్రీనివాస్. అనుసరించారు ముగ్గురూ.

డోర్ తెరిచి సన్నివేశాన్ని చూపించాడు శ్రీనివాస్.

వ్రేలిముద్రలేమైనా కనపడతాయేమోనని అనుమానమున్నచోటల్లా పౌడర్ చల్లాడు ఫింగర్ ప్రింట్ ఎక్స్పర్ట్.

ఆశ్చర్యం! ఒక్క వ్రేలిముద్రయినా బయటపడలేదు!

నిరాశగా నిట్టూర్చాడు శ్రీనివాస్.

శవం నాలుగైదు ఆంగిల్స్లో ఫొటోలు తియ్యబడింది.

"ఎలా జరిగింది?" ప్రశ్నించాడు చక్రవర్తి.

"ఆమెనెవరూ హత్య చెయ్యలేదిన్స్పెక్టర్! బాక్ సీటుకేసి చూస్తుండగా ప్రాణంపోయింది. అంటే అక్కడ

APS 2

ఆమె హార్టు ఫెయిలవటానికి తగినంత భయంకరమైన సన్నివేశాన్ని ఆమె చూసుండాలి. అదే ఏమయ్యుంటుందాని ఆలోచించలేక ఛస్తున్నా!''

''హత్య జరిగిన ప్రదేశం?''

''అదీ తేలలేదింకా.''

''ఇక్కడే ఎందుక్కాకూడదు?''

''మరోచోటెందుక్కాకూడదు?''

''మరోచోట హత్య జరిగితే ఇక్కడికెలా వస్తుంది?''

''ఎవరేనా తీసుకొని రావచ్చు...కరెక్ట్. మన మూహించింది నిజమే అయితే అలాగే జరిగుంటుంది. శవాన్ని చూడు. డ్రెస్ చూస్తే ఎక్కడో బయటినుండి వస్తున్నట్టుంది.''

''బయల్దేరుతూ వుండి వుండొచ్చుగా?''

తల అడ్డంగా తిప్పాడు శ్రీనివాస్. ''ఉఁహూఁ... బయలుదేరేట్టయితే నౌకర్లు మేలుకొనుండేవారు. వెంటనే తెలిసిపోయుండేది. కాబట్టి వచ్చేప్పుడే జరిగుండాలి.''

''చనిపోయాక ఎవరు వదిలిపెట్టుంటారు?''

''బాక్ సీట్లో వున్నవారు.''

''కాబట్టి వెనకసీట్లో వున్నది మనిషేనని తేలిపోయింది.''

''ఇక్కడ కొంచెం ఆలోచించవలసుంది. మనిషిని. చూసినంత మాత్రాన్నే ప్రాణం పోవటానికి ఆస్కారం వుంటుందంటావా?''

''లేకపోతే దెయ్యమంటావా?''

''ఎందుక్కాకూడదు? ఆ ముఖంలో వున్న భయాందోళనలు చూస్తోంటే అలాగే నన్పిస్తోంది.''

''దెయ్యం డ్రైవ్ చెయ్యగలదా?''

"ఈ కాలం దెయ్యాలు అన్నీ చెయ్యగలుగుతున్నాయి."

"అలా నువ్వే అంటావ్; ఇలా నువ్వే అంటావ్. ఇంతకీ బాక్ సీట్లో వున్నది మనిషా? దెయ్యమా?"

"అదే కనుక్కోవాలి. కమాన్. బాస్‌తో మాట్లాడదాం. ఈ కేసుపై యిప్పుడే ఇంట్రెస్టు పెరుగుతోంది. ఈ లోగా బాస్‌కి కొన్ని విషయాలు తెలిసుంటాయ్" లోపలకి నడిచాడు శ్రీనివాస్. అనుసరించాడు చక్రవర్తి.

## 5

"నలుగుర్ని ప్రశ్నించాను. కాని కేసుకి పనికొచ్చే సమాచారం ఒక్కటీ అందలేదు."

"వాళ్ళకేం తెల్సు జలంధర్ గారూ!?"

"మీ కెవరేనా శత్రువులున్నారా?"

"లేరు. అయినా నాపై శత్రువులుంటే నామీద పగ తీర్చుకోవాలి కాని, అభం శుభం తెలియని నా కూతురుపై ఎందుకు సాధిస్తారు?'.

"మీకు గ్లాస్ ఫాక్టరీ వుంది కదూ!"

"అవును."

"పార్ట్‌నర్స్ వున్నారా? మీరొక్కరేనా?"

"మొత్తం ఇద్దరమే."

"మరొకరెవరు?"

"నరహరిరావు."

"వారెక్కడున్నారు?"

"ప్రస్తుతం మద్రాసులో."

"ఏం చేస్తున్నారు?"

"ఉన్న ఆస్తినంతా బిల్డింగుల రూపంలో మార్చే శారు. ఇప్పుడాయనకి పదంతస్థుల భవనాలు ఆరున్నాయి. కొన్ని ఆఫీసులకి, కొన్ని హోటళ్ళకి ఇచ్చేసి బాడుగలతో హాయిగా వున్నారు."

"ఆయన అప్పుడప్పుడూ ఇక్కడ కొస్తుంటారా?"

"రారు. ఆయనకి నాపై నమ్మకముంది. సంవత్సరానికి వచ్చే ఆదాయంలో వన్ థర్డ్ మాత్రం తనకి పంపమన్నారు. అంతే...ఎప్పుడేనా వస్తే నన్ను చూసి వెళ్ళిపోతారు. ఫాక్టరీ వంక కన్నెత్తికూడ చూడరు."

"ఐసీ. మీ నౌకర్లు మీ యింట్లోనే పడుకుంటారు కదూ ప్రతిరోజూ!"

"అవును."

"మీ అమ్మాయి ఎంతవరకు చదువుకుంది?"

"పి. యు. సి. పాసైంది."

"చదివేరోజుల్లో ఆమెకి బోయ్‌ఫ్రెండ్స్ వుండే వారా?"

"నాకు తెలిసినంతలో ఎవరూ లేరు."

"ఈ మధ్య మిమ్మల్ని బెదిరిస్తూ ఏవైనా వుత్తరాలు కాని, టెలిఫోన్ కాల్స్ గాని వచ్చాయా?"

"రాలేదు."

"థ్యాంక్యూ వెరీమచ్. పదండి. ఇన్‌స్పెక్టర్ వాళ్ళొచ్చి వుంటారు. సమాచారం ఏదైనా తెలవచ్చు." జగదీష్ బాబు చూడకుండా తన డైరీని జారవిడిచాడు జలంధర్.

జగదీష్‌బాబు కూడ లేచాడు.

జలంధర్‌ని చూడగానే విష్ చేసాడు చక్రవర్తి.

"ఎంతసేపైంది మీరొచ్చి?"

"జస్ట్ ఫైవ్ మినిట్స్ బ్యాక్..."

"శవాన్ని చూపావుగా!" శ్రీనివాస్ వైపు చూశాడు.

"చూపాను. ఆలోచించగా కాత్యాయని హత్యకి కారణం ఇదమిద్ధంగా చెప్పలేను గాని మొత్తానికి ఏదో దెయ్యమే ఆమె ప్రాణం పోవటానికి కారణం అయ్యుండాలి."

"అంటే...?"

"కాత్యాయని మామూలుగా డ్రయివ్ చేస్తూంటుంది. వెనుక నుండి ఆమెను బెదిరించి వుండాలి. ఈ విషయాన్ని బట్టి వెనుక బెదిరించింది ఎవరో మనిషని చెప్పొచ్చు. అలా బెదిరించగానే ఆమె వెనక్కి తిరిగింది. శరీరంపై ఏ గాయమూ లేకుండానే మరణించింది. అంటే ఆమె హార్టు ఫేలయింది. పోనీ విష ప్రయోగం జరిగిందనుకుందాం. అలా అయితే ఆమె శరీరం నల్లబడాలి. అలా జరగలేదు. సో, విష ప్రయోగం జరగలేదు. ఊహించని భయానక దృశ్యం ఆమె కంటబడుండాలి. వెనకున్న వారు మనిషైతే ఆమె గుండె ఆగిపోనవసరం లేదు. స్పృహ పోవచ్చు. కాబట్టి ఆమెకి వెనక కన్పించింది దెయ్యమని వూహించొచ్చు" ఆగాడు శ్రీనివాస్.

"అఫ్‌కోర్స్..." కాసేపు ఆలోచనల్లో పడిపోయాడు డిటెక్టివ్ జలంధర్. ఓ నిమిషం తర్వాత ఇన్స్‌పెక్టర్ వైపు తిరిగి "శవాన్ని పోస్ట్‌మార్టమ్‌కి పంపండి. రిపోర్ట్ అందగానే నాకు ఫోన్ చెయ్యండి." అని చెప్పి జగదీష్ వైపు చూస్తూ—

"మిస్టర్ జగదీష్‌బాబూ! ఈ విషయంలో మీరు దిగులు మానండి. సాధ్యమైనంత త్వరలో మీ కూతురి

మరణానికి కారణమైన దుర్మార్గుల్ని పట్టి ఉరికంబానికెక్కిస్తాను. మీరు మాత్రం ధైర్యాన్ని విడనాడకుండా యథేచ్ఛగా మీ కార్యక్రమాలు నిర్వహిస్తూ వుండండి. డీలా పడినట్టు వూహా మాత్రంగా కూడ ఎవరికీ అనుమానం కలిగేలా కన్పించకండి. నాతో అవసరం వస్తే ఫోన్ చెయ్యండి.'' ఫోన్ నెంబరు గల విజిటింగ్ కార్డు అతని చేతిలో పెట్టాడు జలంధర్.

''జలంధర్ గారూ!'' అతని చేతులు పట్టుకున్నాడు జగదీష్ బాబు.

మౌనంగా అతని భుజంమీద తట్టాడు జలంధర్ ఓదార్పుగా.

''మరి మేం వెళ్ళొస్తాం...'' అన్నాడు సిగరెట్ డబ్బా తీస్తూ.

''బాబుగారూ! ఆ గదిలో మీ పుస్తకం మర్చిపోయారు. తీసుకోండి...'' గోవిందమ్మ వచ్చింది డైరీతో.

''థాంక్స్...''

''నా కారులో వెళ్ళండి. డేవిడ్!'' కేకేశాడు జగదీష్ బాబు.

''నో నో... టాక్సీలో వెడతాం. దార్లో వేరే పనుంది. థాంక్స్...'' అందరికీ విష్ చేసి, బయిటికి నడిచాడు డిటెక్టివ్ జలంధర్.

# 6

గదిలో ఫాన్ గిర గిరా తిరుగుతోంది.

అంతకంటే వేగంగా తిరుగుతున్నాయి జలంధర్ మస్తిష్కంలో ఆలోచనలు. సిగరెట్ మీద సిగరెట్ తాగుతోన్నాడు. ఆష్ట్రే సిగరెట్ పీకలతో నిండిపోయింది.

"రాత్రి తొమ్మిది - తొమ్మిదిన్నర మధ్య ప్రాణం పోయింది. ఏదో షాక్ వల్ల ఆమె గుండె ఆగిపోయింది. అంతే కాని ఏ విధమైన ఆయుధం కాని విషపూరితమైన ఏ పదార్థం కాని ఆమె మరణానికి కారణం కాదు. ఇదీ పోస్టుమార్టంలోని సారాంశం.

"అంటే ఆమె ప్రయాణం చేస్తూండగానే ప్రాణం పోయి వుండాలి. ఎంచేతంటే హత్య జరిగిన రాత్రి గోపయ్య తొమ్మిదిన్నరకి పడుకున్నాక పది నిముషాలకి - అంటే తొమ్మిదీ నలభైకి నిద్రపోయాడని చెప్పాడుగా!" జలంధర్ వైపు చూస్తూ అన్నాడు శ్రీనివాస్.

"అవును. అయితే కాత్యాయని ఆ సమయంలో ఎక్కడికి వెళ్ళుంటుంది?"

"సినిమాకి."

"తప్పు."

"ఎలా?"

"ఆమె ఉదయం పది గంటల ప్రాంతంలో బయటికి వెళ్ళింది. అంటే అశోక్‌ని కలవటాని కన్నమాట. వాళ్ళ నాన్న వూళ్ళో లేడు. కాత్యాయనికి, అశోక్‌కి శారీరక సంబంధం వుంది... అంటే అతన్తో కామకేళీ విలాసాల్లో మునిగి పోవటానికి సమయం నిర్ణయించుకోవటం కోసం వెళ్లుంటుంది. ఆ పిచ్చి వున్న వాళ్ళకి సినిమాలు చూడాలనే ఆసక్తి వుండదు. ఏమంటావ్?"

"అయితే అశోక్‌ని కలిసుంటుంది. ఆ తర్వాత సాయంత్రం ఐదుకి మళ్ళీ వెళ్ళింది. అంటే అశోక్‌తో గడపటాని కన్నమాట. అంటే మీ వుద్దేశ్యం ఆమెని అనుభవించిన తర్వాత అశోకే..."

"ఆ విషయం అంత త్వరగా నిర్ణయించటానికి వీల్లేదు. అశోక్ ఎంచేత ఆమెతో అంత సన్నిహితంగా వుంటో న్నాడో మనకి తెలీదు. పోనీ అతన్ని కలుద్దామంటే అతని అడ్రస్ లేదు మన దగ్గర... అన్నట్టు అడ్వర్టైజ్మెంట్ ఇచ్చావా?"

"ఇచ్చేశాను గోవిందమ్మ ఇచ్చిన ఫోటోతో సహా. రేపు పేపర్లో వస్తుంది."

"వెరీ గుడ్. ఓ సారి జగదీష్‌బాబు యింటికి వెళ్ళొ ద్దామా?"

"పదండి...."

శ్రీనివాస్ ఇంకా అంటూండగానే టెలిఫోన్ గణ గణ మంది. రిసీవరెత్తాడు జలంధర్.

"హలో... జలంధర్ స్పీకింగ్..."

"... ..."

"మేమే రావాలనుకుంటున్నాం మీ యింటికి."

"... ..."

".... వాట్!!?" ఉలిక్కిపడ్డాడు జలంధర్ "బయ ల్దేరి వస్తున్నాం వెంటనే..." రిసీవర్ హుక్ పై పడేసి, "పద వాసూ! ఒకటి కాదు మరో రెండు హత్యలు జరి గాయ్." గబగబా లేచాడు.

ఆశ్చర్యంగా అతన్ననుసరించాడు శ్రీనివాస్ మారు మాట్లాడక.

# 7

గోవిందమ్మ, ఖాన్‌లు ఎదురెదురుగా కూర్చునివున్నారు, ఇద్దరి దృష్టీ ఒకే వైపుకి కేంద్రీకృతమైవుంది. ఇద్దరి ముఖాల్లోనూ ఆశ్చర్యం, భయం ప్రస్ఫుటంగా కన్పి

స్తోన్నాయ్. ఇద్దర్లోనూ ప్రాణం లేదు!

"కాత్యాయని హత్యే పోలివుంది కదూ!" శ్రీనివాస్ వైపు ఆశ్చర్యంగా చూశాడు జలంధర్.

"అవును" శవాల వైపు చూస్తూనే అన్నాడు శ్రీనివాస్.

జగదీష్‌బాబుని ప్రక్కగదిలోకి తీసుకుపోయాడు జలంధర్.

"ఎలా జరిగింది జగదీష్‌గారూ!?"

"ఎలా జరిగిందో నాకూ అర్థం కావటంలేదు. డిటెక్టివ్ గారూ! వీళ్ళిద్దర్నీ చంపటానికి వాళ్ళ కవసరం ఎందుకొచ్చిందో బోధపట్టంలేదు," బాధగా అన్నాడు జగదీష్ బాబు.

"శవాలని ముందుగా ఎవరు చూశారు?"

"గోపయ్య."

"పిలవండి."

కేకేశాడు జగదీష్‌బాబు. వచ్చాడు.

"ముందుగా శవాల్ని చూసింది నువ్వేనా?"

"అవును బాబయ్యా!"

"ఎలా చూశావ్?"

"........."

"ఫర్వాలేదు చెప్పు."

"అయ్యగారు వూళ్ళో లేనప్పుడల్లా మమ్మల్నిద్దర్నీ ఏదో వంకతో బయటికి పంపిస్తూంటుంది బాబయ్యా! మ్యాటినీ కెళ్ళి వచ్చాం. తలుపు తెరవక పొయ్యేసరికి రెండు సార్లు పిలిచిలాగాను. చూసేసరికి..."

"ఇద్దరూ గదిలో వున్నారా! అంటే...?!"

"వారిద్దరికీ..."

"సరే...నువ్వెళ్ళు."

కళ్లు తుడుచుకుంటూ వెళ్ళిపోయాడు గోపయ్య.

"వారిద్దరికీ సంబంధం వుందని మీకు తెల్సా?"

"తెలీదు. ఏమిటో జలంధర్ గారూ! నాకంతా అయోమయంగావుంది. ఎందుకీ హత్యలు జరుగుతున్నాయ్? నా కుటుంబంపై ఎవరి కన్ను పడింది? నాశనం చెయ్యడానికెందుకు కంకణం కట్టుకున్నారు? అర్థం శుర్థం తెలియని అమ్మాయిని, నాకర్లనెందుకు చంపారు?"

"ఎందుకేనా మంచింది. మీరు, మిగిలిన వారు కాస్త జాగ్రత్తగా వుండండి."

"అంటే..."

"ఏమో చెప్పలేం. ముందు జాగ్రత్తలో వుండటం మంచిదేగా!"

"దయచేసి వాళ్ళని త్వరగా పట్టుకోండి డిటెక్టివ్ గారూ! నాకు చాలా భయంగా వుంది..."

"ఇకపై అహర్నిశలూ అదే పనిపై తిరుగుతాను. హంతకుడు ఎవరేనా కానీ, వారంలోగా పట్టుకుని వురికంబం ఎక్కిస్తాను. అంతవరకూ నిద్రపోను..." నిశ్చల గంభీర స్వరంతో అన్నాడు జలంధర్!

# 8

అతనికి పాతిక వుండొచ్చు వయసు...

ఎర్రగా వున్నాడు.కోల ముఖం. నొక్కుల జుట్టు. సన్నని మీసకట్టు, ఆకర్షణీయమైన విగ్రహం. బలిష్ఠమైన కండలు తిరిగిన శరీరం. తెల్లని షర్టు టక్ చేశాడు. చేతిలో న్యూస్ పేపరు.

"రండి..." అన్నాడు జలంధర్ అతన్నే చూస్తూ.

"జలంధర్‌గారు మీరేనా?" అన్నాడతను లోనికొస్తూ.

"అవును."

"మీరు డిటెక్టివులైతే కావచ్చు. కాని యిలా చెయ్యడం ఏమీ బాగోలేదు నన్నల్లరి పెట్టడంలో మీ ఉద్దేశం?"

"ఏం చేశాను?" చిరునవ్వుతో అన్నాడు జలంధర్.

"మీరు చేసిన పనేమిటో మీకే తెలీదూ!" న్యూస్ పేపర్ని జలంధర్ ముందుకి తోశాడు.

పేజీలు తిరగేశాడు జలంధర్.

వధువు కావలెను

డిగ్రీ చదువు చదివి, పెద్ద వ్యాపారము చేయుచున్న పాతికేళ్ళ అందమైన ఈ యువకునకు వధువు కావలెను. కులమేదైనా పట్టింపులేదు. 23 సం॥ల వయసు. చదువు, సంస్కారం గలిగి సంసారమును చక్కదిద్దుకొను నేర్పు ఓర్పులున్న చాలును. అభిలాషగల వారు తమ ఫోటోవున్నచో ఈ దిగువ చిరునామాకు పంపుతూ ఉత్తరం రాయండి.

జలంధర్
13_13, అబిద్ రోడ్,
హైదరాబాదు.

"ఈ రోజే పేపర్లో వచ్చింది. ఇప్పట్నుండే ఫోటోల కోసం వస్తే ఎలా?" నవ్వాడు జలంధర్.

"మీకు నవ్వులాటైంది. నాకేమో నాస్నేహితుల్లో తల వంపులైంది. మొన్నటివరకూ ఉద్యోగంకోసం కాళ్ళ

రగదిరిగి ప్రతిరోజూ నిరాశనే ఎదుర్కొన్న నేనేమిటి? పెద్ద వ్యాపారం చెయ్యడమేమిటి? పెళ్ళికోసం ప్రాకులాడటమేమిటి? పైగా ఫోటోతోసహా పేపర్లో ప్రకటన చెయ్యటమేమిటి?

"...మాకు తెలీకుండా అంత పెద్దవ్యాపార మెలా చేస్తున్నావ్? అసలా వ్యాపార మేమిటి? అని ఫ్రెండ్సందరూ నన్నల్లరి పట్టిస్తున్నారు. అసలు మీకు నాతో అవసరమేమిటి? హేళన చెయ్యటానికి మీకు నేనే దొరికానా?"

"మీతో అవసరం వుండే పిలిపించాం మిస్టర్ అశోక్!" గంభీరంగా అన్నాడు జలంధర్.

"ఏమిటా అవసరం?"

"మీకు కాత్యాయని తెల్సా?"

"ఏ కాత్యాయని?"

"మీకెంతమంది కాత్యాయన్లు తెలుసు?"

తడబడ్డాడశోక్.

"జగదీష్‌బాబు కూతురు."

"తెలుసు."

"ఆమె హత్య చెయ్యబడింది."

"అఁ...!!??" ప్రక్కలో బాంబు ప్రేలినట్టు అదిరిపడ్డాడు అశోక్. "...జలంధర్ గారూ! మీరెవర్ని గురించి చెబుతున్నారు?"

"మీరు ప్రేమించిన కాత్యాయని గురించే!"

"ఈ దారుణ హత్య యెలా జరిగింది? నా కాత్యాకి శత్రువు లెవరున్నారు? నేను ప్రాణపదంగా ప్రేమిస్తోన్న నా కాత్యా నెవరు చంపారు డిటెక్టివ్ గారూ!?"

మాట్లాడలేదు జలంధర్. అతన్ని కాసేపు బాధపడ నిచ్చాడు.

"...ఇద్దరం బాగా ప్రేమించుకున్నాం. పెళ్ళిచేసుకోవాలని కలలు గన్నాం. అంతలోనే ఇంత దారుణమైన వార్త వినవలసొస్తుందని కల్లోకూడ అనుకోలేదు. ఎవరికీ ద్రోహం చెయ్యని నా కాత్యాని హత్య చేయ్యాలనే దురాలోచన ఏ దుర్మార్గుడికి కల్గుతుంది?...ఇంకెవడికి? వాడికే కలిగుంటుంది." పళ్లు నూరాడు అశోక్.

"ఎవరికి?"

"జగదీష్‌బాబు గాడికి!"

నమ్మలేనట్టు చూశాడు జలంధర్.

"తండ్రి కూతుర్ని హత్య చెయ్యటమా?"

"తండ్రే కూతుర్ని రేప్ చేస్తోన్న ఈ రోజుల్లో హత్య చెయ్యటంలో వింతేముంది జలంధర్ గారూ!... అయినా అతడేమీ కనలేదుగా కాత్యాని!!"

"వివరంగా చెప్పండి."

"కాత్యాయని అతడి స్వంత కూతురు కాదు. అన్న కూతురు. అతనికి పిల్లల్లేరు."

"అని మీకెలా తెలుసు?"

"కాత్యానే చెప్పింది?"

"కాత్యా మీకెలా పరిచయం?"

ద్రవిస్తోన్న కళ్ళు తుడుచుకుని ప్రారంభించాడు అశోక్.

"అవి నేను బియ్యే చదువుతోన్న రోజులు. అప్పుడు మేం సనత్‌నగర్‌లో వుండే వాళ్ళం. ఓసారి సెలవుల్లో స్నేహితులం పదిమందిమి కలిసి మద్రాసు టూరిస్ట్

ప్రోగ్రామ్ వేసుకున్నాం. చూడాల్సిన వన్నీ చూసుకుని మెరీనా బీచి చేరుకున్నాం. అక్కడికి వీళ్ళూ వచ్చారు టూరిస్టు ప్రోగ్రామ్ వేసుకునే!

కాత్యాకి సముద్ర స్నానం చేసే అలవాటు లేదేమో, తల పైకెత్తి నీళ్ళలోకి వెళ్ళటం వల్ల కాబోలు... అలలు ఆమెని లోపలికి లాక్కున్నాయ్. ఎవరి ఆనందంలో వాళ్ళుండటం మూలాన ఆమె స్నేహితురాళ్ళు ఎవరూ పట్టించుకో లేదు. అనుకోకుండా నేను చూశాను. పరుగెత్తుకు వెళ్ళి ఆమెని కాపాడాను..."

"అయితే అలా పరిచయమయ్యారన్నమాట మీరు యిద్దరూ."

"అవును."

"మీ పరిచయం వృద్ధెలా అయ్యింది?"

"ఇద్దరిదీ హైదరాబాదేనని తెలిసిపోయింది. ఇక్కడి కొచ్చాక ఓసారి సినిమాలో కలుసుకున్నాం. వాళ్ళ నాన్నకి తెలిస్తే కేక లేస్తారని బయట బయటే కలుసుకుంటూందే వాళ్ళం."

"సినిమాల్లోనా?"

"సినిమాల్లో కొన్నిసార్లు, పబ్లిక్ గార్డెన్స్‌లో కొన్ని సార్లు, టాంక్‌బండ్ వద్ద కొన్నిసార్లు. పరిచయం పెరిగింది. ప్రేమగా మారింది. బాగా ప్రేమించుకున్నాం. కాత్యాయని తన సర్వస్వం నాకర్పించింది. త్వరలోనే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాం."

"ఎలా? జగదీష్‌బాబు అబ్జక్టు చేస్తే?"

"రిజిష్టర్ మేరేజ్ చేసుకునే వెళ్ళాలనుకున్నాం. ఆశీర్వదిస్తే సరి. లేకపోతే మా దారి మాది."

"ఇలా చేద్దామంటే కాత్యాయనేమంది?"

"కాత్యానే ఈ సలహా యిచ్చింది."

"మీరు చివరి సారిగా ఆమె నెప్పుడు కలుసుకున్నారు?"

"మొన్న రాత్రి."

"ఎక్కడ?"

"హోటల్ ఫుల్‌మూన్‌లో."

"మీరు హోటల్ నుండి ఎన్ని గంటల కొచ్చారు బయటికి?"

"సరిగ్గా తొమ్మిదికి."

"ఆ తర్వాత మీరు ఆమెతో వెళ్ళలేదా?"

"లేదు. తన కారులో డ్రాప్ చేస్తానంది. కాని ఆ సమయంలో నాకు అర్జంట్ పనుండింది. బరఖత్ పుర చమన్ వద్ద 'శోభ ఎంటర్ ప్రైజెస్'లో నాకు టైపిస్ట్ పోస్టిప్పిస్తానని మేనేజర్ చెప్పాడు. తొమ్మిది–తొమ్మిదిన్నర మధ్య ఇంటికి రమ్మన్నాడు. కాత్యా ఇంకాసేపు తనతో గడపమంది. కాని ప్రస్తుత పరిస్థితుల్లో నా కాళ్ళ మీద నేను నిలబడ్డం ముఖ్యం. కాత్యా నాకు దూరమయ్యేది కాదు. క్షణకాలోద్రేకానికి లొంగితే అవతల ఉద్యోగం చేజారి పోతుంది. అందుకే వెళ్ళాను విడిగా."

"కార్లో వెళ్ళలేకపోయారా? ఆమె డ్రైవ్ చేసుండేదిగా!"

"ఆవిడ స్వభావం మీకు తెలీదు. కామం ఎక్కువ. పైగా మొన్న కాస్త అసంతృప్తిగా కన్పించింది. ఆ సమయంలో ఏదీ పట్టించుకోదు. కారులోనే తన కార్యానికి పునిగొల్పి వుండేది. అందుకే విడిగా వెళ్ళాను."

"ఉద్యోగం వచ్చిందా?"

"వచ్చింది. కాని అంతకంటే ముఖ్యమైందే పోయింది." అశోక్ కళ్ళలో నీళ్లు తిరిగాయ్.

"మీ రెప్పుడు కలిసినా ఫుల్ మూన్ లో నే కలిసేవారా? లేక మరేదైనా వుందా?"

"మొదట్లో హోటల్ ఆకాష్‌కి రెండు, మూడుసార్లు వెళ్ళాం. కాని అక్కడికంటే ఫుల్ మూన్ లో ఎక్కువ కంఫర్ట్స్ కన్పించాయ్. అందుకే ప్రతిసారీ అక్కడికే వెళ్ళే వాళ్ళం. అక్కణ్నుంచి వస్తూ వస్తూ హోటల్ కని పక్కకి వచ్చి చెరో కోకాకోలా తాగేసి ఆమె అటు నే నిటు వెళ్లే వాళ్ళం."

"మీరిప్పుడు ఎక్కడుంటున్నారు?"

"ఫ్రెండ్ రూమ్‌లో వుంటున్నాను."

"అత నేం చేస్తాడు?"

"రూప ఎంటర్‌ప్రెయిజెస్ అని మా ఆఫీసు ప్రక్కన్నే వుంది. అందులో అతడు స్టెనోగ్రాఫర్. పేరు మోహన్. ఆ రెండాఫీసుల ప్రొప్రైటర్లూ అన్నదమ్ములే."

"అతనికి మీ ప్రేమ విషయం తెల్సా?"

"రెణ్ణెల్ల క్రితం నేనే చెప్పాను."

"ఏమన్నాడు?"

"కంగ్రాట్స్ చెప్పాడు."

"మీ విషయాల్లో తల దూర్చేవాడా తరచూ?"

"లేదు. అతనూ ఓ అమ్మాయిని ప్రేమిస్తున్నాడు. పేరు యశోధర. ఎప్పుడూ ఆ అమ్మాయిని గురించే చెబుతూండే వాడు. అతని సమస్యలు చెబుతూ నా సలహాలు తీసుకునే వాడు కాని, నా గురించి ఒక్కటీ అడిగేవాడు కాడు."

"బైదిబై...ఇందాక మీరు జగదీష్‌బాబుపై అనుమానం వెలిబుచ్చారు. వివరించగలరా?"

"వివరాలు నాకూ తెలీవు. బహుశ మా సంగతి అతనికి తెలిసిపోయివుండొచ్చు. కాత్యాయని నన్ను చేసుకుంటే తన పరువుకి భంగం కలగొచ్చని గుట్టుగా హత్యచేసుండొచ్చు. అప్పటికింకా నాకు ఉద్యోగం కూడ లేదుగా!"

పరువును గురించి జగదీష్‌బాబు అన్న మాటలు గుర్తొచ్చాయ్ జలంధర్‌కి.

"మీరు, కాత్యాయని ప్రేమించుకున్నట్లు, పెళ్ళిచేసుకోవాలనే ఉద్దేశ్యంతో వున్నట్టు జగదీష్‌బాబుకి తెల్సా?",

"ఈ విషయం రూఢిగా చెప్పలేను."

"మెనీ థాంక్స్ మిస్టర్ అశోక్! మీరు కలవటంవల్ల కేసుకి సంబంధించిన కొత్త వివరాలు తెలిశాయ్. మీ అడ్రస్ మాకు తెలీదు. అందువల్ల మిమ్మల్నీవిధంగా పిలిపించాల్సొచ్చింది. మావల్ల మీకు తలవంపులు జరిగినందుకు మన్నిస్తారు కదూ!"

"ఎంత మాట సార్! అసలు విషయం తెలీక తొందరపడ్డాను. క్షమించండి. మరేం ఫర్వాలేదు...డిటెక్టివ్ గారూ! నా కాత్యా హత్యకి కారణమైనవాణ్ణి నాకు చూపించండి. ప్లీజ్..." నీళ్లు నిండిన కళ్ళతో అన్నాడు అశోక్.

'తప్పకుండా...' అన్నట్టు అతనివైపు చూశాడు జలంధర్. అడ్రసు తీసుకొని అతనిని పంపించివేశాడు.

## 9

తలుపు తెరిచి మెల్లిగా లోపలి కడుగుపెట్టాడు జలంధర్. లోపల చీకటిగా వుంది! కన్ను పొడుచుకున్నా

ఏ వస్తువూ కన్పించేలా లేదు. నెమ్మదిగా తలుపులు మూసి జేబులోంచి పెన్‌టార్చి తీసి చుట్టూ చూశాడు. జాకెట్లు, బ్రాలు తగిలించబడి వున్నాయి హేంగర్స్‌కి. దాని ప్రక్కనే ఓ టేబులు, ఓ బీరువా, ఓ మంచం కన్పించాయ్.

బీరువావద్దకి వెళ్ళి లాగిచూశాడు. రాలేదు. జేబులోంచి మాస్టర్ కీ తీసుకుని లోనికి దూర్చి రెండుమూడుసార్లు అటుయిటు తిప్పాడు. 'టక్'మని శబ్దం విన్పించింది. చిన్నగా నవ్వుకుని తలుపులు తెరిచాడు.

అన్నీ ఖరీదైన చీరలే! వరుసగా అమర్చబడివున్నాయి. పై అరలో కాత్యాయని ఫొటో ఫ్రేమ్‌లో వుంది. రెండో అరలో ఆమె ధరించే నగలున్నాయ్. మూడోదాన్లో ఏవేవో పుస్తకాలున్నాయ్.

గబగబా పుస్తకాలన్నీ తిరగేశాడు. కావలసిందేదీ కన్పించలేదు. అన్నీ సర్దేసి చీరలు ఒక్కొక్కటే బైటికి తీసి మడతలు విప్పి చూడసాగాడు.

ఓ చీర మడతలో మడిచిన కాగితం కన్పించింది. ఆత్రంగా మడతలు విప్పాడు. జలంధర్ కండ్లు మెరిశాయ్.

దాన్ని జేబులో పెట్టేసుకుని బీరువా అంతా వెతికాడు. ఏదీ దొరకలేదు. అల్మైరా తలుపులు మూసి, వచ్చిన దారినే బయటపడ్డాడు.

ఇంటికి చేరుకున్న తర్వాత ఆ ఉత్తరం తీసి తీరికగా చదివాడు.

"కాత్యాయనీ!

నీకోసం నేనెంతగా తపిస్తున్నానో నాకే తెలీటం లేదు. కాని నువ్వు ప్రతిసారీ నన్ను విదిలించి కొడు

తున్నావ్. ఏం? ఆ అశోక్ గాడికంటే నేనందంగా లేనా? వాడికి ఆస్తి లేదు. ఏం సుఖపడదామని వాణ్ణి చేసుకుందామనుకుంటున్నావ్?

నన్ను చేసుకోమని చెప్పను. కాని ఒక్కసారి నీవద్ద అమరసుఖాన్ని పొందాలని ఎన్ని రోజులుగా ఎదురు చూస్తున్నానో తెలుసుకుంటే నువ్విలా ప్రవర్తించవ్. మీ యిద్దరూ ఎప్పుడు, ఎక్కడ కల్సుకుని ఏం చేస్తుందేదీ నాకు తెల్సు. అంతేకాదు. అశోక్ వల్ల నువ్వు నెల తప్పి టాబ్లెట్స్ మింగింది కూడ నాకు తెలుసు!

ఇవన్నీ తెలిస్తే నీ పరువు, మీ నాన్న పరువు ఎందులో కలుస్తాయో ఒక్కసారి వూహించుకో. ఇది నా ఐదో ప్రయత్నమే కాదు. ఆఖరి ప్రయత్నం కూడ! గుర్తుంచుకో. నీ నిర్ణయం ఈ సాయంత్రం నాలుగులోగా తెలియజెయ్.

నీ పొందుకోసం తపిస్తోన్న
నీ
మదన్."

మరోసారి చదువుకున్నాడు జలంధర్ ఆ ఉత్తరాన్ని. 'ఎవరీ మదన్? తేదీ వెయ్యలేదు. మిగత నాలుగుసార్లూ అతడు ఉత్తరాలే రాశాడా? మరి తనకి చివరి ఉత్తరమే దొరికిందే! మిగత నాలుగూ ఏమయ్యాయ్? అవి కూడ కాత్యాయని గదిలోనే వున్నాయా? లేక చించేసిందా?

ఇంతకీ మదన్ ప్రయత్నం నెరవేరిందా? కాత్యాయని అందుకంగీకరించిందా? ఐదోసారి కూడ విముఖత చూపించిందనే కోపంతో మదనే ఆమెని హత్యచేశాడా? లేక ఆమె అంగీకరించిన పక్షంలో ఆ సంగతి తెలుసుకుని అశోక్ ఆమెని చంపాడా? హత్య చేసినవాడు ఆ

కోపంలో మదన్ ని మాత్రం వూరికే వదుల్తాడా?'

జలంధర్ ఆలోచల కంతరాయం కలిగిస్తోన్నట్టుగా టెలిఫోన్ గణగణ మోగింది.

విసురుగా ఫోనెత్తి "హలో. డిటెక్టివ్ జలంధర్ స్పీకింగ్." అన్నాడు.

"నేను...చక్రవర్తిని." అవతల్నుండి విన్పించింది.

"ఏమిటి విశేషాలు?"

"అడుగుదామనే ఫోన్ చేశాను. ఏమైనా తెల్సిందా?"

"కేసంతా గందరగోళంగా వుందని మాత్రమే తెల్సింది."

"అదేమిటి?"

"హత్య చేసిందెవరో తెలీటంలేదు. పైగా ఫలానా అని చెప్పటానికి వీలులేకుండా గుంభనంగా వున్నారు. ఎవర్ని గురించి ఆలోచించినా వారే హత్యచేసినట్లు తోస్తోంది."

"ఎనీ హెల్ఫ్ ఫ్రమజ్?"

"వద్దొద్దు. నీవు ముందే చెప్పావుగా! జగదీష్‌బాబు ఆ భారాన్ని మాపైనే వుంచాడు. పరిశోధన అతి రహస్యంగా జరగాలన్నాడు. అయినా యిందులో అంత కష్టపడాల్సిందేదీలేదు చక్రవర్తీ! ఒక్క చిన్న క్లూ దొరికితే చాలు. కేసు తేలిగ్గా విడిపోతుంది.

కాని, ప్రత్యర్థులు చిన్న ఆధారాన్ని కూడ ఇవ్వటంలేదు. అంటే ఏ చిన్న ఆధారం దొరికినా ఇమ్మిడియట్ గా పట్టుబడతామనే భయం అనుక్షణం వారి వెంటే వుంది! ఈ కేసులో నాతోబాటు పనిచేసే అవకాశం ఎటూ లేదుగా నీవు! ఓ పని చెయ్."

''ఏమిటది?''

''మొన్నటి 'ఆంధ్రప్రభ'లో ఓ ఫొటో వచ్చిందిగా వధువు కావాలని! అతనిది రాజమండ్రి. నువ్వేలాగైనా అక్కడ ఎంక్వయిరీ చేయించి అతని గురించి వాకబు చెయ్యి. అతడెలాంటివాడో తెల్సుకుని నాకు ఫోన్ చెయ్.''

''అదెంత పని?''

''శ్రీనివాస్‌నీ మద్రాసు పంపించాను, ఈ రోజు రేపట్లో రావచ్చు.''

''ఓ.కే. బాయ్!'' క్లిక్‌మని శబ్దం వచ్చింది. జలంధరూ ఫోన్ పెట్టేశాడు. పెట్టీపెట్టగానే మళ్ళీ మ్రోగింది ఫోను. ఎత్తాడు.

''జగదీష్‌ని మాట్లాడుతున్నాను. జలంధర్ గారా!?'' ఆందోళనగా వుంది కంఠం.

''అవును. నేనే!''

''మీరు వెంటనే రావాలి.''

''ఏం జరిగింది జగదీష్‌గారూ?''

''వచ్చాక చెబుతాను.'' జగదీష్‌బాబు కంఠంలో వణుకు స్పష్టంగా విన్పిస్తోంది!

''పది నిమిషాల్లో అక్కడుంటాను.'' ఫోన్ పెట్టేసి ఆత్రంగా లేచాడు డిటెక్టివ్ జలంధర్!

పది నిమిషాల్లో జగదీష్‌బాబు ఇంటిముందాగింది కారు. పరిగెడుతూన్నంత వేగంగా లోనికి నడిచాడు జలంధర్.

''ఏమిటి జగదీష్‌గారూ!?''

''అటు చూడండి.''

చూశాడు జలంధర్.

గోపయ్య, డేవిడ్ ఇద్దరూ నాలుగో మెట్టుపై పడి వున్నారు. ఇద్దరిలో ప్రాణం లేదు. ఇద్దరి మొహాల్లోనూ భయసంభ్రమాలు!

"మైగాడ్!" అప్రయత్నంగా అన్నాడు జలంధర్.

"జలంధర్ గారూ...!" ఏడుస్తూ అన్నాడు జగదీష్ బాబు. 'తర్వాతి వంతు నాదే'నన్నట్టుగా వుందతని ముఖం.

ఏం మాట్లాడాలో తోచలేదు జలంధర్ కి.

# 10

శ్రీనివాస్ వైపు తిరిగాడు వకీలు గోపాలశర్మ.

"జగదీష్ బాబుగారి వకీలు మీరే కదూ?"

"అవును."

"ఆయనకో కూతురుంది కదూ?"

"ఉంది."

"ఆస్తి ఆమె పేరుతో వుందా? లేక వాళ్ళ నాన్న పేరుతో వుందా?"

"జగదీష్ బాబు అనుమతి లేనిదే మీకా వివరాలు చెప్పలేను. ఈ వివరాలన్నీ ఎందుకడుగుతున్నారు?" అనుమానంగా అడిగాడు గోపాలశర్మ.

"ఆ అమ్మాయి హత్య చెయ్యబడింది."

"నిజమా?" ఉలిక్కిపడ్డాడు గోపాలశర్మ,

"అవును."

"మొన్నటివరకూ నేను హైద్రాబాదులో నే వున్నాను. నాతో చెప్పనేలేదే!"

"ఆయనెవరితోనూ చెప్పలేదు."

"........."

"నేనడిగిన ప్రశ్నకి మీరు జవాబు చెప్పనేలేదు."

"అడగండి."

"ఆ స్తి ఎవరి పేరుతో వుంది?"

"అమ్మాయి పేరుతో వుంది."

"తన పేరుతో రాయించుకోవాలనుకుంటున్నట్టు మీతో ఎప్పుడేనా అన్నారా జగదీష్‌బాబు?"

"అన్లేదు. ఎందుకంటారు? ఆయనే బలవంతంగా అమ్మాయి పేరుతో చేయిస్తేనూ!"

"ఇంతకుముందు ఎవరి పేరుతో వుండింది? వివరంగా చెప్పండి."

"ఆ స్తి జగదీష్‌బాబు అన్నయ్య సుందరరాజుగారిది. ఆయన చనిపోయేప్పుడు అమ్మాయి సంవత్సరం పిల్ల. పసి పిల్లను తమ్ముడి చేతిలో పెడుతూ ఆ స్తి జగదీష్‌బాబు గారి పేరుతో రాయిస్తానన్నారు సుందరరాజు. కాదూ కూడదని పట్టుబట్టి బలవంతంగా ఆ స్తంతా అమ్మాయి పేరనే రాయించారు జగదీష్‌బాబు. ఆ తర్వాత ఆయన సంపాదించింది కూడ అమ్మాయి పేరుతోనే వుంది."

"థాంక్స్. మంచి సమాచారం అందించారు."

"నో మెన్షన్. ఇంకా ఏమైనా చెప్పాలా?"

"అవసరంలేదు." అని లేచాడు శ్రీనివాస్.

## 11

రాత్రి ఒకటీ ముప్పావైంది.

జగదీష్‌బాబుకి నిద్రపట్టటంలేదు. ఫాన్ తిరుగుతున్నా ఒళ్ళంతా చెమటలు పట్టసాగాయ్. ప్రక్కగా చూశాడు. ఇద్దరు కానిస్టేబుల్స్ మఫ్టీలో పడుకొని నిద్రపోతున్నారు.

'వాళ్ళిద్దరూ తనకి తోడుగా పడుకున్నారు. మరో యిద్దరు బయట కాపలా వున్నారు.' మళ్ళీ గుర్తుచేసుకొని భయాన్ని మర్చిపోదామని ప్రయత్నించాడు. సాధ్యం కాలేదు!

'కాత్యాయని హత్య చెయ్యబడింది. నలుగురు నౌకర్లూ ప్రాణాలు కోల్పోయారు. ఇక మిగిలింది తను.'

'తను మాత్రం బ్రతికుండి ఏం చెయ్యాలి? ఎవర్నుద్ధరించాలి? తను అనుకున్నది జరగలేదు. అన్నయ్య దగ్గర మాట తప్పాడు. కాత్యాయన్ని అపురూపంగా పెంచి పెళ్ళిచేస్తానని తను ఆయనకి వాగ్దానం జేశాడు. మొదటిదైతే నెరవేర్చుకోగలిగాడు కాని, ఆమె పెళ్ళి మాత్రం చెయ్యలేకపోయాడు. ఈలోగా విధి తన కుటుంబంతో చిత్రంగా ఆడుకుంది!'

జగదీష్‌బాబు మనసు వికలమైపోయింది. మంచంపై నుండి లేచాడు. తిన్నగా కిటికీవద్దకి నడిచాడు.

రివ్వున గాలి లోపలికొస్తోంది. ఏదో ఆలోచిస్తూ కాసేపయ్యాక అలా బయటికి చూశాడు. అంతే!

గట్టిగా కేకేసి 'దభీ'మని క్రింద పడిపోయాడు!!!

నిద్రపోతోన్న యిద్దరూ ఉలిక్కిపడి లేచారు. ఆశ్చర్యంతో జగదీష్‌బాబువద్దకి నడిచారు.

స్పృహాలో లేడతను.

"ఎలా వచ్చారిక్కడికి? ఏం జరిగింది?" ఒకడు ప్రశ్నించాడు. 'ఏమో'నన్నట్టు చూశాడు రెండోవాడు.

"ఏం చేద్దాం?"

"జలంధర్ గారికి ఫోన్ చేద్దామా?"

"నువ్వెళ్ళి చేసిరా. నేనిక్కడుంటాను."

రెండోవాడు పరుగుతీశాడు.

బయట వున్న యిద్దరూ కూడ పరిగెత్తుకొచ్చారా కేక విని.

"ఏమైంది?"

"ఏం లేదు. మేం నిద్రపోతున్నాం. గట్టిగా కేక విన్పించి లేచాం. చూసేసరికి యిక్కడ పడున్నారు."

ఇంతలో క్రిందకి వెళ్ళినవాడు పైకొచ్చాడు. "వస్తున్నారు" అన్నాడు.

నలుగురూ అక్కడే కూర్చున్నారు.

పావుగంట భారంగా గడిచింది.

"ఏం జరిగింది?" ఆత్రంగా ప్రవేశించాడు జలంధర్.

"మమ్మల్ని పడుకోమన్నారు సార్! 'అవసరమైతే లేపండి.' అని చెప్పి పడుకున్నాం. ఉన్నట్టుండి గట్టిగా కేక విన్పించింది. అదిరిపడి లేచి చూస్తే మంచంమీద పడుకున్నవారు ఇక్కడ పడున్నారు. అప్పటికే స్పృహ పోయింది." అన్నాడో కానిస్టేబుల్ నమ్రతగా.

"మీరిద్దరూ ఎక్కడున్నారు?"

"క్రింద మేలుకునే వున్నాం సార్!" అన్నారు క్రింద వుండిన యిద్దరూ.

"ఎవరేనా వచ్చారా?"

"ఎవరూ రాలేదు సార్."

"కిటికీ వద్ద పడిపోయారంటే అవతల ఏదో కన్పించి వుండాలి. చూశారా?"

"చూశాం సార్... ఎవరూ కన్పించ లేదు."

మౌనంగా జగదీష్‌బాబు వద్దకు వెళ్ళి చూశాడు జలంధర్. చలనరహితంగా పడున్నాడు. నాడి బలహీనంగా

కొట్టుకుంటోంది.

"గ్లాసులో నీళ్ళు తీసుకురా..."

తెచ్చాడో కానిస్టేబుల్. ముఖంపై చిలకరించాడు జలంధర్. కాసేపయ్యాక నెమ్మదిగా కళ్ళు తెరిచాడు జగదీష్‌బాబు.

"ఏం జరిగింది జగదీష్‌గారూ?" మృదువుగా ఆత్రంగా ప్రశ్నించాడు జలంధర్.

ఏదో చెప్పాలని ప్రయత్నించాడు జగదీష్‌బాబు. కాని ప్రయోజనం లేకపోయింది. రెండు నిమిషాల తర్వాత ఎడమ అరచేతిపై కుడిచేతి చూపుడు వ్రేలితో ఒకదాని తర్వాత ఒకటి మూడు అక్షరాలను వ్రాశాడు.

"...దెయ్యమా?!" ఆశ్చర్యంగా అన్నాడు జలంధర్.

'అవు'నన్నట్టుగా తలూపి మళ్ళీ స్పృహ తప్పాడు జగదీష్‌బాబు!

పది క్షణాలు ఆలోచిస్తూ వుండిపోయాడు జలంధర్. ఆ తర్వాత ఒక నిశ్చయానికొచ్చాడు.

"డాక్టర్ వైద్యనాథన్‌కి ఫోన్ చేసి ట్రీట్‌మెంటిప్పిస్తూండండి. నేను మళ్ళీ ఉదయం వస్తాను..." చెప్పేసి బయటికి నడిచాడు.

## 12

సాయంత్రం ఏడుగంటలైంది.

జలంధర్ ఆఫీసు గదిలో...

డిటెక్టివ్ జలంధర్, అతని అసిస్టెంట్ శ్రీనివాస్, జగదీష్‌బాబు, వకీలు గోపాల శర్మ, అశోక్‌కుమార్, అతని రూమ్‌మేట్ మోహన్, డిటెక్టివ్ ఇన్స్‌పెక్టర్ చక్రవర్తి మరి నలుగురు కొత్తవాళ్ళు, డాక్టర్ వైద్యనాథన్... అందరూ కుర్చీల్లో కూర్చుని వున్నారు.

సిగరెట్ వెలిగించుకొని చిన్నగా దగ్గి ప్రారంభించాడు జలంధర్.

"...డియర్ ఫ్రెండ్స్! ఈ రోజు ఈ సమయంలో మీ అందర్నీ ఇక్కడ సమావేశ పరచటానికో ముఖ్య కారణం వుంది. అదే వివరించబోతున్నాను. కాని అంత కంటే ముందు ఈ కేసుని ఒక్కసారి నెమరు వేసు కుందాం...

"జగదీష్‌బాబుగారి అన్న కూతురు మిస్ కాత్యాయని హత్య చెయ్యబడింది. ఆమే కాదు. వాళ్ళింట్లో మొత్తం నలుగురు నౌకర్లూ హత్య చెయ్యబడ్డారు. జగదీష్‌బాబు మీద కూడ హత్యా ప్రయత్నం జరిగింది. జరిగిన హత్య లన్నీ చాల చిత్రంగా జరిగాయ్. అంటే ఏ విధమైన ఆయుధ ప్రయోగంకాని విషప్రయోగం కాని జరుగలేదు! అందరూ గుండె ఆగి మరణించారు. దీన్ని బట్టి మాత్రం ఆలోచించగా ఈ హత్యలు చేసింది ఓ దెయ్యమని తేలింది..."

"దెయ్యమా?" ఆశ్చర్యం పట్టలేక అడిగాడు వకీలు గోపాల శర్మ.

"అవును."

అందరూ ఆశ్చర్య పోయారు.

"ఆఁ... హత్యలు చేసింది ఓ దెయ్యమనే తేలింది. ఆ దెయ్యం గురించి డిస్కషన్స్ జరిపాక 'మనిషా? దెయ్యమా??' అన్న ప్రశ్న వుద్భవించింది. ఈ ఉదయం ఆ ప్రశ్నకి తగు జవాబు లభించింది..." అని చెప్పి కాసేపు ఆగాడు జలంధర్.

అందర్లోనూ ఉత్సుకత తలెత్తింది. ఏం చెప్తాడోనని

ఆత్రంగా అతని వైపే చూడ సాగారు.

"...హత్యలు చేసింది దెయ్యం కాదని, మనిషేనని తేలిపోయింది...

"ఓ మనిషిని నిర్దాక్షిణ్యంగా చంపగలడు మనిషి. కాని ఆ మనిషినే మరో మనిషి చంపటానికి వస్తే కాళ్ళు పట్టు కుంటాడు... ఎందుకు పట్టుకోవాలి? తనింతకు ముందే మరో మనిషిని చంపాడే! ప్రాణాలపై తీపి ఇతడికైనా వున్నది? తనింతకు ముందు చంపిన వ్యక్తికి మాత్రం వుండదా?

"ఈ విషయం ఆలోచిస్తే అసలు హత్యలే జరగవ్!

"...సృష్టిలో అక్కడక్కడా ఇంకా నరమాంస భక్షకులున్నారు. కాని వారంతా నాగరికత తెలీని వారు. అసలు 'నాకరికత' అన్న పదాన్ని కూడ అర్థం చేసుకో లేని వాళ్ళు. అలాంటి వాళ్లు ఈ పని చేశారంటే 'ఏమో' ననుకోవచ్చు. కాని పెద్ద చదువులు చదువుకొని నాగరి కత నలవరచుకొన్న మనుషులు యిటువంటి పనులు చెయ్యటం సిగ్గు పడాల్సిన విషయం...

"ఆ వ్యక్తి భయంకరమైన దెయ్యం కంటే భయంకర మైనవాడు! నరమాంస భక్షకుడికంటే అనాగరికుడు!!

"...అటువంటి వ్యక్తిని మీకిప్పుడు చూపించబోతు న్నాను. ఆ వ్యక్తి ఎక్కడో లేడు... మన మధ్యలోనే వున్నాడు!!

అందరూ దిగ్భ్రాంతులై పోయారు. ఆశ్చర్యంతో ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"ఏమీ ఎరగని వాడిలా అలా చూస్తారేం? సంకెళ్ళు తొడిగించుకోటానికి సిద్ధం కండి మిస్టర్ మోహన్... ఐ

మీరేన్ మిస్టర్ మదన్ మోహన్!" గంభీరంగా అన్నాడు డిటెక్టివ్ జలంధర్!

"నేనా!?" నిశ్చేష్టుడై పోయాడు మోహన్.

"ఇది చాల అన్యాయం. అశోక్ నా ప్రాణ స్నేహితుడు. అతనికి నేను ద్రోహం చేస్తానా?" అంటూ నెమ్మదిగా జేబులో చెయ్యి దూర్చాడు మోహన్!

"అశోక్! అతని జేబులో టాబ్లెట్సున్నాయి. వాటిని మింగనివ్వకండి..." గట్టిగా అరచాడు జలంధర్.

అంతవరకూ శిలాప్రతిమలా కూర్చుండిపోయిన అశోక్ అమాంతంగా పైకి లంఘించి బలవంతంగా మింగబోతున్న మోహన్ చేతిలోని టాబ్లెట్స్‌ని లాక్కున్నాడు!

చక్రవర్తి పిలుపు నందుకుని మఫ్టీలో వున్న కానిస్టేబుల్స్‌లో ఒకడు లేచి మదన్ మోహన్‌కు సంకెళ్లు తగిలించాడు.

మదన్ మోహన్ ముఖం అవమానంతో క్రిందికి వాలింది!

అందరివైపూ తిరిగి మళ్ళీ ప్రారంభించాడు జలంధర్.

"మొదట్లో నాకు మదన్‌మోహన్‌పై అనుమానం రాలేదు. అతను అశోక్ రూమ్‌మేట్.

కాత్యాయని, తను ప్రేమించుకుంటున్నామని మదన్ మోహన్‌కి అశోకే చెప్పాడు. ఆ తర్వాత యశోధర అనే అమ్మాయిని తను ప్రేమిస్తున్నట్టు మోహన్ చెప్పాడు. అయితే వీళ్ళిద్దర్ని గురించి అతను ప్రశ్నించలేదు. తమ ప్రేమవిషయాలు మాత్రమే చెప్పేవాడు.

"మోహన్‌కి తెలుసు తనడక్కుండానే అశోక్ అన్ని విషయాలూ చెబుతాడని! ఏదైనా విషయాన్ని ఎదుటివారు చెబుతూన్నప్పుడు అదే విషయం గురించిన మన

అనుభవాలు మనమూ చెబుతాం వాళ్ళడగనవసరం లేకుండానే. అది బాగా తెలుసు మదన్ మోహన్‌కి. అందుకే పట్టనట్టు వుండిపోయాడు.

"కాత్యాయని, అశోక్ లు ప్రేమించుకున్నారు. వారిద్దరికీ శారీరక సంబంధం వుంది. మోహన్ కూడ యశోధరని ప్రేమిస్తున్నాడు. కాని వారిద్దరి మధ్య అలాంటి సంబంధానికి యశోధర యిష్టపడలేదు.

"క్లోజ్ ఫ్రెండు కాబట్టి మోహన్తో ఒక్కటీ దాచకుండా చెప్పేవాడు అశోక్. దాంతో మోహన్‌కి పిచ్చెక్కినట్టయ్యేది. రాత్రుల్లో తను కూడ కాత్యాయన్ని తన ప్రక్కన వూహించుకొని కలలుగంటూండేవాడు. ఆ పిచ్చి నెమ్మదిగా 'కాత్యాయన్ని అనుభవించాలి' అని తీర్మానించుకునేదాకా తెచ్చిపెట్టింది.

"స్నేహితుడు ప్రేమిస్తోన్న అమ్మాయి కదా అనే విచక్షణాజ్ఞానం అతనిలో నశించింది. 'మదన్' పేరుతో ఆమెకి రెండుసార్లు ఉత్తరాలు రాశాడు. బదులు రాలేదు. కాత్యాయనికి తను అశోక్ ఫ్రెండని తెలీదుగాబట్టి బయటపడదనుకొని ధైర్యంగా రెండుసార్లు కలిసి నిర్భయంగా తన కోర్కె వెల్లడించాడు. ఆమె తీవ్రంగా తిరస్కరించింది. పిచ్చివాడైపోయాడు. ఐదోసారి ఆఖరుసారిగా ఉత్తరం రాశాడు. అప్పటికీ ఆమె లొంగలేదు

"మోహన్‌వద్ద కొన్ని సైంటిఫిక్ టాబ్లెట్లున్నాయ్. అవి మ్రింగితే మనిషి మాయమైపోతాడు. ఎలా మాయమవుతాడో తర్వాత మోహనే వివరిస్తాడు.

"ఐదోసారి కూడ కాత్యాయని పలకప్పోయ్యేసరికి మోహన్ కోపం తారస్థాయినందుకుంది. సమయంకోసం

కాచుకున్నాడు. ఇంతలో శోధ ఎంటర్ ప్రైజెస్‌లో ఉద్యోగమిస్తానని, అశోక్‌ని రమ్మని రూప ఎంటర్ ప్రైజెస్ మేనేజర్ చెప్పాడు.

"ఆ రాత్రి తొమ్మిదిన్నరకి తను మేనేజర్ని ఇంట్లో కలవాలి. అనుకోకుండా ఆ ఉదయం పది గంటలకి కాత్యాయని అశోక్‌ని కలిసి సాయంత్రం అయిదింటికి హోటల్ ఫుల్ మూన్‌కి రమ్మంది. ఆమె మాట కాదన్లేక వెళ్ళాడు అశోక్. తొమ్మిది గంటలవరకూ వాళ్ళు హోటల్లోనే గడిపారు. ఆ తర్వాత హోటల్ కనిపించేవరకూ కలిసి వెళ్ళి చెరో కోకాకోలా తాగేసి ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళటం అలవాటు ఇద్దరికీ. కాని ఆ రోజు మేనేజర్ రమ్మన్నాడుగా! అందుకని అట్నుంచి అటే వెళ్ళి పోయాడు అశోక్.

"అవకాశంకోసం ఎదురుచూస్తోన్న మోహన్‌కి చక్కటి అదను లభించింది. మోహన్ కారు వెనక సీట్లో ప్రవేశించాడు. కాత్యాయని అతన్ని చూడలేదు. మామూలుగా కారు స్టార్టు చేసింది. జనంలేని స్థలం చూసుకొని టాబ్లెట్ మింగి దెయ్యం అయ్యాడు. కాత్యాయని దృష్టి తనపై పడేలా చేశాడు.

"ఆ భయంకరాకారాన్ని చూడగానే ఆమె గుండె ఆగి మరణించింది. ఆ తర్వాత తనే డ్రైవ్ చేస్తూ ఆమెని-అంటే ఆమె శవాన్ని ఇంటివద్ద దిగబెట్టి వెళ్ళిపోయాడు వ్రేలిముద్రలు పడకుండా జాగ్రత్తలు తీసుకొని!

"మిస్టర్ మోహన్! నీ కోరిక తీర్చలేదనే కోపంతో కాత్యాయన్ని హత్య చేశావ్ తెలివిగా. కాని అమాయకులైన నౌకర్లు నీకేం ద్రోహం చేశారు? వాళ్ళనెందుకు

చంపావ్? జగదీష్‌బాబు నెందుకు చంపాలని చూశావ్?"
గంభీరంగా చూశాడు జలంధర్.

"పగ! ద్వేషం!! అసహ్యం!!!"

మోహన్ కంఠంలోని ఆ క్రౌర్యానికి అక్కడున్న అందరితోపాటు జలంధర్ కూడ చకితుడయ్యాడు!!!

"పగనా?"

"అవును. పగ! ఈ క్షణంలో నా చేతులు నా ఆధీనంలో లేవు. ఉండివుంటే ఇప్పుడే జగదీష్‌బాబుని చంపివుండేవాణ్ణి!!!"

"కారణం?"

"కారణం లేందే ఇంత సాహసం ఎవడూ చెయ్యడు జలంధర్ గారూ! వినండి."

చెప్పటం ప్రారంభించాడు మదన్ మోహన్.

"అప్పుడు నేను చిన్నవాణ్ణి. మా అక్కయ్యకింకా పెళ్ళి కాలేదు.

ఓ రోజు...

మావాళ్లంతా ఎక్కడికో వెళ్లారు. నాకు సరిగా గుర్తులేదు. మా అక్కయ్య, నేను మాత్రమే వున్నాం. ఉన్నట్టుండి ఇతను, మరొకడితో లోనికొచ్చి మా అక్కయ్యతో ఏదో మాట్లాడి చెయ్యి పట్టుకున్నాడు.

మా అక్కయ్య పెనుగులాడింది. ఆఖరుకి నన్ను కేకేసింది. నాకు కోపం ఆగలేదు. మా అక్కయ్యని వీళ్ళు ఏడిపిస్తున్నారు! అంతే అప్పట్లో నాకు తెలిసింది.

పిచ్చికోపంలో అక్కడే వున్న రోకలితో ఇతనితో వున్నవాడి తలపై మోదాను. గట్టిగా అరచి క్రింద పడి

పోయాడు. రక్తం మడుగులు కట్టింది. ఇతను భయంతో పారిపోయాడు.

'ఎంత పని చేశావు తమ్ముడూ!' అని నన్ను పట్టుకొని ఏడ్చింది మా అక్కయ్య. నాకేమీ బోధపడలేదు.

ఆ తర్వాత పోలీసులొచ్చారు. నన్ను పట్టుకుపోయారు. కోర్టులో ఏవేవో అడిగారు. మాటలు జరిగాయ్. ఆ తర్వాత నన్ను వేరే వూళ్ళో ప్రత్యేకమైన స్కూలుకి పంపించారు.

అక్కడే పెద్దవాణ్ణయ్యాను. ఆ తర్వాత నన్ను వదిలి పెట్టారు. మళ్ళీ ఇంటికెళ్ళ బుద్ధికాలేదు నాకు. ఈ వూరొచ్చాను. కష్టపడితే రూప ఎంటర్‌ప్రైజెస్‌లో ఉద్యోగం వచ్చింది. కొన్నాళ్ళయ్యాక అనుకోకుండా యశోధర పరిచయమైంది.

ఆ తర్వాత కొన్నాళ్ళకి వాళ్ళ నాన్నకి పరిచయం చేసింది. ఆయనో పెద్ద సైంటిస్టు. ఆయనకి నాపై నమ్మకం కలిగింది. తనకి అసిస్టెంటుగా పని చెయ్యమని కోరారు. చేరాను. రాత్రులు ఆయనవద్ద, పగలు ఆఫీసులో కష్టపడి పనిచేసేవాణ్ణి.

ఆయనో పెద్ద పరిశోధనచేసి విజయం సాధించాడు. ఓ రకమైన మాత్రలు తయారుచేసి వాటికి 'నిక్‌నాల్ 201' అని పేరుపెట్టాడు. ఆ టాబ్లెట్ ఒక్కటి వేసుకుంటే చాలు. గంటసేపటివరకూ అతడు మాయమై పోతాడు. ఎదుటి మనిషికి కన్పించడు. రెండు మాత్రలు వేసుకుంటే రెండు గంటలపాటు ఎవరికీ కన్పించడన్న మాట. రెండు గంటలు దాటిన మరుక్షణం మామూలుగా మారిపోయి మళ్ళీ అందరికీ కన్పిస్తాడు.

ఈ ప్రయోగాన్ని అతడు నాకు స్వయంగా చూపిం

చాడు వన్ ఫోర్త్ టాబ్లెట్ తను వేసుకొని! పావుగంట సేపు ఆయన ధరించిన దుస్తుల్ని తప్ప ఆయన శరీరాన్ని చూడలేకపోయాను.

పాపం! వాటిని ప్రభుత్వానికి అప్పగించకముందే ఆయన ఆయుర్దాయం తీరి మరణించాడు!

ఇదిలా వుండగా ఓ రోజు ఈ జగదీష్‌ను బజారులో చూశాను.

నా తల తిరిగిపోయింది. చిన్నప్పటి సంఘటన తెరలు తెరలుగా మెదడులో తిరిగింది. ఈ జగదీష్ మా అక్కయ్యని బలవంతం చేశాడు. ఆ కారణంగానే నేను జైలు పాలయ్యాను. అతడిమీద నాకు ప్రతీకారం ప్రజ్వరిల్లింది. అతనిని వెంటాడి అతడి ఇల్లు తెలుసుకున్నాను.

నా హృదయం కుతకుత ఉడకసాగింది! జగదీష్‌బాబుని హత్య చెయ్యాలి! నా మనసునిండా అదే ఆలోచన!

ఆ తర్వాత రూమ్‌మేట్ అశోక్ ప్రేమిస్తున్న కాత్యాయని కూడా జగదీష్‌బాబు కూతురేనని తెల్సింది. దానితో నా అక్కయ్యకు జరిగిన అన్యాయమే అతడి కూతురుమీద తీర్చుకోవాలనిపించింది.

ముందుగా కాత్యాయన్ని అనుభవించి చంపి ఆ తర్వాత జగదీష్‌ని చంపాలనే నిర్ణయానికొచ్చాను. పథకం ఆలోచించాను.

కాత్యాయనికి 'మదన్' పేరుతో ఉత్తరం రాశాను. జవాబు లేదు. రెండోదానికీ ఫలితం లేకపోయింది. రెండుసార్లు నేనే కలిశాను. కోరిక తీర్చమని చెప్పాను. విదిలించిపారేసింది. ఐదోసారీ రాసి చూశాను. ప్రయోజనం శూన్యమే అయింది.

ఆమె ననుభవించి చంపి, జగదీష్‌కి తెలిపి బాధపెట్టి ఆ తర్వాత అతడినీ చంపాలనుకున్న నా ఐడియా ఫలించ లేదు.

ఆలోచించి మరో పథకాన్ని అనుసరించాను.

ఓ భయంకరమైన తల, కుడిచెయ్యి, వెడల్పయిన పాదాలని టోపన్‌స్లా తయారుచేయించాను. మాత్ర వేసుకొని వాటిని ధరిస్తేచాలు. ఎదుటి వ్యక్తికి భయంకర మైన పెద్ద తల, లావుపాటి కళ్ళు, పొడుగాటి ముక్కు, కుడిచెయ్యి, పాదాలు మాత్రమే కన్పించేవి. పాదాల టోపన్స్‌కి కాలివ్రేళ్ళు వెనక్కి వచ్చేటట్టు బూట్లు తయారుచేయించి వాటికి ఈ పౌరలు అంటించి తొడు క్కున్నాను. వాటినిండా గుబురుగా వెంట్రుకలుంటాయ్.

ఎటువంటి గుండెనిబ్బరం గలవాడైనా, శరీరం కని పించని అటువంటి భయంకరాకారం దగ్గరగా కనిపిస్తే టక్కున గుండె ఆగి చస్తాడు.

ఈ విధంగా హోటల్‌వద్ద కాత్యాయని కారులో ప్రవేశించి దెయ్యంగా మారి ఆమెని బెదిరించాను. నా ఆకారాన్ని చూడగానే ఆమె భయపడి ప్రాణాలు వదిలింది. ఓ సమస్య తీరింది.

ఇక మిగిలింది జగదీష్‌బాబు. అతన్ని చంపాలి. అత నింట్లో ఒకరు కాదు - ఇద్దరు కాదు — నలుగురు నౌకర్లు న్నారు, అయినా భయపడలేదు.

వెళ్ళాను. లాఘవంగా తలుపులు తెరిచి వాళ్ళింట్లో ప్రవేశించాను. వెడుతూండగా ఓ గదిలోంచి మాటలు ఏవో విన్పిస్తున్నాయ్. గబగబా దెయ్యంలా తయారై తలుపులు తోశాను. ఎదురుగా ఓ ఆడది, మగాడు సరసా

లాడుతూ కన్పించారు. నన్ను చూడగానే వాళ్ళు గుండెపగిలి చచ్చారు. త్వరలో జగదీష్‌బాబు కూడ ఇలాగే చస్తాడని వూహిస్తూ చిన్నగా నవ్వుకుని అతని కోసం వెదికాను. కాని జగదీష్‌బాబు అదృష్టం బావుంది. ఇంట్లో లేడో, వూళ్లో లేడో కన్పించలేదు. అప్పటికి వెళ్ళిపోయాను.

ఆ తర్వాత మళ్ళీ ఓ సారి వెళ్లాను. మెట్లెక్కుతూండగా మిగిలిన ఇద్దరు నౌకర్లూ అటువేపొచ్చారు. నన్ను చూసి వాళ్ళకూ హార్టు ఫెయిలయ్యింది. ఒకడు అరచి క్రింద పడ్డాడు. ఒకడలాగే కుప్పలా కూలిపోయాడు. అనుమానం రాకుండా ఇద్దర్నీ మెట్లపైకి చేర్చి పైకి వెళ్ళాను. ఆ రోజు కూడా జగదీష్‌బాబు ఎక్కడా కని పించలేదు.

మరునాడు మళ్ళీ జగదీష్‌బాబు ఇంటికి వెళ్ళాను.

ఇంటిముందు యిద్దరు కాపలా వున్నారు. వాళ్ళు పోలీసులని గ్రహించాను. ఏదైనా అలికిడైతే పిస్తోలుతో కాలిస్తే ప్రమాదమని వెనకవేపుగా వెళ్ళాను. కాని దుర దృష్టవశాత్తు జగదీష్‌బాబు కిటికీలోంచి నా ఆకారాన్ని చూసి గట్టిగా కేకేశాడు. పోలీసులు విని కాలుస్తారేమో నని భయపడి పారిపోయాను.

జగదీష్‌బాబు చనిపోయుంటాడని వూహించాను. కాని అతడు దూరంనుండి చూశాడు. ప్రాణం పోలేదు.

ఇంతచేసినా జగదీష్‌బాబుని చంపలేకపోయాను. పైగా ఎన్నో ఐడియాలతో పథకాన్ని ఎంతో పటిష్ఠంగా తయారుచేసుకొని యింతవరకూ దొరకని నేను ఏ పొర పాటువల్ల దొరికిపోయానో నాకు అర్థంకావటంలేదు."

నిట్టూర్చాడు మోహన్.

జగదీష్‌బాబు అవమానంతో తల వంచుకున్నాడు.

"అందుకే అన్నారు మిస్టర్ మోహన్! తెలివి ఒక్కడి సొంతం కాదని! నీ మేధస్సుని అభినందిస్తున్నాను. కాని మహామేధావులు సైతం ఒక్కోసారి పప్పులో కాలేస్తుంటారని ఋజువుపరచావ్.

దెయ్యంలా నమ్మించాలని నువ్వు చేసిన ప్రయత్నాలు, అందుకు నువ్వాలోచించిన ఐడియాలు నిజంగా అభినందించ దగ్గవి. మొదట్లో నీమీద నాకు అనుమానం లేదు. అశోక్‌ను అనుమానించాను. అందుకే ఈ రోజు ఉదయం మీరు ఆఫీసుకు వెళ్ళగానే మీ రూమ్‌లోకి ప్రవేశించి వెదికాను. అశోక్ పెట్టె అనుకొని నీ పెట్టె తాళం తీసి గబగబా వెదికాను. కాత్యాయని నీకు రీడైరెక్ట్ చేసిన మొదటి రెండు ఉత్తరాలు, నీ డైరీ కన్పించాయ్. ఇంకా వెది కాను డైరీ జేబులో వేసుకొని. 'నిక్‌నాల్ 201' టాబ్లెట్స్ కొన్ని కన్పించాయ్. వాటి ప్రక్కనే అవి తయారుచేసే ఫార్ములా కూడ నా కంటబడింది. నీ ప్లాన్ అంతా అర్థమై పోయింది. వెంటనే బయటకొచ్చి, ఇన్‌స్పెక్టర్‌కు చెప్పి యీ సమావేశం ఏర్పాటుచేశాను,

చూశావా! చివరికి నీవింతవరకూ ఉపయోగించిన నిక్‌నాల్ 201 టాబ్లెట్సే నిన్ను పట్టిచ్చాయ్." అంటూ ముగించాడు డిటెక్టివ్ జలంధర్.

ఆయన మేధాసంపత్తికి అక్కడున్నవారందరూ ఆశ్చర్యపోయారు!!!

—: ఐపోయింది :—

G. Ranga Rao
[illegible]
534447

# నేరస్థులోపాఖ్యానం!

యం. కె. వి. శాస్త్రి

మేజిస్ట్రేటు కోర్టు గదిలోకి రాగానే అంతటా నిశ్శబ్దం తాండవించింది.

పోలీసులు నన్ను లోపలికి తీసుకు వెళ్ళి బోనులో నిల బెట్టేరు. కోర్టు తాలూకు మనిషి నా దగ్గరకు వచ్చి 'నిజం చెపుతాను, అబద్ధం చెప్పనని' నాచేత ప్రమాణం చేయించాడు.

నామీద నేర విచారణ ప్రారంభమైంది.

నా గురించి పబ్లిక్ ప్రాసిక్యూటర్ 'చాల అన్యాయంగా, అతి నీచంగా' విమర్శించాడు. నాకు ఇంగ్లీషు భాష క్షుణ్ణంగా వచ్చునని, అతనికి తెలియక పోవచ్చు. నేను మటుకు ఏమీ మాట్లాడకుండా, అస్సలు నోరు

మెదపకుండా, నిశ్శబ్దంగా, చేతులు కట్టుకుని నిలబడి ఉన్నాను బోనులో.

పబ్లిక్ ప్రాసిక్యూటర్, తన ఆర్గ్యుమెంటు చాలించి, నాకేసి, తినేసేలా కోపంగా చూసి కుర్చీలో కూలబడ్డాడు.

ఆఖరికి మేజిస్ట్రేటు నన్ను ప్రశ్నిస్తూ "నీవు ఈ నెల పదహారో తారీఖున అర్ధరాత్రి ఇన్నీసు పేట బస్సు స్టేండులో ఒక ప్రయాణీకుడిని మోసగించి, అతని సూట్ కేసు తీసుకుని పారిపోతుండగా, ఆ ప్రయాణీకుడు నీమీద తిరగబడినప్పుడు, అతనిని అతిదారుణంగా కొట్టి పారిపోతుండగా పోలీసులకి పట్టుబడి పోయావు, అని నీ మీద పోలీసు రిపోర్టు ఉన్నది. అందుకు నీ సమాధానం ఏమిటి?" అని అడిగాడు.

"నిజమే! ఆ రోజుకి మూడు రోజుల నుంచి నాకు తిండి లేదు. ఆకలితో ప్రాణం అల్లాడిపోయింది. క్షుద్బాధ భరించలేక నేను దొంగతనానికి పాల్పడవలసివచ్చింది. ఇన్నీసు పేట బస్సు స్టేండులో ఒక ప్రయాణీకుడు, తన సూట్ కేసుని తలక్రింద పెట్టుకుని ఆదమరచి నిద్రపోతున్నాడు. నేను అతి నేర్పుగా ఆ సూట్ కేసుని అతని తల క్రింద నుంచి తప్పించి తీసుకుని పారిపోతుండగా, అతనికి మెలుకువ వచ్చి, నన్ను వెంబడించ సాగేడు; పెద్దగా దొంగ! దొంగ! అని కేకలు పెడుతూ.

అతని కేకలకి చుట్టు ప్రక్కల జనం పోగై, నన్ను పట్టుకునే ప్రమాదం ఉన్నదని, నేను ఆత్మ రక్షణ కోసం విధిగా అతనిని కొట్టవలసి వచ్చింది. నేను కొట్టిన దెబ్బలు తీవ్రమైనవి కనుక, అతను స్పృహ కోల్పోయాడు." అని

చెప్పడం ఆపి కోర్టుకేసి ఒకసారి కలయ చూశాను.

"ఆపేశావేం? తర్వాత ఏం జరిగింది?" అన్నాడు మేజిస్ట్రేటు.

"నిజానికి నేను అతను కట్టెలాగ విరుచుకుని క్రింద పడిపోగానే, చచ్చిపోయాడనుకుని భయపడ్డాను. నా ఒళ్ళంతా చెమట పట్టింది. ఒక నిండు ప్రాణం, నా చేతుల మీదుగా బలైపోయింది. నా కాళ్ళు తడబడ్డాయి. అక్కడ నుంచి ఎంత త్వరగా పారిపోగలిగితే అంత మంచిది. నా కళ్ళ ముందు పోలీసులు, కోర్టులు, ఉరికంబం కనిపించ సాగాయి.

ఈ లోపుగా రోడ్డు మీది జనం ఒక్కొక్కరూ, మేమున్న వీధిలోకి పరుగెత్తుకుంటూ వస్తున్నారు.

క్షణం ఆలస్యం చేస్తే నేను వాళ్ళకి పట్టుబడిపోతాను. అన్న ఆలోచన రాగానే, నాలో ఏదో కొత్త శక్తి, ఆవేశం వచ్చాయి. అప్రయత్నంగా పరుగు లంకించుకున్నాను.

వేగంగా చీకటిలోకి పరుగెత్తుతూ, ఎంతో దూరం పారిపోయాను. ఆయాసంతో, చేతిలోని సూట్ కేసు బరువుతో, తాపీగా నడుస్తున్నా, వెనక నుంచి నన్ను ఎవరూ వెంబడించలేదు. అందుకని తాపీగా, ఆయాసం తీర్చుకుంటూ, నా ఇంటికి బయలుదేరాను.

అయితే దురదృష్టవశాత్తూ, హైరోడ్డు మలుపులో, నైట్ డ్యూటీ చేస్తున్న బీట్ కానిస్టేబుల్సకి దొరికి పోయాను.

నేను పాత నేరస్తుడిని కనుక, నన్ను అనుమానించి, నిర్బంధంలోకి తీసుకుని, పోలీసు స్టేషన్ కి తీసుకుపోయారు.

పోలీసు అధికారులు నా చేత అతి సులభంగా, నేరం ఒప్పుకునేలాగ చేశారు.

నా అదృష్టవశాత్తూ, నే చేత దెబ్బలు తిన్న ప్రయాణీకుడు చచ్చిపోలేదు. స్పృహ కోల్పోయాడని త్వరలోనే నాకు తెలిసింది.

ఇదీ! నేను చేసిన నేరం. నా మీద కనికరించి, నా తప్పుని మన్నించవలసిందిగా, శ్రీ కోర్టు వారిని ప్రార్థిస్తున్నాను!'' అన్నాను ఎంతో వినయంగా, చేతులు జోడించి.

మెజిస్ట్రేటు నాకేసి కోపంగా, ఆశ్చర్యంగా చూశాడు. బహుశా నేను ఎంతో ధీమాగా, నిర్భయంగా, జరిగినది పొల్లుపోకుండా, తు.చ. తప్పకుండా, వివరించి చెప్పి, నా తప్పు ఒప్పుకున్నందుకు అనుకుంటాను.

నా అభ్యర్థన ప్రకారం మేజిస్ట్రేటు నా మీద కనికరించాడో, జాలిపడ్డాడో, తెలియదు కాని, నాకు మటుకు ఆరు నెలల కారాగార శిక్ష విధింపబడ్డది.

## 2

రాజమండ్రి సెంట్రల్ జైల్ సూపరింటెండెంట్ దగ్గర నుంచి, కళాసీ పనిచేసే వాడివరకు నా స్నేహితులు, పరిచయస్థులే! ఎందుకంటే తరచుగా నాకు జైలుతో రాకపోకలు ఉండనే వున్నాయి.

ఈ మధ్య ఏడాది కాలం నుంచి, నేను సెంట్రల్ జైల్ ముఖం చూడనేనా చూడలేదు. ఏవేవో చిన్న, చిన్న నేరాలు చెయ్యడం వల్ల, సబ్ జైలు శిక్షతో సరిపోయింది నాకు. ఈ సారి పెద్ద శిక్ష పడ్డంవల్ల 'హెడ్ క్వార్టర్స్‌కి, ప్రమోషన్ మీద బదిలీ అయి వచ్చినట్టు' అనిపించింది నాకు.

ఈ సారి జైలు వాతావరణంలో చాలా మార్పులు రావడం నేను గమనించక పోలేదు.

జైలు ఫార్మాలిటీస్ పూర్తయిన తరువాత, నన్ను ఇరవై ఏడో నెంబరు సెల్ లోకి తరలించారు, నాకు ఖైదీ నెంబర్ ఏడువందల పదహారు నెంబరు పేరుపెట్టి. జైలులో ఉన్నంత కాలం నా అసలు పేరు మర్చిపోయి, ఏడువందల పదహారు నెంబరు గల సంఖ్యతో వ్యవహరించాలన్న మాట.

ఇరవై ఏడో నెంబరు సెల్ తాళం తీసి, నన్ను లోపలికి తోసి, తాళం బిగించుకుని వెళ్ళిపోయారు పోలీసులు.

సెల్ లో ఇంకో ఖైదీ వున్నాడు. గోడవేపుకి తిరిగి హాయిగా శ్వాస పీల్చుకుంటూ నిద్రావస్థలో వున్నాడు.

నేను కుతూహలంగా అతనికేసి నడిచి దగ్గరనుంచి పరకాయించి చూశాను, నాకు పరిచయమున్న వ్యక్తేమో నని!

ఎవరో నాకు అపరిచితుడు. నేను ఎప్పుడూ అతనిని చూడనైనా చూడలేదు.

ఆరు అడుగుల ఆజానుబాహువు. విశాలమైన ఛాతీ. కండలు తిరిగిన చేతులు. గుబురు మీసాలు. భయంకరంగా వున్నాడు. నెమ్మదిగా, అతనికి దూరంగా వచ్చేసి, నేను కూడా నడుం వాల్చాను. గాఢంగా నిద్రపట్టేసింది.

నాకు తిరిగి మెలకువ వచ్చేసరికి అతను గదిలో ఒక మూలకి నక్కి కూర్చుని, తాపీగా సిగరెట్టు కాలుస్తూ కనిపించాడు. నన్ను చూడగానే ఆప్యాయంగా నవ్వి, ‘‘నీ పేరు?’’ అని పలకరించాడు.

నా పేరు చెప్పి. ‘‘మరి నీ పేరు?’’ అని అడిగేను.

"చలపతి!" అన్నాడు.

అలా ప్రారంభమైంది మా పరిచయం.

"సిగరెట్టు కాలుస్తావా?" అని అడిగేడు చలపతి.

"ఓ!" అన్నాను. సిగరెట్టు అందుకుని వెలిగించి తృప్తిగా కాలుస్తూ, "అన్నట్టు నీకు సిగరెట్లు ఎలా వచ్చాయి?" అన్నాను కుతూహలంగా.

తమాషాగా నవ్వేడు చలపతి.

"సిగరెట్లేం ఖర్మ! విస్కీ కూడా తెప్పించుకుని తాగగలను. ఈ చలపతి సంగతి నీకు తెలియదు. కొన్ని రోజులు ఓపికపట్టు, త్వరలోనే అన్ని విషయాలూ నీకే తెలుస్తాయి. నా సత్తా ఎటువంటిదో అప్పుడు చూడు!" అన్నాడు దర్పంగా, కసిగా, మీసాలు మెలితిప్పుతూ.

సమాధానంగా చిరునవ్వు నవ్వేను.

"అన్నట్టు ఎలా వచ్చేవు ఇక్కడికి? చోరీ కేసా? దొమ్మీ కేసా?" అన్నాడు చలపతి ఆత్మీయులని పరామర్శించినట్టు.

నెమ్మదిగా నా కథ వివరించాను.

"మరి నీ సంగతో?" అని అడిగేను.

"అదో పెద్ద కథ. రాత్రికి తీరుబడిగా మాట్లాడుకుందాం!" అన్నాడు చలపతి.

# 3

రాత్రి భోజనాలు పూర్తి చేసుకుని తిరిగి సెల్‌లోకి వచ్చేశాం. అప్పుడు తీసి చూపించాడు చలపతి జేబులోంచి విస్కీ బాటిల్, సిగరెట్లు, బీడీలూనూ.

"ఇవి ఎక్కడివి?" అని అడిగేను నోరు తెరుచుకుని.

"మనం ఏర్పాటు చేసుకోవాలే కాని, సాధ్యంకానిది

ఏముంటుంది?'' అన్నాడు చలపతి తత్వం బోధించే స్వాములవారిలా.

''అది సరేకాని! నీ కథ వినిపించేవు కాదు!'' అన్నాను కుతూహలంగా.

''అదా! దానికేం? చెప్తాను విను!'' అన్నాడు చలపతి తనో సిగరెట్టు వెలిగించుకుని, సిగరెట్టుపెట్టి, అగ్గిపెట్టి నా చేతికి అందిస్తో. నేను కూడా సిగరెట్టు వెలిగించాను.

''మాది విశాఖపట్నం జిల్లాలోని ఒక పల్లెటూరు. చిన్నప్పుడే, అంటే నాకు పదకొండు సంవత్సరాల వయస్సున్నప్పుడు నా తల్లీ, తండ్రీ పోయారు. నేను తోబుట్టువులు కూడా ఎవరూలేని ఏకాకిని. నేను మేనమామ గారింట్లో పెరిగేను.

మామయ్య మనవాడు కాని, అత్తయ్య మనది కాదుగా! అందుకని నన్ను ప్రతీదానికి కొట్టి, తిట్టి, నానాహింసా పెట్టేది. కనీసం కడుపుకి చాలినంత తిండి కూడా పెట్టకుండా, అర్ధాకలితో మాడ్చి చంపేది.

ఆకలి బాధకి తట్టుకోలేక చిల్లరదొంగతనాలు మొదలు పెట్టి కడుపు నింపుకునేవాడిని.

దొంగతనం ఎక్కువకాలం సాగదు కదా! త్వరలోనే ఒకసారి అత్తయ్యకి దొరికిపోయాను. ఫలితంగా నా పరిస్థితి మరీ హీనంగా తయారైంది. రోజూ పెట్టే తిండి కూడా సరిగ్గా పెట్టడం మానేసింది అత్తయ్య.

విధిగా ఊరిమీద దాడిచెయ్యడం మొదలుపెట్టవలసి వచ్చింది. ఎన్నోరకాల చిల్లర, మల్లర దొంగతనాలు చేసే వాడిని.

దొరికిపోతే కొంతమంది ''పోనిద్దురూ! కుర్రసన్నాసి!''

అని జాలిగా ఒదిలిపెట్టేసేవారు. కొంతమంది ఒళ్ళు హూనం చేసిపారేసేవారు, ''వ్రేలెడు లేవు! నీకు దొంగతనాలా?!'' అని.

ఇలా ఇంటిలోనూ, బైటా కూడా నేను దొంగగా పేరు తెచ్చుకున్నాను.

అలా నాకు పదిహేడు సంవత్సరాల వయస్సు వచ్చే వరకు గడిచిపోయింది.

నాకు అనుక్షణం అమ్మా, నాన్నలు లేని లోటు తెలిసి వచ్చి ఎంతో బాధపడేవాడిని. ఏకాంతంగా కూర్చుని గంటల తరబడి ఏడుస్తూ గడిపేవాడిని.

నేను తల్లిదండ్రుల ప్రేమకి దూరమవడంవల్లనే కదా పరుల పంచన చేరి, బానిసబ్రతుకు బ్రతుకుతూ, తిండికి, బట్టకి కూడా మొహం వాచిపోయాను!

క్రమశిక్షణలేక, ఆత్మీయుల ఆప్యాయతకి దూరమై కేవలం గాలికి బ్రతికేను. మంచి, చెడులకి తారతమ్యం తెలుసుకోలేని పరిస్థితిలో జీవించేను.

అందరిలాగా నేను కూడా తల్లిదండ్రుల అనురాగం, ఆత్మీయతలు చవిచూస్తో, నా బాల్యజీవితం గడపగలిగితే నేను ఈ రోజు ఇలా దొంగలా దొంగబ్రతుకు బ్రతుకుతూ, ప్రజల దృష్టిలో, పోలీసుల దృష్టిలో, న్యాయస్థానం దృష్టిలో నాకు 'దొంగ' అనే ముద్ర పడకుండా వుండేది కదా!

ఇంటిలోనూ, ఊళ్లోనూ, ప్రతీ చోట, నేను ఎక్కడ కనిపిస్తే అక్కడ 'అదిగో! వాడే దొంగ! జాగ్రత్తగా వుండాలి. కన్నుమూసి తెరిచేలోగా నిలువుదోపిడి చేసి పారేస్తాడు!' అని చాటుగా, బాహాటంగా విమర్శించుకునేవారు.

చిన్నతనంనుంచి నా శరీరం దెబ్బలు కాయడంవల్ల నా ఒళ్ళు రాటుదేరిపోయింది. సూటీపోటీ మాటలతో నా మనస్సు మొద్దుబారిపోయింది. నా బ్రతుకు, జీవితం అన్నిటికి అతీతంగా మారిపోయింది.

ఈ సమాజం నన్ను దొంగగా గుర్తించడంవల్ల దొంగగానే జీవించాలని, ఆ వృత్తిలోనే నేను ప్రావీణ్యత సంపాదించాలని నిర్ణయించుకున్నాను.

నన్ను ద్వేషించి, విమర్శించి, అనుక్షణం నన్ను శారీరకంగా, మానసికంగా హింసించిన ఈ సమాజంమీద తిరుగుబాటుచేసి, కక్ష తీర్చుకోమని, నాలో కరుడుగట్టుకుపోయిన ద్వేషం, పగ, ప్రతీకారం నన్ను పురిగొల్పి, రెచ్చగొట్టేయి.

నా ఈ పరిస్థితికి, పుట్టుకకి కారణమైన భగవంతుడిమీద కూడా నాకు ద్వేషభావం రగిలి, శత్రుత్వం ప్రజ్వరిల్లింది.

అందుకనే ఒక రోజు ఎవ్వరికీ చెప్పకుండా నేను కలకత్తా పారిపోయాను.

పది సంవత్సరాల కలకత్తా జీవనం, నా జీవితంలో ఎన్నో మార్పులు కలిగించింది. దొంగతనంలో ప్రావీణ్యత సంపాదించాను.

కలకత్తాలో ఒక పెద్ద ముఠా నన్ను ఆదరించి, ఆశ్రయమిచ్చింది. నాకు ఎన్నో రకాల నూతన పద్ధతులలో శిక్షణ ఇచ్చి, నన్ను సాటిలేని మేటి గజదొంగగా మార్చింది.

ఆ ముఠా నాయకత్వంలో నేను ఎన్నో దొంగతనాలలో, లూటీలలో, చోరీలలో పాల్గొన్నాను. ఎన్నో లక్షల రూపాయల గుప్తధనం ప్రోగుచేశాం.

కలకత్తా నగరం యావత్తూ మా ముఠా పేరు చెపితే గజగజలాడిపోయేది.

పోలీసు డిపార్ట్‌మెంటు మమ్మల్ని పట్టుకోలేక తల్లడిల్లిపోయేది. కనీసం మా స్థావరం ఉనికి కూడా తెలుసుకోలేకపోయింది.

ఒకప్పుడు ప్రజలు, పోలీసులు నన్ను బాహాటంగా విమర్శించి మానసికంగా, శారీరకంగా చిత్రవధ చేశారు.

అలాంటిది అటు ప్రజలకి, ఇటు పోలీసులకి మేము సింహస్వప్నంగా తయారయిపోయాం.

మా ముఠా పేరు చెపితే చాలు, కాకులు నీళ్ళు త్రాగేవి కావు; గుర్రాలు గుగ్గిళ్ళు కూడా ముట్టేవికావు!

అనుక్షణం ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని చావు బ్రతుకులు బ్రతికే ప్రజలని, సమాజాన్ని చూసి నేను కసిగా నవ్వుకునేవాణ్ణి. నా గుండె ఆనందంతో పొంగిపోయేది.

అందులోనే నాకు ఆనందం, సంతోషం కలిగేది.

"ఏరా చలపతీ! ఇంకా పడుకోలేదూ? ఏమిటి ఏదో పురాణం మొదలుపెట్టేవు?" అన్నాడు జైలు పోలీసు కటకటాలవతలనుంచి.

"లేదు గురూ! ఇవాల్టినుంచి మనకి మంచి స్నేహితుడు దొరికేడు. ఏదో పిచ్చాపాటీనూ!" అన్నాడు చలపతి.

"ఇంకా ఓగించలేదా?" అన్నాడు పోలీసు.

"లేదు! కొంచెం సేపు ఓపికపట్టు, పిలుస్తాను!" అన్నాడు చలపతి.

"సరే! పది నిమిషాల్లో వస్తాను. త్వరగా లాగించు!" అంటూ ముందుకి సాగిపోయాడు పోలీసు.

వాళ్ళ సంభాషణ నాకు తమాషా అనిపించింది. అర్థం కాకపోయినా, అలా వింటూ వుండిపోయాను.

"వీడు నా చిన్ననాటి స్నేహితుడు. సెకండ్ ఫారం వరకు కలిసి చదువుకున్నాం. తమాషా ఏమిటంటే వీడు పోలీసయ్యాడు, నేను దొంగనయ్యాను!" అన్నాడు చలపతి నవ్వుకుంటూ, విస్కీ సీసా మూత ఊడదీస్తూ.

"నువ్వు తాగుతావా?" అన్నాడు చలపతి.

"తాగను!" అన్నాను.

"అలవాటు లేదా?" అన్నాడు.

"అలవాటు లేక కాదు! నాకు ఇవాళ మటుకు తాగాలని లేదు!" అన్నాను.

"సరే!" అని సీసాలోని విస్కీ సగంపైగా తాగేసి మూత బిగించేడు. సిగరెట్టు వెలిగించి పొగ రింగులుగా వదుల్తున్నాడు. సెల్ అంతా పొగతో నిండిపోయింది.

"ఒరేయ్! చలపతీ! నువ్వు కాలుస్తున్న సిగరెట్టు పొగతో ఈ జైలంతా నిండిపోయేలా వుంది! అలా ఒక్కసారిగా గుప్పుగుప్పుమని సిగరెట్టు కాల్చుకోవద్దని నీకు లక్షసార్లు చెప్పేను. ఏ ఆఫీసరు కళ్ళల్లోనైనా పడితే, కొంపలు మునిగిపోతాయి!" అన్నాడు ఇందాకటి పోలీసు అదుర్దాగా పరిగెత్తుకుంటూ వచ్చి.

"లేదులేరా! వెధవ భయం నువ్వూనూ!" అంటూ చలపతి విస్కీ సీసా బైటకి అందించాడు. విస్కీ సీసా అందుకుని పోలీసు మారుమాట్లాడకుండా చీకటిలోకి నడిచేడు అదుర్దాగా.

"ఇవన్నీ నీకు ఈ పోలీసు సప్లయి చేస్తున్నాడా?' అన్నాను కుతూహలంగా.

"అచ్చే కాదు! కిచెన్‌లో వుంటాడు చూడు లావుగా, పొట్టిగా ఒకడు, వాడి ద్వారా వస్తాయి!" అన్నాడు చలపతి.

"వాడు నీకు ఎలా తెలుసును?" అన్నాను.

"అందులోనే వుంది కీలకం. వాడు కూడా ఒకానొకప్పుడు మన జాతివాడే! ఒకసారి వాడు ఒక ఇంటిలో దొంగతనానికి వెళ్ళినప్పుడు దొరికిపోయాడు. నలుగురూ పోగై వాణ్ణి చితగ్గొట్టిపారేశారు. అప్పుడు ఎడంచెయ్యి విరిగిపోయింది. మొత్తంమీద చెయ్యి బాగుపడినా, వాడు మటుకు వృత్తి మార్చేశాడు. జైలు సూపరింటెండెంటు వాడిమీద జాలిపడి జైల్లో ఉద్యోగం ఇప్పించాడు.

నేను జైలుకి వచ్చిన రోజునే వాడితో స్నేహం కలుపుకుని, మచ్చిక చేసుకున్నాను. నా మాట కాదనలేక, ఇలా సహాయం చేస్తుంటాడు. మందు లేకపోతే నాకు రోజు గడవదు మరి! నా నోటి మంచితనంతో, ఇలా నలుగురి సహకారంతో రోజులు గడుపుకొస్తున్నాను ఏలోటూ లేకుండా."

"మరి వీటన్నిటికి డబ్బు నువ్వే ఇస్తావా?" అన్నాను.

"లేకపోతే జైలు అధికారులు ఇస్తారనుకుంటున్నావా? ఇదిగో చూడు! కావాలంటే!" అని జేబులోంచి నోట్ల కట్ట బైటకి తీశాడు. అన్నీ పది రూపాయల నోట్లు. దాదాపు వెయ్యి రూపాయలకి తక్కువుండవు.

నాకు మతిపోయినట్టయింది. 'చలపతి సామాన్యుడు కాదు' అని మొదటిసారిగా అనుకున్నాను మనస్సులో.

"నాకు నిద్ర వస్తోంది. పడుకుంటాను. నువ్వు కూడా పడుకో. చాలా రాత్రి అయింది!" అన్నాడు చలపతి

పక్క మీద వాలిపోతూ.

నాకు చలపతి కథ ఇంకా వినాలని వుంది. మధ్యలో ఆపేసి, పడుకున్న చలపతిని చూస్తుంటే నాకు చికాకు, కోపం కలిగింది.

చేసేదిలేక నేను కూడా పడుకున్నాను.

జైలు గంట రెండు కొట్టి ఆగిపోడం నాకు లీలగా వినిపించింది. వెంటనే నిద్ర పట్టేసింది.

# 4

నేను జైలుకి వచ్చి నెలరోజులు పూర్తయింది. ఈ నెల రోజులు క్షణంసేపు కూడా తీరిక లేకుండా, విరామం లేకుండా గడిచిపోయాయి.

నేను జైలుకి వచ్చిన మూడో రోజు రాత్రి ఒక ఖైదీ జైల్లోంచి తప్పించుకు పారిపోయాడు. జైలు అధికారులకి క్షణం తీరిక లేకుండా, నిర్విరామంగా హడావిడి పడి పోయారు. పారిపోయిన ఖైదీ వారం రోజుల తర్వాత పట్టుబడిపోయాడు.

దాంతో జైలు వాతావరణం పూర్తిగా మారిపోయింది.

అధికారులు అప్రమత్తులై వుండడంతో మా ఖైదీల పని మరీ అధ్వాన్నంగా తయారైంది. గట్టిగా ఊపిరి తీసుకోడానికి కూడా భయమేసేది మాకు.

పగలంతా ఏవో పనులతో సరిపోయేది. పగలంతా కష్టించి పని చెయ్యడంవల్ల, రాత్రిళ్ళు వెంటనే నిద్రపోయే వాళ్ళం. పైగా రాత్రిళ్ళు ఎక్కువసేపు మెలుకువగా వుంటే జైలు అధికారులు ఊరుకునేవారు కారు.

చలపతికి ఇది మరీ దుర్భరంగా వుండేది. అతనికి వెనకటి లాగ విస్కీ సీసాల సరఫరా నిలిచిపోయింది. సిగరెట్లు,

బీడీలు మాత్రం మామూలుగానే కాల్చుకునేవాళ్ళం. అది కూడా అతి రహస్యంగా, జాగ్రత్తగానునూ.

అలాగే రోజులు భారంగా దొర్లిపోతున్నాయి.

నా జైలు శిక్షలో ఐదు నెలలు గడిచిపోయాయి. అంటే ఇంకో నెలరోజుల్లో నేను విడుదల చెయ్యబడతా నన్నమాట. ఇంకో నెలరోజుల్లో విడుదల అయిపోతా నన్న సంతోషంకన్నా, చలపతి, నేను విడిపోతామన్న దిగులు నాకు విచారాన్ని కలిగించింది.

క్రమంగా జైలు వాతావరణం మామూలుగా మారి పోయింది. వెనకటి కట్టుదిట్టాలు, నిర్బంధాలు తొలగి పోయాయి.

"చలపతీ! నేను ఇంకో నెలరోజులలో విడుదలయి పోతాను!" అన్నాను చలపతితో ఒకరోజు విచారంగా.

"అదేం! అలా నీరుకారిపోతున్నావు? ఉషారుగా వుండు! నీకు బైట ప్రపంచంకన్నా ఈ జైలులోనే హాయిగా వుందా కొంపతీసి?" అన్నాడు చలపతి.

"అది కాదు చలపతీ! ఇంతకాలం మనం ఎంతో ఆత్మీయులుగా, అన్నదమ్ముల్లాగ సంతోషంగా, ఆనందంగా గడిపేశాం. ఎందుకో నాకు నువ్వంటే ఒక గురుభావం కలిగింది. ఈ ఐదు నెలల కాలంలో ఒక ఆత్మీయుడిని వదిలి వెళ్ళిపోవడంలోని విచారం నన్ను మరీ కృంగదీస్తోంది!" అన్నాను.

చలపతి ఇందాకటిలా నవ్వడం మానేశాడు. నొచ్చుకున్నట్టు, బాధపడుతున్నట్టు కనిపించాడు.

నన్ను గట్టిగా కౌగలించుకుని, "చూడు! నిజానికి నాకు, నీకన్నా ఎక్కువ బాధగానూ, విచారంగానూ

వుంది. నువ్వు మాటలతో వ్యక్తం చేసినది, నేను మనస్సులోనే అనుభవిస్తున్నాను.

ఆ రోజు మనం ఇద్దరం మొదటిసారిగా ఈ జైలు గదిలో కలుసుకున్నప్పుడు నీ మీద నాకు ఏదో చెప్పలేని అభిమానం, ప్రేమ కలిగాయి. అందుకే నీతో నా బాల్య జీవితం దగ్గరనుంచి, ఇంతవరకు నేను అనుభవించిన కష్టాలు చెప్పుకోకుండా వుండలేకపోయాను.

ఇంతకాలం నేను గడిపిన నా జీవితకాలంలో నీలాంటి ఆత్మీయుడు నాకు కనిపించలేదు. నేను కలుసుకోనూ లేదు. నిన్ను చూడగానే నాలో మరుగుపడిపోయిన ప్రేమ, దయ, కరుణ, వాత్సల్యం పెల్లుబికిపోయాయి. నా జీవితం, నా చరిత్ర తెలిసిన వ్యక్తి అంటూ ఎవరైనా ఈ లోకంలో వుంటే అది నువ్వే!

విచారించకు! నువ్వు నాకన్నా నెలరోజులు ముందుగా ఈ జైలునుంచి విడుదలవడం కూడా నా మంచికే!" అన్నాడు చలపతి నన్ను ఓదారుస్తూ.

"ఏం! ఎందుకని?" అన్నాను అర్థంకానట్టు.

"కంగారుపడకు! చెప్తాను. జైలులోంచి నువ్వు విడుదలయిన తరువాత నువ్వు చెయ్యవలసిన పని చాలా వుంది. నీమీద ఎంతో విలువైన బాధ్యత పెడుతున్నాను. నువ్వు కొంచెం కష్టపడితే, ముందుముందు నా పని తేలికౌతుంది!" అన్నాడు చలపతి.

"త్వరగా చెప్పు! అదేమిటో!" అన్నాను కుతూహలంగా.

"ఇప్పుడు కాదు! రాత్రికి చెప్తాను!" అన్నాడు చలపతి.

"అన్నట్టు, నీ కథ నాకు పూర్తిగా చెప్పనేలేదు! ఆ రోజు మధ్యలోనే ఆపేశావు! ఆ తరువాత ఏవేవో అవాంతరాలు రావడంతో అసలు మనం మాట్లాడుకుందుకే కుదిరిందికాదు!" అన్నాను.

"ఔను! నిజమే! నేను చెప్పబోయే మిగిలిన కథలోనే వస్తుంది. నువ్వు అడిగిన ప్రశ్నకి జవాబుకూడాను!" అన్నాడు చలపతి.

# 5

ఆ రోజు రాత్రి చలపతి మళ్ళీ ప్రారంభించాడు తన ఆత్మకథని.

"చూడు! రోజులు ఎప్పుడూ ఒకేలాగ వుండవు. అన్ని రోజులు మనవికావు. కొంతకాలం ఆనందంగా, కొంతకాలం విచారంగా, తారుమారై పోతుంటాయి.

పదిసంవత్సరాలు, కలకత్తాలో, ఎంతో ఆనందంగా సంతోషంగా గడిచిపోయాయి.

ఆ తర్వాత ప్రారంభమైంది నా దుర్దశ. ఎన్నో కష్టాలు అనుభవించాను పరంపరగా.

ఒకరోజు కలకత్తాలోని 'సీల్డా' స్టేషన్‌లో ఒక వ్యక్తితో పరిచయం అయింది నాకు. అతని పేరు భుజంగం. ఆ భుజంగంగాడే నన్ను దగాచేశాడు. నాతోపాటు మా ముఠా యావత్తూ సర్వనాశనమైపోయింది" అని ఆగేడు చలపతి.

చలపతి ముఖం కోపంతో ఎర్రగా మారిపోయింది. కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. ఆ పరిస్థితిలో చలపతి నా కళ్ళకి ప్రళయకాలరుద్రుడిలా కనిపించేడు.

కొంచెంసేపు ఆగి "భుజంగం నిన్నూ, నీ ముఠావాళ్ళని

ఎలా మోసం చెయ్యగలిగేడు?'' అన్నాను కుతూహలంగా.

"మా ముఠావాళ్ళం అనేకరకాల అక్రమ రవాణా వ్యాపారాలు, దొంగనోట్ల మారకాలు కూడా చేసేవాళ్ళం.

భుజంగం చేసే వ్యాపారంకూడా అటువంటిదే! కాని అతన్ని ఎవరూ, అనుమానించరు. అనుమానించినా, అతని మీద ఎవ్వరూ, ఎటువంటి చర్యా, తీసుకోలేరు. ఎందుకంటే అతను సంఘంలో పెద్దమనిషి, శ్రీమంతుడు. అతని పేరు చెపితే కొమ్ములు తిరిగిన వాళ్ళుకూడా హడలెత్తిపోతారు. తనదారికి అడ్డం తగిలినవాళ్ళని, తన మాటకి ఎదురు చెప్పేవాళ్ళని, ప్రాణాలతో బ్రతకనీయడు.

"ఆ సంగతి నీకు ఎలా తెలిసింది? మరి అటువంటి వాడితో నువ్వు స్నేహం ఎందుకు పెంచుకున్నావు?'' అని అడిగేను.

"చెప్పేది పూర్తిగా విను! మధ్యలో ప్రశ్నలువేసి విసిగించకు!'' అన్నాడు చలపతి చికాకుగా.

నేను మౌనంగా వుండిపోయాను.

"నేను తెలుగువాడిని కావడంవల్ల, భుజంగం నేను అతిత్వరలో స్నేహితులమైపోడంలో ఆశ్చర్యం ఏముంది? నేను చాలాసార్లు అతని ఆహ్వానంమీద అతని హోటల్ రూంకి వెళ్ళి, ఆనందంగా గడిపేవాడిని.

ఒకరోజు భుజంగం అతను చేసే వ్యాపారం గురించి నాతో చెప్పేడు. నా సంగతి ముందే తెలుసుకుని, నాతో స్నేహం పెంచుకున్నానని, మాకు ఇతర దేశాలనుంచి దిగుమతి అయ్యే బంగారం, వజ్రాలు, ఇతర వస్తువులు తనకే అమ్మమని, నాతో చెప్పేడు.

మేమిద్దరం ఒకే రకమైన వ్యాపారస్థులం కనుక, అతి

త్వరలోనే మా స్నేహం, బాగా వృద్ధి చెందింది.

నేను ఒకరోజు మా ముఠా వాళ్ళకి భుజంగాన్ని పరిచయం చేశాను.

మా ముఠానాయకుడు భుజంగాన్ని ఎందుకో అనుమానించాడు. మా ముఠాతాలూకు రహస్యాలన్నీ భుజంగానికి చెప్పినందుకు, మా నాయకుడు నామీద విరుచుకు పడిపోయాడు. కాని నేను భుజంగం ఎంతో మంచివాడని, నాకు చాలాకాలంనుంచి పరిచయమైన వ్యక్తని, ఎన్నో అబద్ధాలు చెప్పి, మా నాయకుణ్ణి, ఎలాగో ఒప్పుకునేలా చేసేసరికి నా తలప్రాణం తోకకివచ్చింది.

త్వరలోనే భుజంగం మేముచేసే వ్యాపార వస్తువులన్నీ భారీగా కొనుగోలు చేసి, . మన ప్రాంతాలకి తరలించుకు పోయేవాడు.

మా దగ్గర దొంగబంగారం, వజ్రాలు, నల్లమందు, గంజాయి, భారీగా కొనుగోలు చేసేవాడు. దొంగనోట్లు లక్షల రూపాయల మారకం చేసేవాడు. మేము చేసే చోరీ వస్తువులన్నీ దుత్తబేరంగా కొనేసేవాడు.

అలా సంవత్సరంపాటు మా వ్యాపారం దిగ్విజయంగా సాగిపోయింది.

భుజంగం ఒకరోజు మా దగ్గర కొనుగోలుచేసిన సరుకులు రవాణా చేసి తీసుకుపోతుండగా, పోలీసులకి కస్టంస్ అధికారులకి, తన అజాగ్రత్తవల్ల దొరికిపోయాడు.

అప్పుడు మా ముఠారహస్యం బైటపెట్టి, మమ్మల్నందర్నీ నేరస్థులుగా ఋజువుచేసి, నేరం మామీద తోసేసి, తను తెలివిగా, తెరమీదికి రాకుండా, తప్పించుకుని పారిపోయాడు భుజంగం.

తన రక్షణకోసం, తన స్వార్థంకోసం, మమ్మల్ని పట్టించి, మా ముఠాయావత్తుకి, వెన్నుపోటు పొడిచి పారి పోయాడు.

అధికారుల ఆకస్మిక దాడి, మా ముఠాని సులభంగా, గుర్తించి పట్టుకోగలిగింది. మా రహస్య స్థావరాలు, మా రహస్యాలు, తెలుకోగలిగిన అధికారులకి, మా ఉనికిని గుర్తించడం ఏమంత కష్టంకాదుకదా!

మా ముఠా దొరికిపోయిందని, దుర్భేధ్యమైన మా శత్రు సమానులైన పోలీసుఅధికారులకి లొంగిపోయిందని, మా ముఠానాయకుడు పడిన బాధ, మానసికక్షోభ, నేను వర్ణించలేను.

భుజంగం చేసిన నమ్మకద్రోహం, మిత్రద్రోహం, నాలో పగ, ప్రతీకారం ప్రజ్వరిల్లింపజేసింది. మానసికంగా నేను ఎంతో చిత్రక్షోభకి గురయ్యాను.

మా ముఠానాయకుడు, అతని వంశంలోని ముఖ్యులైన మరో ఆరుగురు అనుచరులు, పోలీసుల చేతుల్లో చిక్కి, నేరస్థుల క్రింద గుర్తింపపడి, జైలు జీవితం గడపడం ఇష్టంలేక, విషంతిని ఆత్మహత్య చేసుకుని మరణించారు.

వాళ్ళ ఏడుగురి ఆకస్మిక మరణానికి కారణమైన నన్ను నేను ఎంతగానో నిందించుకున్నాను.

అవసానదశలో ఉన్న మా ముఠానాయకుడికి, నేను ప్రమాణంచేశాను. మా ముఠాకి తీరని అన్యాయంచేసి, మా ముఠా పతనానికి కారకుడైన భుజంగాన్ని అంతంచేసి, వాళ్ళ ఏడుగురి ఆత్మలకి శాంతి చేకూరుస్తానని.

నేను, నాతోపాటు, మా ముఠాలోని మరో ఇద్దరు కలిసి, ఆ రాత్రే రహస్యంగా పారిపోయాము, పోలీసుల కళ్ళుకప్పి.

వారం రోజులపాటు అతి రహస్యంగా ప్రయాణంచేసి ఖరగ్‌పూర్‌కి చేరుకున్నాం.

కొండదారులు, పొలాలు, బీడులు, దాటుకుంటూ, మా ఉనికి ఎవ్వరు గుర్తించకుండా, రాత్రిసమయాల్లోనే ప్రయాణం సాగించేవాళ్ళం. పగలు ఏ కొండగుహల్లోనో, చెట్లమీదనో విశ్రాంతి తీసుకునేవాళ్ళం. మేము రహస్యంగా దాచుకున్న డబ్బుకూడా మా వెంట తెచ్చుకున్నాము.

ఖరగ్‌పూర్ ఊరి పొలిమేరలు చేరుకునేసరికి మాతో తీసుకువెళ్ళిన, ఆహారపదార్థాలు అయిపోవచ్చాయి. సుమారు నూటఇరవై కిలోమీటర్ల దూరం మాకు ఏమంత కష్టంఅనిపించలేదు. కాని, రాత్రిళ్ళు ప్రయాణం, దారిసరిగా తెలియదు. అందులోనూ, విపరీతమైన చలి. మంచులోను, ప్రయాణం చెయ్యడంవల్ల, మా శరీరాలు పూర్తిగా అలిసిపోయాయి.

బాగా చీకటిపడేవరకు ఊరి పొలిమేరలో కాలక్షేపం చేసి, రాత్రికి ఖరగ్‌పూర్ ఊళ్ళోకి బయలుదేరాం.

మేము భయపడినంతగా ఖరగ్‌పూర్‌లో పోలీసులు, మా కోసం వేటాడుతున్నట్టు కనిపించలేదు.

మేము ముగ్గురం ఖరగ్‌పూర్‌లోని ఒక చిన్న లాడ్జీలో, విడివిడిగా మూడుగదుల్లో దిగాం. అక్కడ మా అవతారాలు పూర్తిగా మార్చేసుకున్నాం.

భుజంగం మేము ఊహించినంత తెలివితక్కువవాడు, అమాయకుడు కాడని, త్వరలోనే తెలియవచ్చింది మాకు.

భుజంగం నాతో చెప్పిన ఎడ్రస్‌కి వెళ్ళి విచారించాం. అటువంటి పేరుగల వ్యక్తి ఆచూకి అక్కడివాళ్ళు ఎవ్వరూ మాకు చెప్పలేకపోయారు.

తన పేరు, ఊరిపేరు, చిరునామా, అన్నీ కూడా మాతో అబద్ధాలు చెప్పి, తన ఉనికి ఎవరికీ, ఏ పరిస్థితుల్లోనూ గుర్తించడానికి వీలులేకుండా జాగ్రత్త పడ్డాడు.

నేను ఎలాగూ, ఆంధ్ర ప్రాంతం, తెలుగువాడిని కనుక నాకు ఎలాగూ ఇబ్బందిలేదు. ఎటొచ్చీ తెలుగుప్రాంతం వదిలి బెంగాల్ రాష్ట్రంలో చాలకాలం ఉండడంవల్ల, నేను తెలుగు మాట్లాడుతుంటే కొంచెం బెంగాలీ యాసగా ఉంటుంది.

నాతో వున్న నా అనుచరులు ఇద్దరూ పూర్తిగా బెంగాలీవాళ్ళు. తమాషా ఏమిటంటే, వాళ్ళు నా దగ్గర తెలుగుభాష నేర్చుకుని, నాకన్నా చక్కగా, సిసలైన ఆంధ్రులలాగ మాట్లాడతారు.

భుజంగం మాట్లాడే తెలుగు శాస్త్ర ఆంధ్రాలో తూర్పు గోదావరిజిల్లా ప్రాంతీయులు మాట్లాడే యాసలో వుంటుంది. కనుక భుజంగం తప్పకుండా, తూర్పుగోదావరి జిల్లా ప్రాంతంలో జాగ్రత్తగా వెతికితే పట్టుబడిపోవచ్చు, అన్న ఆలోచన రాగానే, మిగిలిన జిల్లాలు వదిలిపెట్టి, తూర్పుగోదావరిజిల్లా ఒకవేపునుంచి ఒకవేపుకి గాలించి పారేశాం. పల్లెలనుంచి పట్నాలవరకు కిలోమీటరు దూరం కూడా వదిలిపెట్టకుండా.

ఆఖరికి మా ప్రయత్నం ఫలించింది. భుజంగం ఒకరోజు ఆకస్మికంగా రాజమండ్రిలో కనిపించాడు కారులో వెడుతూ!'' అని చెప్పడం ఆపి సిగరెట్టు వెలిగించాడు చలపతి.

''రాజమండ్రీలోనా? అంటే ఈ ఊళ్ళోనే?'' అన్నాను ఆశ్చర్యపోతూ.

"ఔను! ఇదే ఊళ్లో! కాని తమాషా ఏమిటంటే కలకత్తాలో నే నెరిగిన భుజంగానికి, అప్పుడు రాజమండ్రిలో కనిపించిన భుజంగానికి అసలు ఎక్కడా పోలికలు లేవు.

కలకత్తాలో భుజంగం ఎప్పుడూ ఫుల్ సూటులో, ఒత్తుగా క్రాఫింగ్, గుబురు మీసాలతో భయంకరంగా వుండేవాడు. ఎప్పుడూ కూలింగ్ గ్లాసెస్ తీసేవాడు కాదు.

అలాంటిది భుజంగం ఇప్పుడు తెల్లని పొందూరు జరీ ఖద్దరు పంచ, లాల్చీ; బట్టతల. ముఖంలో ఎంతో నిర్మలత్వం, మాటలలో జాలి, కరుణ, ప్రేమ, వాత్సల్యం.

'ఆహా! ఎంత చక్కగా వేషం మార్చుకుని, రెండు విభిన్న పాత్రలలో అద్భుతంగా పరకాయప్రవేశం చేశాడు!' అని నేను మెచ్చుకోకుండా వుండలేకపోయానో చెప్పలేననుకో!"

చలపతి చెప్పడం ఆపుచేసి, మళ్ళా సిగరెట్టు వెలిగించాడు.

"మరి పేరు కూడా మార్చుకునే వుంటాడని నా అనుమానం!" అన్నాను.

"అనుమానం ఏమిటి? నిజంగానే మార్చుకున్నాడు. అతని అసలు పేరు ధర్మరాజు. నిజంగా సత్యం, ధర్మం, శాంతి, సహనం కలబోసిన అమృతమూర్తిలా, పెద్ద మనిషిలా, పేదలపాలిటి పెన్నిధిలా కనిపిస్తాడు ప్రజలకి.

ధర్మరాజు ఆర్థిక సహాయంతో ఎన్నో అనాథ శరణాలయాలు, ఆసుపత్రులు, హైస్కూళ్ళు నడుపబడుతున్నాయి.

ఎన్నో పేద కుటుంబాలు, ఎందరో బీదవిద్యార్థులు, అతని నీడలో, అండదండలలో, ఆర్థిక సహాయ కార్య క్రమాల్లో జీవిస్తున్నారు.

ధర్మరాజు తెరవెనక జీవితం ఎరుగని ప్రజలు అతన్ని గుడ్డిగా ప్రేమిస్తున్నారు. కీర్తిస్తున్నారు. పైకి అతనిలో కనిపిస్తున్న, స్వార్థపూరితమైన మంచితనం అటు ప్రజలని, పోలీసులని, చట్టాన్ని, న్యాయస్థానాన్ని వంచిస్తోంది, మోసగిస్తోంది.

అటువంటి ధర్మరాజుని మేము ఎలా ఎదుర్కొనగలం? ఎలా అతనిలోని రాక్షసత్వాన్ని తెరముందుకు తీసుకు రాగలం? ఎలా అతని జీవితాన్ని, ప్రాణాన్ని నాశనం చెయ్యగలం? అన్న మీమాంసలో ఒక వారం రోజుల పాటు ఉక్కిరిబిక్కిరి అయిపోయాం.

ఆఖరికి మా అదృష్టం బాగుండి ఒకానొక చక్కని అవకాశం కాకతాళీయంగా వచ్చింది మాకు.''

''ఎలా?'' అన్నాను కుతూహలంగా.

''ధర్మరాజు కారు డ్రైవరు అనుకోకుండా దుర్మరణం'' పాలయ్యాడు.

నడిరోడ్డుమీద ఒక లారీక్రింద వందలాది ప్రజల కళ్ళ ముందు చంపబడ్డాడు. పోలీసుల శవపరీక్షలో డ్రైవరు ఒళ్ళు తెలియని విపరీతమైన త్రాగుడు నిషాలో రోడ్డు దాటుతున్న సమయంలో లారీక్రింద పడి మరణించినట్టు రుజువు చెయ్యబడింది.

అనుకోకుండా వచ్చిన ఈ అవకాశాన్ని మేము సద్వినియోగపరుచుకున్నాం. ఫలితంగా మా ముగ్గురిలో ఒకడు ముఖర్జీ అనేవాడు భుజంగం కారు డ్రైవర్‌గా నియమించబడ్డాడు.

మరో పది రోజుల తర్వాత మా ముఠాలోని ఇంకొకడు శంకర్ అనేవాడు ధర్మరాజు ఇంటిలో వంటవాడిగా చేరి పోయాడు.

అలా నెల రోజులపాటు సాగిపోయింది. నేను మా ముఠాలోవాళ్ళని జాగ్రత్తగా కలుసుకుంటూ ఎప్పటి కప్పుడు సమాచారాన్ని సేకరిస్తో, సమయంకోసం ఎదురు చూస్తో గడుపుతున్నాను.

అయితే, అనుకోకుండా ఒక రోజు ఒక విచిత్ర పరి స్థితిలో నేను చెయ్యని నేరంమీద పోలీసులకి దొరికిపోయి సంవత్సరం కారాగారశిక్షకి గురై జైలుపాలయ్యాను.

'అసలు నేరం ఒకడు చేస్తే, అమాయకులైన మరొకరు శిక్ష అనుభవిస్తారు!' అదే విచిత్రం! ఈ జైలు జీవితం అనుభవిస్తున్నందుకు అనుక్షణం నేను ఎంతో బాధపడు తున్నాను.

కసి, ద్వేషం నన్ను అనుక్షణం రెచ్చగొడుతున్నాయి. ఈ జైలులోంచి తప్పించుకుని పారిపోవడం నాకు ఒక లెక్కలోది కాదు. అసలు నాకు ఆ ఆలోచన కనుక వుంటే నేను ఏనాడో ఇక్కడనుంచి పారిపోయి వుండే వాడిని.

కాని ఈ నా ప్రస్తుత పరిస్థితిలో అది తెలివితక్కువ పని అని నా వివేకం నన్ను వారిస్తోంది.

ఒకవేళ ఈ జైలులోంచి తప్పించుకు పారిపోయినా ఎలాగూ నేను ఈ ఊళ్ళోనే తిరగవలసినవాణ్ణేగా! నా వ్యవహారం, నా కార్యక్రమం ఈ ఊళ్లోనే కదా! పారి పోతే నిమిషాలమీద దొరికిపోనూ?

అందుకని నేను ఇలా చేతులు కట్టుకుని పరిస్థితులకి లొంగిపోయి వున్నాను.

ఇంకా ధర్మరాజు పాపం పండలేదేమో! అందుకనే నేను ఇలా జైలుపాలయ్యాను. లేకపోతే ధర్మరాజు ఆట ఏనాడో కట్టేసేది."

"నిజమే చలపతీ! ధర్మరాజు జాతకబలం బాగుండబట్టే నువ్వు ఇలా తెరవెనుక జీవితం గడపవలసివస్తోంది!" అన్నాను నొచ్చుకుంటూ.

"అంతిమ సమయంలో మృత్యువుతో పోరాడుతున్న మా నాయకుడి దగ్గర నేను చేసిన ప్రతిజ్ఞ, శపథం నెరవేర్చుకోవాలి. నా ఈ చేతులతో ధర్మరాజు, అతని వంశ వృక్షం సర్వనాశనం కావాలి.

ప్రాణాలకి ప్రాణాలు, వంశానికి వంశం బదులు కావాలి!" క్రోధంతో, కోపంతో చలపతి రెచ్చిపోయాడు. ఆవేశంతో చలపతి ఊగిపోతున్నాడు.

చలపతి కోపం తగ్గి, మామూలు స్థితికి వచ్చేవరకు నేను మౌనంగా వుండిపోయాను.

"అన్నట్టు నీకన్నా నేను ఒక నెలరోజులు ముందుగా విడుదల చెయ్యబడతాను! ఈలోపుగా నేను చెయ్యవలసిన కార్యక్రమం ఏదో వుందన్నావు! ఏమిటది?" అని అడిగాను చాలాసేపు తరువాత కుతూహలంగా.

"ఔను! నిజమే! చెప్తాను విను. అన్నట్టు నీ అజాగ్రత్తవల్ల ధర్మరాజుకి దొరికిపోతే ప్రాణాలు పోతాయి. అసలే వాడు కర్కోటకుడు! జాగ్రత్త సుమా!" అంటూ చెప్పుకుంటూపోయాడు చలపతి.

# 6

నేను జైలులోంచి విడుదలయి అప్పుడే పది రోజులు కావస్తోంది. ఇంకో ఇరవై రోజుల్లో చలపతి కూడా విడుదల చెయ్యబడతాడు.

చలపతి నాకు చెప్పిన విషయాలు అనుక్షణం నా మనస్సులో మెదులుతూ నేవున్నాయి. నేను చలపతి మిత్రుడు ముఖర్జీని కలుసుకుని ఎప్పటికప్పుడు విషయాలు సేకరిస్తూ వుండేవాడిని.

ధర్మరాజు స్నేహితులు ఎవరెవరో? అతని అనుచరులు ఎవరో? అతని రహస్య స్థావరాలు ఎక్కడెక్కడో? అతను చేస్తున్న దొంగరవాణాలు, అక్రమరవాణాలు ఏమిటో మొదలైన విషయాలన్నీ ముఖర్జీ ద్వారా తెలుసుకున్నాను.

దొంగవ్యాపారాలు, దొంగరవాణాలు, దొంగనోట్ల మారకాలు చెయ్యడంలో ఆరితేరిన ముఖర్జీ త్వరలోనే తన వృత్తి ప్రావీణ్యత చూపించి, ధర్మరాజుకి కుడి భుజంగా తయారయ్యాడు.

ముఖర్జీ అచిరకాలంలోనే ధర్మరాజుకి అతి సన్నిహితుడుగా, నమ్మినబంటుగా, అంతరంగికుడిగా మారిపోయాడు.

ధర్మరాజుకి ఇప్పుడు స్వంతంగా దొంగనోట్లు ముద్రించే యంత్రం కూడా వుంది అండర్ గ్రౌండ్ లో. అందులో ముద్రింపబడే దొంగనోట్లు, ధర్మరాజు యాజమాన్యంలో నడుస్తున్న రెండు పంచదార ఫ్యాక్టరీలు, గాజు, పింగాణీ పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికుల వేతనాల క్రింద ప్రతీ నెలా బట్వాడా చెయ్యబడుతున్నాయి.

పొరపాటుగా తన రహస్యాలు బైటపడి, తనకి ఎదురు తిరిగిన వ్యక్తులని రహస్యంగా అంతంచేసి, వాళ్ళ శవాలు ఎటువంటి పర్యవేక్షణలకి, ఆచూకీలకి అంతుచిక్కకుండా మటుమాయం చెయ్యడంలో కూడా ధర్మరాజుది అందె వేసిన చెయ్యి.

ఇలా అన్ని విషయాలు ముఖర్జీ స్వయంగా ఎప్పటి కప్పుడు రహస్యంగా కనిపెడుతూ సేకరించిన విషయాలు నాకు తెలియజేశాడు రుజువులతో సహా.

కాని నేను చెయ్యగలిగేది ఏముంది? ధర్మరాజు అతని అనుచరులని నిర్బంధించడం మాట అలా వుంచి, అతని బంగళాలోకి వెళ్ళగలగడమే ఎంతో కష్టం. అది ఒక పద్మవ్యూహం. అందులోకి ఒక వేళ వెళ్ళగలిగినా, ప్రాణా లతో తిరిగి బయటకి రావడం సర్వకల్ల.

చలపతి వచ్చేవరకు నేను వేచివుండక తప్పదు. నేను సేకరించిన వివరాలు అతనికి చెప్పి, అతని సలహామీద, అతని పర్యవేక్షణలో నేను అతనికి ఉడతాభక్తిగా సహాయపడగలను. అంతకన్నా నేను స్వయంగా తెగించి ఏ నిర్ణయం తీసుకోదలుచుకోలేదు.

చలపతి జైలులోంచి విడుదల అయిన ఇరవైనాలుగు గంటల లోపులో ధర్మరాజుని, అతని వంశాన్ని సర్వ నాశనం చేస్తానని నాతో ఎంతో ఉద్వేగంతో, కోపంతో అన్నాడు. నిజానికి అదే అతని ధ్యేయం.

అయితే, ప్రతీకారంతో, పగ, ద్వేషాలతో చలపతి హంతకుడిగా మారడం నాకు ఎంతమాత్రం ఇష్టంలేదు. హంతకుడిగా మారిన చలపతికి ఉరిశిక్ష విధిగా విధింప బడుతుంది.

అందుకని చలపతి జైలులోంచి విడుదల అయ్యే లోగానే ధర్మరాజు ఆటలు కట్టించి అతనిని పోలీసులకి అప్పగించాలి.

చలపతిని హంతకుడిగా మారే అవకాశాన్ని తప్పిం చాలి. ఎలాగ?

ఒక వేళ ఏ పోలీసు స్టేషన్‌లో వెళ్ళి, ధర్మరాజు గురించి సేకరించిన సమాచారం తెలియజేపితే ముందు పోలీసులు నన్నూ, ముఖర్జీని, శంకర్‌ని అరెస్టుచేసి జైల్లో పారేస్తారు వెనకాముందూ చూడకుండా.

అంతలో నాకు చక్కని ఆలోచన వచ్చింది.

నాకు ప్రైవేట్ డిటెక్టివ్ షణ్ముఖరావు జ్ఞాపకం వచ్చాడు. అతను ఎన్నో నేరాలు అద్భుతంగా పరిశోధించి నేరస్థులను పట్టుకున్నాడు. ఈ విషయంలో అతని సలహా అడిగితేనో?

నాకు షణ్ముఖరావుమీద ఎంతో గురి, నమ్మకం వున్నాయి. నేరస్థులను, అన్యాయాన్ని, అక్రమాన్ని అతను ఏ పరిస్థితుల్లోనూ సమర్థించడు. నేరస్థులు ఎటువంటి వారైనా, ఎంతటివారైనా అతను లక్ష్య పెట్టడు. న్యాయం, ధర్మం అతనికి ఊపిరి, ప్రాణంలాంటివి.

## 7

షణ్ముఖరావుతో నా గురించి యావత్తూ పూసగుచ్చినట్టు చెప్పుకుంటూపోయాను ఏదీ దాచకుండా. నా విషయంతోపాటు జైలులో నాకు పరిచయమైన చలపతి గురించి, అతని ద్వారా నేను విన్న ఆత్మకథ; ధర్మరాజు, ముఖర్జీ, శంకర్‌ల వృత్తాంతం పూర్తిగా వివరించి చెప్పడానికి మూడు గంటలు పట్టింది.

నేను చెప్పినదంతా షణ్ముఖరావు అసిస్టెంటు టేప్ రికార్డు చేశాడు.

నేను చెప్పడం పూర్తయిన తర్వాత డిటెక్టివ్ షణ్ముఖరావు నా దగ్గరకు వచ్చి, ఆప్యాయంగా నన్ను అభినందించాడు.

డిటెక్టివ్ షణ్ముఖరావు, అతని అసిస్టెంట్ ప్రసాద్ సమయం చూసుకుని రంగంలోకి దిగేరు సర్కిల్ ఇన్ స్పెక్టర్ ఆఫ్ పోలీస్ రాజారెడ్డి సహకారంతో.

ఇప్పుడు నాకు ఎంతో ఆనందంగా వుంది.

చలపతి జైలులోంచి విడుదల చెయ్యబడిన రోజున జైలు దాపులలో కాపుకాసి అతనిని కలుసుకున్నాను.

చలపతిని తీసుకుని తిన్నగా డిటెక్టివ్ షణ్ముఖరావు ఆఫీసుకు తీసుకువెళ్ళేను. ధర్మరాజు, అతడి ముఠాను కూడా అంతకు క్రితమే అరెస్టుచేసి తీసుకొచ్చారట.

అక్కడ అంతా ఎంతో కోలాహలంగా, హడావిడిగా వుంది పోలీసులతో, పోలీసు ఆఫీసర్లతో.

చలపతి, నేను పోలీసు వేనులు, జీపులు తప్పించు కుంటూ లోపలకి వెళ్ళాం.

డిటెక్టివ్ షణ్ముఖరావు మా దగ్గరకు వచ్చి, చల పతితో, నాతో కరచాలనం చేశాడు.

చలపతికి ఏమీ అర్థంకానట్టు మతిపోయినవాడిలా వుండిపోయాడు.

లోపల పెద్ద హాలులో అంతా సమావేశమయ్యారు.

దూరంగా ఒక మూల ధర్మరాజు, అతని అనుచరులు వరుసగా నిలబడ్డారు, చేతులకి సంకెళ్ళతో.

ఒక ప్రక్కగా శంకర్, ముఖర్జీలు నిలబడి వున్నారు; నవ్వుతూ, మాకు స్వాగతం చెపుతూ.

నేను, చలపతి శంకర్, ముఖర్జీలవైపుకి నడిచాం.

షణ్ముఖరావు ప్రారంభించాడు ఉపన్యాసంలా.

ముందు నా దగ్గరనుంచి సేకరించిన సమాచార యావత్తూ వివరించాడు. అందులో నేను, చలపతి, ముఖర్జీ శంకర్, ధర్మరాజు, అతని అనుచరుల వృత్తాంతా

ఒక్కొక్కటిగా బైటకి వచ్చాయి.

అటుతర్వాత తను, అతని అసిస్టెంటు ప్రసాద్, సి.ఐ. రాజారెడ్డి ఎలా రంగంలోకి దిగి, నేరస్థులని పట్టుకున్నదీ వివరించాడు; ఋజువులు, సాక్ష్యాలతో.

ఎప్పటికప్పుడు టేప్ రికార్డర్‌లో రికార్డు చెయ్యబడిన సంభాషణలతో, ఋజువులతో, సాక్ష్యాలతో ధర్మరాజు మీద, అతని అనుచరులమీద నేరం రుజువైంది.

శంకర్, ముఖర్జీలు ముందుగా సేకరించుకున్న సమాచారం నేరస్థులను పట్టుకోడానికి ఎంతగానో ఉపకరించింది.

ధర్మరాజుమీద దొంగనోట్ల ముద్రణ, దొంగనోట్ల చలామణి, దొంగబంగారం, వజ్రాలు, నల్లమందు, గంజాయి, ఇతర దేశీయ, విదేశీయ సరుకుల స్మగ్లింగ్ నేరాలు; ధర్మరాజు చేసిన, చేయించిన పదహారు హత్యా నేరాలు సాక్ష్యాలతో నేరాలన్నీ ఋజువు చెయ్యబడ్డాయి.

చలపతిని గుర్తుపట్టిన ధర్మరాజు ముఖం కందగడ్డలా మారిపోయింది.

చలపతితోపాటు నాకూ, శంకర్, ముఖర్జీలకి కూడా ఎంతో సంతోషంగా, ఆనందంగా, ఉత్సాహంగా వుంది.

ఫొటోగ్రాఫర్ల కెమేరాలు అన్నీ ఒక్కసారి 'క్లిక్' మన్నాయి. గదంతా ఎంతో కాంతితో కళ్ళు జిగేల్‌మని మెరిశాయి.

ధర్మరాజు, అతని అనుచరులు ఎక్కిన పోలీసు వేన్ వెనకాలే చలపతి, శంకర్, ముఖర్జీలు ఎక్కిన పోలీసు వేన్ కూడా బయలుదేరింది పోలీసు స్టేషన్ కేసి.

—: ఐ పో యిం ది :—

# రహస్య సాగరం

సంపత్

"బుయ్"మని చప్పుడు చేస్తూ ఎగురుతోంది విమానం.

లోపల కూర్చొనున్న విశ్వనాథ్ బృందం దీర్ఘాలోచనల్లో మిళితమై వున్నారు.

విశ్వనాథ్ - బ్రిగేడియర్. నలభైనాలుగు సంవత్సరాలుంటాయతనికి. ధృఢమయిన శరీరం. ఆరుగురు బృందంగల ఈ ఆపరేషన్ కు కమాండర్ గా నియమింపబడిన వ్యక్తి.

అతని ప్రక్కగా సన్నగా ఉన్నట్టు కనిపించే వ్యక్తి మేజర్ ప్రతాప్. సీరియస్ గా, తనకేమీ పట్టనట్లుగా ఉంటాయతని చూపులు. అతని వయస్సు దాదాపు ముప్ఫయిఏడు. మంచి ఎక్స్ప్లోజివ్ ఎక్స్పర్ట్.

మిగిలిన వ్యక్తులు లెఫ్టినెంట్ కర్తార్ సింగ్, కెప్టెన్

డిసౌజా. మరో ఇద్దరు సహాయకులు, చంద్రకాంత్, కుమార్ సాహ్ని.

విమానంలో లైట్లు డిమ్‌గా వెలుగుతున్నాయి. కళ్ళో ఉన్న మాప్‌ని ఒకసారి చూసి, తాము దిగవలసిన ప్రదేశాన్నొకమారు గుర్తుపెట్టుకొని, జేబులోకి తోసేసాడు.

మరో అరగంట తర్వాత విమానంలో ఎర్రలైటు వెలిగింది. అందరూ లేచి నిలబడ్డారు. మౌనంగా పారచూట్స్ తగిలించుకోసాగారు. వీరుగాక విమానంలో మిగిలిపోయిన ఏడో వ్యక్తి వారు ధరించడంలోనూ, ఇతరత్రా సహాయపడసాగాడు.

విమానం పైలెట్ స్పీకర్‌లో తాము దిగవలసిన హిమాలయాల ప్రాంతాలు సమీపించినట్లు తెలియజేశాడు. అందరూ రెడీగా వున్నారు.

మరో పావుగంట అనంతరం, డోర్ దగ్గర ఎర్రలైటు ఆరిపోయి, పచ్చలైటు వెలిగింది. ఏడో వ్యక్తి డోర్ తెరిచి సంజ్ఞ చేయగానే బ్రిగేడియర్ విశ్వనాథ్ దూకేశాడు. అతని తర్వాత ప్రకాష్. వరుసగా దూకుతున్నారు. వారి తరువాత వారి సామానులుకూడా పారాచూట్ ద్వారా దిగుతున్నాయి.

మూడునిమిషాలనంతరం గాలిలో తేలుతున్నారందరూ. పారాచూట్‌లు విప్పుకుని నెమ్మదిగా దిగుతున్నాయి.

బ్రిగేడియర్ విశ్వనాథ్‌కి తెల్లగా కురుస్తున్న మంచు తప్ప మరేమీ కన్పించటంలేదు.

వారిని దింపటానికి వచ్చిన విమానం వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది. దట్టమయిన మంచులో దాని శబ్దం ఎక్కువ దూరం విన్పించలేదు.

నేలని సమీపించాడు విశ్వనాథ్. గాలి తాకిడి హెచ్చుగా వుంది. కాళ్ళు నేలకి తాకగానే వెనక్కి వాలిపోయాడు. ఒక్క నిమిషంలో పారాచూట్ని విప్పు కున్నాడు. తెల్లటి పారాచూట్ని కుప్పలా చేసి, మంచులో లోతయిన గొయ్యి తీసి, లోపల కప్పెట్టి మంచుతో పూడ్చాడు. వీపుమీద ఉన్న కిట్ని సరిచేసుకుని నలు వైపులా చూశాడు.

కొంచెం దూరంలో అస్పష్టంగా ఆకారాలు కనిపిస్తు న్నాయి. మొట్టమొదటగా ప్రకాష్ కన్పించాడు. అప్ప టికే పారాచూట్ని దాచేశాడు మంచులో.

పావుగంట అనంతరం కర్తార్సింగ్ తప్ప మిగిలిన అయిదుగురూ కలుసుకున్నారు. సామానులతోసహా. మరో పావుగంట వెదికిన తర్వాత కర్తార్సింగ్ శవం ఒకచోట కన్పించింది. అతను మంచులో సగం దూరుకపోయి వున్నాడు.

ప్రారంభంలోనే తమ సహచరుడు ఒకరు ప్రాణాలు కోల్పోవటం బాధ కల్గించింది అందరికి.

దిగిన ఇరవైనిమిషాలకు అందరూ అక్కణ్నించి కది లారు. విశ్వనాథ్ అందరినీ హెచ్చరించాడు, ఈపాటికి శత్రువులు రాడార్ ద్వారా తమ విమానాన్ని పసిగట్టినా, పసిగట్టవచ్చునని.

విశాలమయిన పర్వతం పైభాగంలో దిగారంతా. చదు నుగా ఉండటమేకాక, మిలిటరీ స్థావరానికి దగ్గరగా కూడా ఉండటంవల్ల దానిని ఎన్నుకున్నారు.

ఆ పర్వతం దాటితే అవతల మరో పర్వతం వుంది. మంచుతో నిండిన ఆ పర్వతాల మధ్య అక్కడక్కడ

చిన్న చిన్న చెట్లు, పొదలు వున్నాయి. వాటి మాటున నడుస్తూ మరోగంట అనంతరం అవతల పర్వతం ఎక్కారు.

ఆ పర్వతం మరికొంత దిగి, ఒక పొదచాటున కూర్చొని ముందుకు చూశారు పరిశీలనగా.

వారున్న పర్వత పాదంలో విశాలమయిన మైదానంలా వుంది. ఆ మైదానం చుట్టూ ఎత్తయిన మంచు పర్వతాలు మధ్యలో నిర్మితమవుతున్న చైనా మిలిటరీ "కాసిల్"కి పెట్టని కోటగా ఉంటున్నాయి.

బ్రిగేడియర్ విశ్వనాథ్ కి బైనాక్యులర్స్‌లో కన్పించిన దృశ్యం అద్భుతంగా ఉంది.

చుట్టూ కోటగోడవలె గట్టిగా నిర్మించబడి వుంది ఒక గోడ. కొండరాతితో నిర్మించబడిన ఆ రాతిగోడ చుట్టూ కందకం వుంది.

కోటకు ఇవతలివైపుగా, అంటే వారికెదురుగా సింహ ద్వారం కాబోలు వుంది. దానిదగ్గర కాపలా ఉధృతంగా వుంది. ప్రతివారిని చెక్ చేసిగాని లోనికి పోనివ్వటంలేదు. ఆ ద్వారం దాటితే కొండరాతితో వంతెన. వంతెన అవతల టౌన్ వుంది.

ఆ టౌన్ అవతల మరోకోట కన్పిస్తోంది. దానికీ, దీనికీ మధ్య పెద్ద అగాధం. రెంటినీ కలుపుతూ రోప్‌వే ఉంది. దానిమీద కేబుల్ కార్స్ అటూ, ఇటూ తిరుగుతున్నాయి.

కోటను చేరుకోవటానికి ముందుగా, పర్వతం దిగువగా ఉన్న ఒక రైల్వే ట్రాక్‌ని చేరుకోవాలి. కోటకి నాలుగున్నర ఫర్లాంగుల దూరంలో టిబెట్ వైపుగా ఉందొక మీటర్‌గేజ్ రైల్వే ట్రాక్. ఆ ట్రాక్ యిక్కడితో

'ఎండ్'అయిపోతున్నది. ఆ ఎండ్ పాయింట్ దగ్గర చిన్న రైల్వే స్టేషన్‌వంటిది నిర్మించబడి ఉంది. అక్కడ అయిదారు వేగనులు తప్ప నామమాత్రపు కాపలాకూడా లేనట్లుగా వుంది.

బ్రిగేడియర్ విశ్వనాథ్ మరోసారి అంతా పరిశీలించి, ప్రకాష్‌కి ఇచ్చాడు బైనాక్యులర్‌ని.

అతని తరువాత నలుగురూ దానిని పరిశీలించారు. అందులోనే భారత మాజీ ఆర్మీ జనరల్ రత్నరాజన్‌ను చైనా వాళ్ళు నిర్బంధించినట్లు గూఢచారివర్గాలద్వారా తెలిసింది. ఇప్పుడు అతడిని విడిపించుకొని, వీలైతే ఆ చైనా రహస్య స్థావరాన్ని నాశనంచేసి రావడం విశ్వనాథ్ బృందం యొక్క ముఖ్య లక్ష్యం!

విశ్వనాథ్, తన అనుచరులవైపు తిరిగి తలి పంకించాడు 'ఓ. కె!' అన్నట్లు.

నిముషం అనంతరం అందరూ మెల్లిగా పర్వతం దిగ సాగారు.

## 2

టైంచూసుకున్నాడు బ్రిగేడియర్ విశ్వనాథ్. ఉదయం పదకొండు గంటలు దాటింది. ఆ సమయంలో మంచు ఉధృతంగా కురుస్తూన్నందువల్ల ఏది పగలో, ఏది రాత్రో తెలియటంలేదు.

సరిగ్గా పన్నెండు గంటలకల్లా హిమపర్వతం దిగి రైల్వే ట్రాక్ దాపుల్లోకి వచ్చేశారు.

కుమార్‌సాహ్ని దగ్గరున్న వైర్‌లెస్ సెట్ ద్వారా తాము చైనా 'కాసిల్'ని కనుగొన్నట్లు, ట్రాక్ దగ్గరకు చేరుకున్నట్లు తెలిపి ఆఫ్ చేశాడు విశ్వనాథ్.

వారికెదురుగా రైల్వే ట్రాక్ సుమారు అరఫర్లాంగు దూరంలో వుంది. పర్వతం దిగువనున్న చెట్లమాటున నిలబడి వున్నారు విశ్వనాథ్ బృందం.

విశ్వనాథ్, ప్రకాష్‌వంక చూసి తల ఆడించాడు. ప్రకాష్ కూడా తల ఊపి నెమ్మదిగా లేచి తను దాగిన చెట్టునుంచి బయటికి వచ్చాడు.

ఓవర్ కోట్లు, గాగుల్స్, తలకు టోపీలతో వుండటంవల్ల ఎవరైనా చూసినా ఫలానా అని గుర్తుపట్టటం కష్టం.

అటూ ఇటూ చూశాడు ప్రకాష్. 'రైల్వే స్టేషన్' నుంచి అరమైలు దూరంలో ఉంటుంది కోట అటు వైపుగా. తాను వెళ్ళటానికి అంతకంటే మార్గం మరొకటి లేదు.

ఆ మీటర్ గేజ్ మీద ఇదివరకు కావలసిన వస్తువులు రవాణా చేసేవారు. అయితే యిప్పుడా ట్రాక్ వాడకంలో లేనట్లు కన్పిస్తోంది. ప్రతి రోజూ ఎవరో ట్రాక్ ని శుభ్రపరుస్తున్నట్లున్నారు. లేకపోతే మంచు పేరుకొని మొత్తం ట్రాక్ కన్పించకుండాపోయేదే. కోట నిర్మాణం దాదాపు పూర్తయిపోవటంవల్ల ఆ ట్రాక్ అవశ్యకత తగ్గిపోయిందని భావించాడు బ్రిగేడియర్ విశ్వనాథ్. అంతే కాదు, ఆ హిమవత్పర్వతాల నడుమ రోడ్లు కూడా కన్పిస్తున్నాయి. ట్రాక్ కంటే ఆ రోడ్డే దగ్గరిదారి కావచ్చు.

అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా నడుస్తున్నాడు ప్రకాష్. అతని చేతులు రెండూ కోటుజేబులో వున్న రివాల్వర్ ని పట్టుకొనివున్నాయి. ఎవరూ అతన్ని గమనించినట్లు లేదు. అసలక్కడ ఎవరూ లేరు కూడా.

హోరుమని వీరుస్తున్న గాలి, మంచుమధ్య నిశ్శబ్దంగా,

నిర్జీవంగా వుంది రైల్వే ట్రాక్, దాని ఎండ్‌లోనున్న రైల్వే స్టేషన్.

ఆ స్టేషన్ దాపుల్లో నాలుగు ఖాళీ వాగన్లున్నాయి, తలుపులు తెరిచే. వాటిల్లో ఎవరయినా వున్నారా...అని అనుమానించాడు ప్రకాష్. కాని అతన్ని ఎవరూ అడ్డగించలేదు.

దాదాపు స్టేషన్‌ని సమీపించాడు. అతన్నే గమనిస్తున్న మిగిలినవారు ఊపిరి బిగించి చూస్తున్నారు. వారి చేతులు రివాల్వర్ల మీదున్నాయి.

స్టేషన్ సమీపించి, అంతా ఒకసారి కలయచూశాడు ప్రకాష్. ఆ స్టేషన్ మొత్తంకలిపి అయిదారు గదులకంటె ఎక్కువలేదు. స్టేషన్‌ని ఉపయోగించి చాలాకాలం అయి ఉంటుంది. ఆ గదులనిండా బూజుపట్టిపోయివుంది. అక్కడక్కడ విరిగిపోయిన కుర్చీలు, టేబుళ్లు ఉన్నాయి.

ట్రాక్ మీదున్న వాగన్ల క్రిందగుండా దాటి, అవతల ఉన్న మరో చిన్న యింటిని సమీపించాడు ప్రకాష్. స్టేషన్‌ను కాపలా కాస్తున్న సిబ్బంది అక్కడుంటున్నట్లుగా ఆధారాలు కనుపించాయి. అయితే మనుషులెవరూ కన్పించలేదు.

సరిగ్గా అరగంట అనంతరం వాగన్ల క్రిందగుండా ఇవతలికి వచ్చి చేయెత్తి సంజ్ఞచేశాడు ప్రకాష్.

అప్పటికి స్నోఫాల్ బాగా తగ్గిపోయింది. దూరంలోని వస్తువులుకూడా కన్పిస్తున్నాయి స్పష్టంగా.

ఒక్కొక్కరే బయటపడి ప్రకాష్‌వైపు అడుగు వేయసాగారు. చివరి వంతు విశ్వనాథ్‌ది. తనూ అటూ ఇటూ చూస్తూ ట్రాక్ వైపు అడుగు వేస్తున్నాడు.

ట్రాక్ ఇంకా కొద్దిదూరంలో ఉండగానే బ్రేక్ పడింది నడకకి. రైల్వే ట్రాక్ ఎగువనుంచి వస్తున్నారిద్దరు వ్యక్తులు. వాళ్ళిద్దరూ ఓవర్ కోట్లు ధరించివున్నారు. చేతిలో గన్స్ వున్నాయి.

బిగుసుకుపోయాడు బ్రిగేడియర్. వాళ్ళకి దయాదాక్షిణ్యాలుండవని, కన్పించినవాణ్ని కన్పించినట్లు కాల్చేయటానికి ఆర్డర్స్ ఉన్నాయని తెలుసు. తను వారి కంట పడ్డాడు. తప్పించుకోవటానికి అవకాశంలేదు.

వాగన్ కిందినుంచి చూస్తున్న ప్రకాష్, విశ్వనాథ్ ఆగిపోవటంతో అటూ, ఇటూ చూశాడు. వాళ్ళని చూడగానే గుండె క్షణం ఆగిపోయినట్లన్పించింది. మిగిలిన వాళ్ళు యింట్లో ఉన్నారు. తనచేతిలో ఏ ఆయుధమూ లేదు. ఏం చేయాలి?...ఆలోచిస్తున్నాడు ప్రకాష్.

ఏదో మాట్లాడుకుంటూ వస్తున్న ఆ యిద్దరు సెంట్రీలు, కొద్దిదూరంలో ఏదో ఆకారం కన్పించటంతో టక్కున ఆగిపోయారు. చేతులు ఆటోమేటిక్ గా గన్ ని పొజిషన్ లో పట్టుకున్నాయి.

ఆ ఆకారం ఏ చెట్టుదో, స్తంభానిదో కాదనీ, ఓ మనిషిదని గుర్తించేసరికి ఆశ్చర్యంతోపాటు అనుమానం కూడా పుట్టుకొచ్చింది.

ఈ సమయంలో ఎవరు ఇతను? ఎందుకిక్కడ కొచ్చాడు? ఒకవేళ తామిక్కడ కాపలా కాస్తున్నామో లేదో చెక్ చేయడానికి వచ్చిన అధికారి కాదు గదా?

ఆ ఆలోచన రావటంతోనే ఇద్దరూ అదిరిపోయారు.

భయంభయంగానే అతనివైపు కదిలారు. గన్స్ వాలిపోయాయి క్రిందకు.

బ్రిగేడియర్ విశ్వనాథ్ జరగబోయేది క్షణంలో గ్రహించాడు. వాళ్ళిద్దరూ తనని గుర్తించలేదు. తానే ఏదో ట్రిక్ 'ప్లే' చేయాలి.

కాస్త దూరం రాగానే ఆ ఇద్దర్నీ దగ్గరకు రమ్మన్నట్లు చేయూపాడు. బిక్కచచ్చిపోయిన ఆ ఇద్దరూ పరిగెత్తుకుంటూ వచ్చి అతని ఎదుట నిలబడ్డారు. ఎవరో అధికారి కాకపోతే అంత ధైర్యంగా తమని రమ్మని పిలుస్తాడా?

విశ్వనాథ్ ముందు అటెన్షన్‌లో నిలబడి ఏదో అంటున్నాడొక వ్యక్తి. ప్రకాష్ వెనకనుంచి పిల్లిలాగా వస్తున్నాడు.

ఎగిరి వారిమీద పడ్డారిద్దరూ. విశ్వనాథ్ చేతిలోని డాగర్ ఒకడి గుండెల్లోకి దిగింది మెత్తగా. రెండోవాడి గొంతు ప్రకాష్ చేతుల్లో నలిగిపోతూంది.

అరనిముషంలో ఆ ఇద్దరూ ప్రాణాలు కోల్పోయారు. ఇద్దర్నీ ఎత్తి ఒక వాగన్‌లో పడేశారు.

ట్రాక్ దాటి, అవతలనున్న ఇంట్లోకి ప్రవేశించారు. కిటికీ చాటునుంచి చూస్తున్న సిబ్బందితో విషయం వివరించారు.

లోపలికి ప్రవేశించిన విశ్వనాథ్‌కి చాలా హాయి అన్పించింది. వెచ్చగా, హుషారుగా వుంది. హోరుమనే గాలిగాని, నిమిషంలో దట్టంగా పెరుగుకుపోయే మంచు గాని లేవు లోపల. అక్కడ చాలావరకు సామానుతో నిండివుంది. రిటైరింగ్ రూం కాస్తా స్టోర్ రూంగా మార్చినట్లు కన్పిస్తున్నది. విరిగిపోయిన కుర్చీలు, టేబుళ్లు, బీరువాలు మొదలైనవి వున్నాయి ఇంటినిండా. అంతా ఒకటే రూం. మరో గది లేదు.

వైర్‌లెస్‌లో విశ్వనాథ్ ఒకేఒక మాట మాట్లాడాడు. "సక్సెస్." అంతకుమించి మాట్లాడితే ఇతరులు వినే ప్రమాదం వుంది. తరవాత చంద్రకాంత్ కాపలా కాయటానికి సెంట్రీల దగ్గర్నుంచి లాక్కున్న గన్‌తో బయటకు వెళ్ళిపోయాడు.

డిసౌజా స్టవ్ మీద బ్లాక్ కాఫీ తయారుచేసి ఇచ్చాడు. ఓవర్‌కోటు విప్పి, జేబులోనుంచి మ్యాప్ తీసుకొని, చిన్న కొవ్వొత్తి ముందు కూర్చున్నాడు విశ్వనాథ్.

## 3

రైల్వేస్టేషన్‌నుంచి కోటను చేరుకోవాలంటే ఒకే ఒక మార్గం వుంది. అదయినా 'రోడ్ వే' మాత్రమే. సుమారు ముప్పావు మైలు దూరంవరకు పర్వతపాదంలో వంకర్లు తిరుగుతూ ప్రయాణించాలి.

ఆ రోడ్‌కు కూడా అటూ ఇటూ చెట్లు, పుట్టలు వుండి, తాము కోటవరకు చేరుకుంటానికి తోడ్పడతాయని విశ్వనాథ్ తెలుసుకున్నాడు. అయినా తాము ఆ రోడ్ మీదుగా ప్రయాణించటం ప్రమాదకరం. తమని ఎవరయినా పరిశీలిస్తుండవచ్చు.

అన్నింటికంటే కష్టం అయినది మరొకటుంది. తమ గూఢచారి షీలాను కలవాలంటే ఆ 'టౌన్'లో వున్న 'బార్'కి పోవాలి. లోపల తమని గుర్తుపట్టటం ఖాయం. ఎలా?

ఈ ఆపరేషన్ బిగిన్ అయ్యే ముందే చెప్పారు అధికారులు. 'కాసిల్'వద్ద విడవటంవరకే వారి పని. కోటలో ప్రవేశించి, జనరల్‌ని విడిపించుకురావటం అంతా తాము అప్పటికప్పుడు. ఆలోచించి, పరిస్థితుల కనుగుణంగా నడుస్తూ చేయాలి.

ఇలా పరిపరివిధాలుగా ఆలోచిస్తున్న బ్రిగేడియర్ విశ్వనాథ్, తన ముందు మేజర్ ప్రకాష్ కూర్చోవటం కూడా గమనించలేదు.

ఇరవై నిముషాలనంతరం ఈ లోకంలోకి వచ్చాడు విశ్వనాథ్.

"తరువాత ప్లాన్ ఆలోచించారా?" అని అడిగాడు మేజర్ ప్రకాష్.

"అదే బోధపడటంలేదు. ఇక్కణ్ణుంచి చెక్‌పోస్ట్ వరకు చేరుకోవడం సులువే! కాని అక్కణ్ణుంచి లోనికెలా ప్రవేశించాలి? కోటచుట్టూ కందకం వుంది. సింహద్వారం తప్ప మరొకటి లేదు!"

ఆ సమయంలోనే కుమార్‌సాహ్ని, డిసౌజాలు కలిసి ఒక వైర్‌లెస్ యంత్రాన్ని అక్కడికి తెచ్చారు.

"ఇక్కడి సెంట్రీలతో మాట్లాడటానికి కాబోలు. అదే నిజమయితే ఇక్కణ్ణుంచి వెంటనే తప్పుకోవాలి మనం. సెంట్రీలు రిపోర్ట్ పంపకపోతే వాళ్ళకి అనుమానం రావొచ్చు!" అన్నాడు చంద్రకాంత్.

అవునన్నట్లు తలాడించాడు బ్రిగేడియర్.

అదే సమయంలో వైర్‌లెస్ "బీప్, బీప్"మంది.

అందరూ ఊపిరి బిగించి దానివంకే చూస్తుండిపోయారు. టైం చూసుకున్నాడు ప్రకాష్. మధ్యాహ్నం ఒకటీ ముప్పైఅయిదు నిమిషాలు.

విశ్వనాథ్ దానిని ముట్టుకోలేదు. వైర్‌లెస్ ట్రాన్స్‌మిటర్‌లో మాట్లాడేటప్పుడు కోడ్ ఏదో చెప్పాలి. తమకు అది తెలియదు. తమ ఉనికి బయటపడినట్లే యిప్పుడు.

రెండు నిమిషాలు శబ్దంచేసి ఊరుకుంది అది.

అందరినీ బయలుదేరమని హెచ్చరించాడు బ్రిగేడియర్ విశ్వనాథ్. మరో అయిదు నిమిషాలనంతరం అందరూ తయారయ్యారు. తాము ధరించిన దుస్తులు విడిచి, చైనా అధికారుల యూనిఫాం తొడుక్కున్నారు. పైన ఓవర్ కోట్ వేసుకున్నారు. గాగుల్స్‌తో బయటికి నడిచారు.

అతి ముఖ్యమైన సామానులు మాత్రం ఒక సూట్ కేస్‌లో వుంచి, మిగిలిన వస్తువులనన్నింటినీ లోపలే బీరువాలలో దాచేశారు. మరికొన్ని బయటికి కన్పిస్తున్నట్లుంచారు. వైర్‌లెస్ సెట్ కూడా వుంది వాటిలో.

ఇప్పుడు వాళ్ళయిదుగురూ యూనిఫాంనిబట్టి చైనా మిలిటరీలో వివిధ రాంక్‌లకు చెందిన అధికారులు.

అందరూ బయటికి రాగానే తన కిట్‌లోనుంచి కొన్ని ఎక్స్‌ప్లోజివ్స్ తీశాడు మేజర్ ప్రకాష్. సిగరెట్లకంటే కొంచెం లావుగా వుండి, అదే సైజులో వున్నాయా బాంబులు. పదిపదిహేను కలిపి ఒక్కొక్క కట్టగా కట్టబడి వున్నాయి.

ఇల్లంతా కలయ చూసి ఒక చోటికి వచ్చాడు. ఒక మూల గోడ కెదురుగా ఇనుప బీరువా ఒకటి వుంది. దాని కెదురుగా నున్న గోడకు బట్టలు మొదలయినవి వుంచటానికి వీలుగా వెదురు బొంగులతో చేయబడిన చెక్కలున్నాయి. అడ్డంగా, స్టాండ్ మాదిరి.

ఆ స్టాండ్‌కి, బీరువా అడుగునా కొన్ని బాంబు కట్టలను టేప్‌తో అతికించాడు ప్రకాష్. తరువాత ఆ రెంటిని కంటికి కన్పించనంత సన్నని ఎలాస్టిక్ వైర్‌తో కనెక్ట్ చేశాడు. లాగిన స్ప్రింగ్ మాదిరి టెన్షన్‌లో ఉండా

వైర్. ఏమాత్రం వత్తిడి తగిలినా ఆ బాంబులు పేలుతాయి ఒక్కసారే.

మరో రెండు నిమిషాల తర్వాత అడ్డదోవలో ప్రయాణం సాగించారు అంతా.

ఫర్లాంగు దూరంకూడా నడవక ముందే ఎదురయ్యింది మిలటరీ ట్రక్కొకటి. వాళ్ళకి కనబడకుండా చెట్లచాటుకి తప్పుకున్నారు విశ్వనాథ్ బృందం. వాళ్ళు తమని దాటగానే వేగంగా నడక సాగించారు.

సెంట్రీల దగ్గర్నుంచి ఎటువంటి సమాధానం రాక పోవటంతో వైర్‌లెస్ ఆపరేటర్‌కి అనుమానం కలిగి, అధికారులకి తెలియచేయటం, వెంటనే పెట్రోలింగ్ ట్రక్స్ బయలుదేరడం జరిగింది.

రైల్వే ట్రాక్ దగ్గర ట్రక్ ఆగగానే బిలబిలమంటూ దిగారు సైనికులు. మొత్తం పదిహేను మంది వున్నారు. జట్లుజట్లుగా విడిపోయి, స్టేషన్‌ను చుట్టుముట్టారు. ఎంత గాలించినా ఎవరూ కన్పించలేదు, సెంట్రీల శవాలు తప్ప.

రిటైరింజ్ రూంలోకి ప్రవేశించారు. అక్కడ వాళ్ళు వదిలిన వస్తువులు చూడగానే ఎవరో వచ్చారని అర్థం అయ్యింది. ఒక్కొక్క వస్తువే బయట పడసాగింది.

ఒక సైనికుడు బీరువా దగ్గరకు నడుచుకుంటూ పోయాడు. బీరువా తెరిచేవుంది. లోపలంతా ఖాళీ. స్టాండ్ కూడా ఖాళీగా వుంది. మరో రెండంగుళాలు జరిగితే అతని కాలు వైర్‌కి తగిలేదే, కాని ఎవరో పిలవటంతో వెనక్కి తిరిగి వచ్చేశాడు.

అయిదు నిముషాలలో చెకింగ్ జరిగిపోయింది. మరో నిమిషం తర్వాత ట్రక్ వెనక్కి బయలుదేరింది.

ఆపాటికే విశ్వనాథ్ బృందం చెక్‌పోస్టుని చేరుకుంది. ఎవరూ తమను చూడటం లేదని గమనించి ప్రకాష్, విశ్వనాథ్ రోడ్ మీదకు నడిచారు. మిగిలిన వాళ్ళు రోడ్ ప్రక్కనున్న పొదల్లోనే వుండి, కొంచెం దూరంలోవున్న చెక్‌పోస్టుని గమనిస్తున్నారు.

ప్రకాష్, విశ్వనాథ్ యూనిఫాంకి కమాండర్ హోదా తెలిపే 'ఫ్లాగ్స్' వున్నాయి.

ఇద్దరూ నడుచుకుంటూ, మౌనంగా చెక్‌పోస్టుని సమీపిస్తున్నారు. వారిముందు పోతున్న ప్రతి ఒక్కరినీ పరీక్షించి, వారి ఐడెంటిటీ తనిఖీ చేసిగాని వదలటంలేదు గార్డులు.

వెనకనుంచి ఒక ట్రక్ వచ్చి అప్పుడే దాటింది. దాని కోసం ఎత్తిన ఇనుప కమ్మీని తిరిగి దించేశారు.

ఇద్దరూ దానిని సమీపించారు.

"అయితే...ఇండియా మీద దాడిచేయటానికి అంత కంటె అనువయిన ప్లాన్ లేదంటావ్?" చైనా భాషలో పెద్దగా అన్నాడు విశ్వనాథ్ ప్రకాష్‌తో.

వారి దగ్గరికి ఐడెంటిటీ కోసం రాబోయిన గార్డు వారి ఫ్లాగ్స్ చూసి, అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు. సాధారణంగా అంత పెద్ద హోదాగల వ్యక్తులు బయటకిరావటం అరుదు. అదృష్టవశాత్తు ఆ గార్డులు డ్యూటీలోకి వచ్చి అరగంటే అయింది.

అతని సెల్యూట్ అందుకున్నట్లు నటించి, కమ్మీని పైకిలేపమన్నట్లు చేయెత్తి ఏదో మాట్లాడుతున్నాడు విశ్వనాథ్, తలతిప్పకుండానే.

కమాండర్‌ని అడిగే ధైర్యం లేదతనికి. పైకి ఎత్త మన్నట్లు సైగ చేశాడు.

రెండు నిమిషాలనంతరం ఇద్దరూ ఏదో మాట్లాడుకుంటూ లోపలికిపోవటం జరిగింది. గార్డు, వేగొకరు రావటంతో తన డ్యూటీలో పడిపోయాడు.

వంతెన దాటి టౌన్‌లోకి ప్రవేశించారు ఇద్దరూ.

"ఇంతవరకు సవ్యంగా జరిగింది. ఇక బార్ ఎక్కడో కనుక్కోవాలి. ఎవరినన్నా అడిగితే అనుమానిస్తారు" చిన్నగా అన్నాడు విశ్వనాథ్.

ఎదురుగా వస్తున్న కొంతమంది సైనికులు వీరిని చూసి తప్పుకుంటున్నారు.

"ఈ ఫ్లాగ్స్‌వల్ల మనం మరింతగా వాళ్ళ దృష్టిలో పడుతున్నామేమో?" అన్న ప్రకాష్ సందేహానికి జవాబు యిచ్చాడు చిన్నగా విశ్వనాథ్.

"ఇంతకంటె గత్యంతరం లేదు. ఫ్లాగ్స్ తీయటానికి అనువయిన ప్రదేశం కన్పించటం లేదు."

టౌన్‌లో చెక్ చేస్తున్నట్టు అటూ ఇటూ తిరిగారు ఇద్దరు. తిరుగుతున్నంత సేపు తాము వారికి అనుమానాస్పదులమవుతామేమోమన్న శంక లేకపోలేదు.

చివరికి కన్పించింది బార్.

సైనికుల రిలాక్సేషన్ కొరకు ఏర్పరచిన బార్ అది. చిన్నసైజు నైట్‌క్లబ్ కూడా. డ్యూటీలో లేని సైనికులు అక్కడే ఉంటుంటారు దాదాపుగా. ఆఫీసర్స్ కోసం వేరే క్లబ్ ఒకటి ఉంది.

బార్ ముందు ఎవరూ లేరు. చటుక్కున తమ ఫ్లాగ్స్ తీసేసి, జేబులో వుంచుకున్నారు విశ్వనాథ్, ప్రకాష్‌లు. ఇప్పుడు వాళ్ళు తక్కువ రాంక్ ఆఫీసర్లు.

తలుపులు తోసుకుని లోనికి ప్రవేశించారు.

లోపల వాతావరణం వేడిగా వుంది. సిగరెట్ల పొగలు, వాసనలతో ఆ చిన్న హాలంతా దట్టంగా అల్లుకుపోయి వుంది. ఒక చివర వున్న స్టేజ్ మీద గిటార్ వాయిస్తున్నా రెవరో. ఒక యువతి అందంగా డాన్స్ చేస్తోంది.

"పైకి వొద్దంటున్నా వీళ్ళకీ పాశ్చాత్యులమీద మోజుంది!" అనుకున్నాడు బ్రిగేడియర్ విశ్వనాథ్.

ఆనందంతో తాగుతూ, అల్లరిచేసే లోపలి వ్యక్తులకు లోపలి కెవరెవరు ప్రవేశిస్తున్నారో, వెళ్ళిపోతున్నారో అవసరం కాని, అవకాశం గాని లేదు. ఆ హాలులో లైట్లు కూడా వెలిగివున్నాయి.

బ్రిగేడియర్ విశ్వనాథ్, మేజర్ ప్రకాష్ ఇద్దరూ కళ్ళతోనే పలుకర్కుని కౌంటర్ దగ్గరికి పోయారు.

ఒక యువతి సర్వ్ చేస్తోంది అక్కడ. ఆమె షీలా. తాము బయలుదేరే ముందు ఫోటో చూసివుండటం వల్ల గుర్తించారు వెంటనే ఆమెను.

ఇరవైఅయిదేళ్ళ వయసుతో, బింకంగా, పొంకంగా వుందామె. చైనీస్ పోకలిలు కూడా కన్పించడంతో ఇండియన్‌కి చైనీస్‌కి పుట్టివుంటుందని అనుకున్నారు ఇద్దరు.

"వెడల్పాటి గ్లాస్‌లో బ్రాండీ!" అన్నాడు విశ్వనాథ్.

తలెత్తి చూసిందామె.

వాళ్ళని గుర్తుపట్టినట్లుంది. "ఎన్ని గ్లాసులు?" అంది.

"మీ యిష్టం. మేము ఇద్దరం!" అన్నాడు విశ్వనాథ్.

ఇద్దరికీ పోసి ఇచ్చిందామె. అక్కడే స్టూల్ మీద కూర్చున్నారిద్దరూ. ఆమెతో సరసాలాడుతున్నట్లు, డాన్సు చూస్తున్నట్లు నటిస్తూనే ఆమె వివరాలు తెలుసు కున్నాడు విశ్వనాథ్.

బ్రాంది పూర్తిగా తాగకముందే బయట బూట్ల చప్పుడు అయింది. మరుక్షణమే బిలబిలా పదిమంది సైని కులు లోనికి ప్రవేశించారు. వారందరి చేతుల్లోను తుపాకు లున్నాయి.

హఠాత్తుగా మౌనం అయిపోయింది క్లబ్. చీమ చిటుక్కుమన్నా వినిపించేంత నిశ్శబ్దం. బూట్ల చప్పుడు తప్ప మరో శబ్దంలేదు.

ఆ పదిమందికి లీడర్ ఒక్కొక్కరినే ప్రశ్నిస్తూ వారి ఐడెంటిటీ పరీక్షిస్తున్నాడు.

తాము పట్టుబడినట్లేనని భావించారు ప్రకాష్, విశ్వ నాథ్ లు. ఐడెంటిటీ కార్డ్ తయారుచేయవచ్చు. కాని సంతకం ఫోర్జరీకూడా చేయటానికి వీలులేకుండా, ఆ సంతకం నమూనా తెలియలేదు.

ఈ సమయంలో పట్టుబడిన వారికి మరణదండన తప్ప మరొకటి లేదని తెలుసు. అందరినీ పరీక్షించి, విశ్వనాథ్, ప్రకాష్ల ముందుకొచ్చి ఆగాడు నాయకుడు.

# 4

బ్రిగేడియర్ విశ్వనాథ్, మేజర్ ప్రకాష్ నిరాటం కంగా లోనికి వెళ్ళటంతో ఊపిరి పీల్చుకున్నారు కెప్టెన్ డిసౌజా, చంద్రకాంత్, సాహ్నీలు. తిరిగి తామొచ్చే వరకు అక్కడే ఉండమని చెప్పాడు విశ్వనాథ్. బయటికి వచ్చే వ్యక్తులను మాత్రం ఎటువంటి చెకింగ్ లేకుండా వదులుతుండటం వలన వాళ్ళు బయటికి రావడం కష్టం గాదు.

అయితే కెప్టెన్ డిసౌజా మరో దృశ్యంచూసి అదిరి పోయాడు. వారికోసం వెళ్ళిన ట్రక్కు తిరిగి వస్తోంది.

దాని నెంబర్ బాగా గుర్తు డిసౌజాకి.

తమకోసం చెక్ చేస్తూ, స్టేషన్ అంతా గాలిస్తారని ఊహించి, బాంబులను అమర్చివచ్చారు తాము. కాని క్షేమంగా తిరిగివచ్చారంటే అర్థమేమిటి? బాంబులని చూశారా? లేక అదృష్టవశాత్తు తప్పించుకున్నారా?

విశ్వనాథ్, ప్రకాష్‌లు లోనికివెళ్ళి అరగంట దాటుతోంది. ఇంతవరకు అయిపు లేరు. ఇప్పుడేం చేసేటట్లు?

లోనికి వెళ్ళిన ట్రక్కు వంతెన దాటి, మలుపు తిరిగి మాయం అయిపోయింది.

కాని మరో ఇరవై నిముషాలనంతరం, టాప్ లేని జీప్ ఒకటి బయటికి రావడం వారు గమనించారు. ఆ జీప్‌లో నలుగురయిదుగురు సైనికులతోపాటు విశ్వనాథ్, ప్రకాష్‌లు కూడా ఉండటం చూసి నిర్ఘాంతపోయారు. శత్రువులంత త్వరగా పనిచేస్తారని ఊహించలేదు. లోపల చెకింగ్ ఎంత కట్టుదిట్టంగా ఉందో తెలుపుతుందీ సంఘటన.

మంచులో నిండిన రోడ్ మీదుగా, నున్నగా పోతున్న జీప్‌ని చూసి కెప్టెన్ డిసౌజా ఏదో ఆలోచించి, తన సహచరులకు లోగొంతుకో చెప్పాడేదో. నిమిషం తర్వాత ఆ ముగ్గురూ అడ్డంబడి, వెనక్కి మరలారు చెట్ల చాటున.

తమకు ఇరువైపులా సైనికులు కూర్చొని వాచ్ చేయడం వలన తప్పించుకునేందుకు మార్గాలు వెదుకుతున్నారు విశ్వనాథ్, ప్రకాష్‌లు.

తాము పట్టుబడిన వెంటనే చంపకుండా, ఇలా తీసుకు పోవడంలో ఏదో దూరాలోచనే ఉందని గ్రహించాడు విశ్వనాథ్. ముందు సీట్లో కూర్చొని చుట్టుపక్క పరిస

రాలు పరిశీలిస్తున్నాడు అతను తాపీగా. వెనక సీట్లో వున్న ప్రకాష్ అంతకంటే తాపీగా కూర్చున్నాడు.

ఆ మంచులో, టాపులేని జీపులో పోతుండవంవల్ల చలిగాలి ఈడ్చికొడుతూంది. పైగా విశ్వనాథ్, ప్రకాష్‌ల ఓవర్‌కోట్లు వారు లాక్కున్నారు. వారి దుస్తులను ఎంత చెక్ చేసినా ఏమీ దొరకలేదు రివాల్వర్లు తప్ప.

తాము బయటికి రావడంతోనే డిసౌజా వెనక్కి వెళ్ళటం గమనించాడు విశ్వనాథ్. తమని రక్షించటానికి ఏదో ఒక ఉపాయం ఆలోచించక పోరు వాళ్ళు.

అడ్డదిడ్డంగా వున్న కొండదారుల వెంట పైకి పోతోంది జీప్.

మంచువల్ల స్లిప్ కాకుండా జాగ్రత్తగా డ్రైవ్ చేస్తున్నాడు డ్రైవర్. రోడ్‌కి ఒక వైపు పర్వతం, మరోవైపు లోతైన లోయ వుంది. లోయలోకి ఏమాత్రం స్లిప్ అయినా ఎముకలు కూడా కన్పించవు.

కోటనుంచి చాలా దూరం పోగానే రోడ్‌కి కొద్ది దూరంలో చదునుగానున్న ఒక ప్రదేశంలో వున్న ఒక శిథిలమైన ఇల్లు కన్పించింది. దాని ప్రక్కనే ఏదో షెడ్ కూడా వుంది. దాని తలుపులు మూసివున్నాయి.

బూట్ కాలితో ఏదో సైగచేశాడు విశ్వనాథ్, క్రింద తాటిస్తూ. ఇంజన్ హోరులో ఎవరూ వినలేదుగాని, విశ్వనాథ్‌నుంచి అటువంటి సిగ్నల్ ఏదో వస్తుందని ఎదురు చూస్తున్న ప్రకాష్ అది గ్రహించాడు. ఆ శబ్దంలో దాగి వున్న అర్థం అతడు గ్రహించాడు.

ఉన్నట్లుండి "స్టాప్!" అని అరిచాడొక సైనికుడు. సడన్ బ్రేక్‌తో ఆగిపోయింది జీపు. ఆ క్షణంలోనే సైనికుల చూపు కొంచెం దూరంలో రోడ్ మీద పడివున్న

ఒక వ్యక్తిమీదకు ప్రసరించాయి.

"ఎవరై ఉంటారు?" ఒకడన్నాడు చైనీస్ భాషలో.

"వీళ్ళవాళ్ళేమో?" మరొకడి సందేహం.

"దిగి చూస్తే పోలా!" అంటూ డ్రైవర్ క్రిందికి దిగాడు గన్‌తో. అతనివంక దృష్టి కేంద్రీకరించి ఉన్నారు మిగిలిన వాళ్ళు.

అంతకంటే మంచి అవకాశం ఎలా వస్తుంది విశ్వనాథ్‌కి? వెంటనే విశ్వనాథ్ తనకిటువైపు కూర్చున్నతన్ని బలంగా బయటకు తోసేశాడు.

వెనకనున్న ప్రకాష్ తనకిటూ అటూ వున్న ఇద్దరి డొక్కల్లో పొడిచి, వాళ్ళు వంగగానే మెడమీద కిక్స్ యిచ్చాడు. అరవకుండా తలలు వాల్చేశారు వాళ్ళు.

బయటకు తోసినవాడిమీదకు ఎగిరి దూకాడు విశ్వనాథ్. ఆయన చేతిక్రింద వాడి కంఠం నలిగిపోయింది. నిమిషంలో ప్రాణాలు వదిలేశాడు.

ఇదంతా ముగించి వెనుదిరిగి చూసేసరికి ముందుకి వెళ్ళిన జీప్ డ్రైవర్ను లాక్కొస్తున్నారు చంద్రకాంత్, కుమార్ సాహ్నీలు.

కెప్టెన్ డిసౌజా వారి చేతుల్లోని గన్స్ లాక్కున్నాడు.

అదే సమయంలో దూరంగా ఏదో ట్రక్స్ వస్తున్న శబ్దం అయింది.

"వీళ్ళందర్నీ జీప్‌లో వేసి లోయలోకి తోసేయండి!" అన్నాడు విశ్వనాథ్. నిమిషం తర్వాత అయిదుగురూ కలిసి జీపుని లోయలోకి తోసేశారు.

డబడబడబమని శబ్దంచేస్తూ లోయలోకి దొర్లుకుంటూ పోతూందది. వెనకనున్న చెట్లచాటుకి తప్పుకున్నారంతా. ఆ క్షణంలోనే పెద్ద శబ్దం అయింది. పడిపోతున్న జీప్

పేలిపోయిన శబ్దం.

మూడు నిమిషాల తర్వాత ఆ ప్రదేశంలోకి ట్రక్ ఒకటి రావటం, క్రింద మండుతున్న జీప్ ని చూసి ఆగిపోవటం జరిగింది.

ఒకడు వైర్ లెస్ లో ఈ విషయం అధికారులకి తెలియజేశాడు. మరో రెండు నిమిషాల తరువాత ట్రక్ వెనుకకు వెళ్ళిపోయింది.

వాళ్ళు వెళ్ళిపోగానే అన్నాడు ప్రకాష్. "మనం యిప్పుడు చనిపోయినవాళ్ళకింద జమ వాళ్ళ దృష్టిలో!"

"ఆల్ రైట్! ఇదీ మన మంచికే. ఇందువల్ల మనమీద అనుమానం తగ్గుతుంది. ముందు షీలాని కలుసుకోవాలి పదండి!" అన్నాడు విశ్వనాథ్.

# 5

వచ్చిన దిక్కుగానే నడవసాగారు రోడ్ వెంట.

"ఈసారి లోనికెలా వెళ్ళటం?" అడిగాడు చంద్రకాంత్.

"ఈసారి ఆ సాహసం అవసరంలేదు. టౌన్ అంతా తిరగటంవల్ల బాగా గుర్తుంది. టౌన్ కి అవతల చివర షీలా ఉంటున్న భవనం ఉంది. ముందు అక్కడికి చేరుకోవాలి. అందుకు టౌన్ లోకి వెళ్ళాల్సిన అవసరంలేదు. ఈ పర్వతం దిగి చుట్టూ వెళితే సరిపోతుంది!" చెప్పాడు విశ్వనాథ్.

మరికొంత దూరం నడిచేసరికి శిథిలమైన ఇల్లు కన్పించింది. అందరూ ఆగి చూశారు.

అది పాతకాలంనాటి వర్క్ షాప్. లోపల చెడిపోయి శిథిలావస్థలోనున్న నాలుగు బస్సులున్నాయి.

వాటిని చూడగానే అవి తమ కుపయోగపడతాయని భావించాడు విశ్వనాథ్.

పరీక్ష చేసి చూడగా ఒకటి మాత్రం సరియైన కండి షన్‌లో ఉన్నట్లు తేలింది. దానికి చిన్న రిపేర్స్ చేస్తే సరిపోతుంది.

"వీటన్నిటిని ఇక్కడెందుకు వదిలేశారు?" అనుమానంగా ప్రశ్నించాడు కుమార్ సాహ్ని.

"తెలియదు! బహుశా ఏదైనా అవసరం వస్తే వాడవచ్చని వాటినిలా వదిలేశారేమో?" అన్నాడు విశ్వనాథ్.

"అదంతా మనకెందుకు? మీరు దీని విషయం చూడండి. మేమిద్దరం వెళ్ళివొస్తాము. జాగ్రత్త. అనుమానం రాకుండా చేయాలి!" అని ఏమేమి చేయాలో చెప్పాడు విశ్వనాథ్.

మరో పావుగంట తర్వాత కావల్సిన సామానులు ఒక కిట్‌లో సర్దుకుని బయలుదేరారు విశ్వనాథ్, ప్రకాష్‌లు.

ఆ పర్వతం చుట్టూ తిరిగి, కోట వెనుకభాగం చేరే సరికి రాత్రి ఎనిమిది గంటలయింది.

ఆ రాత్రి తనకు డ్యూటీ లేదని చెప్పింది షీలా. తామా రాత్రికి అక్కడకు వస్తామని చెప్పివున్నాడు విశ్వనాథ్.

అతనన్నట్లుగానే వారికోసం ఎదురుచూస్తోంది షీలా. సుమారు వంద గజాల ఎత్తులో, బలమైన పునాదితో, కొండరాళ్ళతో దృఢంగా నిర్మింపబడినదా కోట గోడ. ఆ గోడకి అక్కడక్కడా ఉబ్బెత్తుగా వచ్చినట్లు కట్టబడిన బురుజులున్నాయి. ఆ బురుజుల ద్వారానే మెట్లుంటాయని, తామున్న భవనం కోటగోడకి ఆనుకునే ఉంటుందని చెప్పింది షీలా.

బ్రిగేడియర్ విశ్వనాథ్ కిట్‌లోనుంచి పొడుగాటి, బలమైన తాడు తీశాడు. దానికొక చివర స్టీల్ కొక్కెం

ఉంది. దానిని బలంగా పైకి విసిరేశాడు.

పైనుంచి రెండో అంతస్థులో ఉంది షీలా గది. ఆ గదికి చువ్వలులేని కిటికీ ఉంది. ఒక మనిషి సులభంగా లోనికి పోవచ్చు దాని ద్వారా. ఆ కిటికీ కింద మరో మూడు కిటికీలు కన్పిస్తున్నాయి. వాటిల్లోంచి పల్చని కాంతి బయటకు ప్రసరిస్తోంది.

కిటికీలోనుంచి తొంగిచూస్తున్న షీలాకి మూడు, నాలుగు ప్రయత్నాలనంతరం అందింది తాడు. ఆమె దానిని పైనున్న దూలానికి కట్టి కిటికీ దగ్గరకు వచ్చి సైగ చేసింది.

విశ్వనాథ్ తాడుని లాగి చూసి, అనుభవజ్ఞుడైన మౌంటెనీర్ కుమల్లే గోడకి కాళ్ళు తన్నిపెడుతూ గబగబా పైకి పాకసాగాడు.

అతని తర్వాత ప్రకాష్ ఎక్కటం ప్రారంభించాడు.

# 6

"అమ్మయ్య! మిమ్మల్ని చూసేదాక మనస్సు మనస్సులో లేదు!" అంది షీలా విశ్వనాథ్ పైకి రాగానే.

"ఎందుకు?" అడిగాడు విశ్వనాథ్ కిటికీలోనుంచి తొంగిచూస్తూ.

"మీరు ప్రయాణిస్తున్న జీప్ ప్రమాదానికి గురయి అందరూ కాలి చచ్చిపోయారని తెలిసింది. అప్పట్నుంచి..."

"కావాలనే అలా చేశాము. ప్రస్తుతం మేము చచ్చిన వాళ్ళకింద జమ. కాబట్టి మా పనులు నిరాటంకంగా జరిగి పోతాయి. ముందు మాకు జనరల్ ఎక్కడున్నాడో, మేమేమి చేయాలో తెలియజేయి!"

"జనరల్ గురించి చాలా కొద్దిమందికే తెలుసు. నేనయినా ఓ ముఖ్యాధికారిని చాలా కాలంనుంచి వల్లో వేసుకుంటేగాని ఈమాత్రం అయినా తెలియలేదు.

ప్రస్తుతం జనరల్ అవతలి కాసిల్‌లో ఉన్నారని తెలుసు. కాని ఎక్కడుంటారో తెలియదు. దీనికీ, దానికి మధ్య రోడ్ వే మాత్రమే ఉంది. అవతల కోటకి మరో దారి లేదు. ముఖ్యమైన అధికారులంతా అక్కడే ఉంటుంటారట. అక్కడికి చేరుకోవాలంటే మామూలు సైనికులకు అధికారం లేదు. కొందరు ముఖ్య అధికారులే అక్కడకు వెళ్ళివస్తుంటారు."

"మేమెలాగో చేరుకుంటానుకో! మరి నీ సంగతి?... జనరల్ ఎక్కడున్నారో నీకూ, నాకూ తెలియదు కదా?" అన్నాడు ప్రకాష్.

"చెప్పానుగా, ఈ సారి ఒక ముఖ్యమయిన వ్యక్తి నే వలలో వేసుకున్నానని, కమాండర్ ఆయన. కేబుల్ కార్ ద్వారా నే వెళతాను. మీ సంగతి, మీరక్కడికి ఎలా చేరుకుంటారో, జనరల్ ఎక్కడున్నాడో తెలుసుకోవడం మీ పని."

"అది సరే! నిన్ను కేబుల్ కార్ ద్వారా ఎలా పోనిస్తారు?"

"అది మామూలే! ప్రముఖ వ్యక్తులు తమకు నచ్చిన ఆడవాళ్ళతో అక్కడికి వెళ్ళటానికి కొద్దిగా నిబంధనలు సడలించారు. అయితే ఆ ఆడవాళ్ళ బాధ్యత అంతా అతనిదే. ఏమాత్రం బయటపడినా అతని ప్రాణాలుండవు."

విశ్వనాథ్ ఆలోచిస్తుండిపోయాడు. కొంచెంసేపు తరువాత ఎవరో తలుపు తట్టినట్లయింది. అందరూ ఊపిరి బిగించారు.

"నాకోసం ఎవరో వచ్చినట్లున్నారు. మీరు బాత్ రూంలోకి వెళ్ళండి!" అంది గుసగుసలాడుతున్నట్లుగా షీలా.

వాళ్ళని బాత్ రూంలోకి పంపి తలుపు తెరిచింది. గుమ్మంలో ఒక కమాండర్ నిలబడివున్నాడు. తలమీద ఉండవలసిన కాప్, చేతిలోవుంది. నలభై సంవత్సరాలుంటాయి. కొంచెం పొడుగు. అందమైన ముఖమే.

"హల్లో షీలా!" అన్నాడతను షీలాని చూడగానే.

"హల్లో కమాండర్!" అంది షీలా, తానూ నవ్వుతూ.

"నేనిప్పుడు కమాండర్ గా రాలేదు. ఒట్టి 'లీంపాగ్' గానే వచ్చాను. అన్నట్లు మనం బయలుదేరదామా?" అన్నాడు కమాండర్ లీపాంగ్.

"అక్కడికేనా?" మెరుస్తున్న కళ్ళతో అంది.

"అవును!" అన్నాడామె కంటిలోని కాంతిని చూసి ఆశ్చర్యపోతూ.

అటూ, ఇటూ చూసి, చటుక్కున అతని పెదాలపైన ముద్దు పెట్టుకుంది షీలా. తన్మయత్వంతో తల మున్కలయాడతను.

"థాంక్స్ కమాండర్! ఒక్క నిముషంలో రెడీ అవుతాను. మిమ్మల్ని కాస్త ఇబ్బంది పెడుతున్నాను" అంది.

"నోనో! నన్ను బయటే నిలబెట్టి మాట్లాడేస్తున్నావ్" అన్నాడతను.

"వద్దు. మీరు లోనికొస్తే కొంటె పనులు చేస్తారు. మనికి ఆలస్యం అవుతుంది. ఒక్క నిమషంలో వస్తాను. బైదిబై కొంటెపనులు ఏమీ చెయ్యకండి!" అని నవ్వుతూ తలుపులు వేసింది షీలా.

గది మధ్యలో నిలబడి పైనున్న వస్త్రాలొక్కొక్కటే మార్చుకుంది. తలుపు తాళం సందులో నుంచి లీషాంగ్ చూస్తున్నాడని ఆమెను తెలుసు.

బాత్‌రూంలోకి వచ్చిన షీలా లోగొంతుతో వాళ్ళకు ఏదో చెప్పింది. ప్రకాష్ కూడా తన కిట్‌ని ఆమెకు యిచ్చాడు.

మరో ఐదు నిముషాలనంతరం లీషాంగ్, షీలా కలిసి వెళ్ళిపోయారు.

"మనం కేబుల్ కార్ స్టేషన్ చేరుకుంటేగాని, ఏ సంగతీ తెల్చుకోలేము!" అన్నాడు విశ్వనాథ్.

తాము కోటలోకి ప్రవేశించడానికి యిదివరకుపయోగించిన ట్రిక్‌నే ప్రయోగించటానికి నిశ్చయించుకున్నారు.

ఫ్లాగ్స్ తీసి తగిలించుకుని, జేబుల్లో చేతులు పెట్టుకుని తాపీగా నడవసాగారు వరండాలో.

వంపుమెట్ల దగ్గర ఎదురయిన సిబ్బంది. వీరిని చూసి సెల్యూట్ చేశారు. దానికి తోడు విశ్వనాథ్ కూడా ఏదో కొంప మునిగినట్లు మాట్లాడుతూ, కంగారు నటించడంతో వారికి వీళ్ళని గమనించే అవకాశము లేకపోయింది.

ఎటువంటి అడ్డంకులూ లేకుండా క్రిందికి దిగారు. లోపల కోడంతా పెంకుల మాదిరి రాళ్ళతో వేయబడి వుంది. నడుస్తుంటే బూట్ల చప్పుడవుతోంది.

మాప్‌లో చూసినపుడు కేబుల్ కార్ స్టేషన్ ఎక్కడుందో బాగా గుర్తుంది. తమకు సంబంధించిన మాప్‌లు, అవీ అన్నీ బూట్ల అడుగున రహస్య అరలో వుంచటం వల్ల, వాళ్ళని పట్టుకుని సోదా చెయ్యటంవలన ఏమీ బయట పడలేదు.

బయట రోడ్ మీద అక్కడక్కడ సెంట్రీలు తిరుగుతున్నారు. దూరంగా క్లబ్ లోనుంచి కేకలు వినిపిస్తున్నాయి. ఆ నగరం మూలమూలంతులు చీకటిలోనే వుంది.

# 7

ఒక భవనం క్రీనీడలో నిలబడి స్టేషన్ ను గమనించారు.

కేబుల్ కార్ స్టేషన్ బయట చెకింగ్ చాలా స్ట్రిక్ట్ గా వుంది. ప్రతి ఒక్కరినీ కమాండర్ అనిగాని, సైనికుడని గాని విచక్షణలేకుండా చెక్ చేసిగాని వదలటం లేదు.

నిముషం తర్వాత కూడబలుక్కొని కదిలారు విశ్వనాథ్ ప్రకాష్లు. అయిదు నిమిషాల తరువాత స్టేషన్ ప్రక్కనున్న ఒక భవనంలోకి వెళ్ళారు. లోపల దీపాలు లేక నిర్జనంగా వుందది. ఆ భవనం మీదకు నడిచి, భవనం వెనక్కు చేరుకున్నారు. భవనం అంచు లోయవైపు వుంది. కాలు జారితే అంతే! కిటికీలకు షేడింగ్స్ కట్టారు. వాటి మీదనుంచి సులభంగా దూకొచ్చు ప్రక్కదాని మీదకు.

వాటి మీదకు పోయి, నెమ్మదిగా నడుస్తూ స్టేషన్ దగ్గరకు చేరుకున్నారు.

కేబుల్ కార్ స్టేషన్ లోపల యంత్రాలన్నీ పని చేస్తున్నాయి. దబదబమన్న చప్పుడు వినిపిస్తోంది.

అగాధం వయిపు చూశారు. దూరంగా మిణుకు మిణుకు మంటున్న లైట్లు. కేబుల్ కార్ అది. వస్తున్నది.

అగాధం వైపు, స్టేషన్ పైన చెక్కతో చేసిన షేడింగ్ పైన కొంచెం చదరంగా వుంది. దాని పైన గ్లాస్ విండోస్ వున్నాయి.

ఏటవాలుగా వున్న షేడింగ్ సుమారు పది అడుగుల పొడవు, అయిదడుగుల వెడల్పుతో సరిగ్గా మధ్యకు చీలి

నట్లుంది. ఆ చీలిక గుండా కేబుల్ కార్ వచ్చే వైర్స్ పోతున్నాయి.

కేబుల్ కార్ ఒక స్టేషన్ నుండి బయలుదేరింది.

జేబులో నుండి వస్తువులు తీసి, వాటిల్లో తనకు కావలసిన ఉలిని తీసుకున్నారు యిద్దరు. దాని రెండో చివర కొక్కెంలా వుండి, మంచి పదునుగా వుంది.

భవనం కంటె, షేడింగ్ చాలా తక్కువ ఎత్తులో వుండటంవల్ల షేడింగ్ మీదకు దూకటం తప్ప మరో మార్గం లేదు.

కేబుల్ కార్ బాగా దగ్గర కొచ్చింది. యిప్పుడు దాని లోపలి వ్యక్తులు కూడా స్పష్టంగా కనిపిస్తున్నారు. సుమారు పదిమంది సులభంగా పట్టవచ్చు దానిలో. ఏడెనిమిది మంది వ్యక్తులున్నారు.

తాము వాళ్ళకి కన్పించే అవకాశము లేదు. తమమీద లైటు పడడం లేనందువల్ల అక్కణ్నుంచి కదిలే ప్రయత్నం చేయలేదు ఇద్దరు.

కేబుల్ కార్ సమీపించింది. చటుక్కున షేడింగ్ మీదకి ఉరికాడు బ్రిగేడియర్ విశ్వనాథ్. ప్రాణాలతో పరిహాసంవంటిది ఆ ఫీట్. ఏ మాత్రం స్లిప్ అయినా అగాధంలోకే ప్రయాణం.

దూకిన క్షణంలోనే తన కుడిచేతిలోని ఉలిని అంత బలంగా షేడింగ్ చెక్కలోకి దిగేశాడు విశ్వనాథ్. జర్రున జారబోయిన అతను ఉలిని పట్టుకోవడంతో ఆగి, వేలాడసాగాడు. ప్రకాష్ కూడా షేడింగ్ మీదకు దిగాడు.

కేబుల్ కార్ సరిగ్గా షేడింగ్‌ని దాటగానే కేబుల్

కార్ పైన, ఇనుపతీగను చట్రం పట్టుకునే చోట, షెల్టర్ గా ఒక గట్టి ఇనుపరేకును దీర్ఘ చతురస్రాకారంలో అమర్చారు. దానివల్ల మంచు లోపలికి పోయి యంత్రాలను పాడు చేయదు.

ఆ ఇనుపరేకు మీదకు విశ్వనాథ్, ప్రకాష్‌లు ఎగిరి దూకటం ఆ యంత్రం హోరులో ఎవరూ కనుక్కోలేదు.

ఆ చట్రం క్రింద మరో రెండడుగుల క్రిందగా వుంది. కేబుల్ కార్. దాని మీదకు దిగి సర్దుకు కూర్చున్నారు ప్రకాష్, విశ్వనాథ్‌లు.

హోరుమని చప్పుడు చేసుకుంటూ, నిండు గర్భిణిలా ముందుకు సాగుతోంది కేబుల్ కార్. దాని లోపల లైట్ల కాంతిలో అందరూ నిలబడి వుండటం కన్పిస్తూంది కొద్దిగా వంగి చూస్తే.

ముందు అగాధం. కటిక చీకటి. కళ్ళు చించుకొని చూస్తున్నా ఏమీ కన్పించటం లేదు. దానికి తోడు ఈదురు గాలి భోరున కొడుతూంది. స్నోఫాల్ కూడా మొదలయింది.

కేబుల్ కార్ లోపలి నుంచి చూస్తే, ఏ ఆధారం లేకుండా, ఆ చీకటిలో, శూన్యంలో ఎగిరిపోతున్నట్లుగా తమాషా అయిన అనుభూతి కలుగుతోంది షీలాకి.

క్రమంగా స్టేషన్‌లోని లైట్లు దూరం అవుతున్నాయి. ఏమాత్రం కదలిక కూడా లేకుండాపోతూంది కేబుల్ కారు. లోపల అందరూ నిశ్శబ్దంగా వున్నారు. ఎవరూ మాట్లాడు కోవటం లేదు.

ఆ ఈదురు గాలి, మంచుపాతంలో పట్టుజారిపోకుండా గట్టిగా పట్టుకొని కూర్చున్నారు విశ్వనాథ్, ప్రకాష్‌లు.

దూరంగా కన్పిస్తున్న కోట లైట్లను బట్టి రెండింటి మధ్య ఎంత దూరం వుంటుందో అంచనా వేయటానికి ప్రయత్నిస్తున్నాడు విశ్వనాథ్. ఆ హోరులో తాము మాట్లాడుకుందామన్నా లాభం లేదు. పెద్దగా అరిస్తే గాని, ఎదుట వారికి విన్పించదు.

పది నిషాములనంతరం ఎదురుగా ఇంకొక కేబుల్ కార్ రావటం గ్రహించి ఇద్దరూ బోర్లాగపడిపోయారు, అది తమని దాటి పోయేంతవరకు.

సరిగ్గా ఇరవై నిముషాలు తరువాత అవతలి స్టేషన్కు చేరుకుంది కేబుల్ కార్.

రెంటి నిర్మాణం ఒకేలా వుండటం వలన ఉలులతో రెడీగా షెడింగ్ మీదకు దూకటానికి ఉద్యుక్తులయ్యారు.

ఉలులు టక్కున గుచ్చుకోవటం, ఇద్దరూ షెడింగ్ పైకి ఎగబ్రాకటం, కేబుల్ కార్ లోనికి పోవటం జరిగింది.

అయిదునిమిషాల తర్వాత ఇద్దరూ పైకి చేరుకున్నారు. పైనున్న గ్లాస్ విండోస్ద్వారా షీలా, లీషాంగ్ వెంట దిగటం కన్పించింది. లైట్ల వెలుగులో మసకగా కన్పిస్తున్న దానినిబట్టి ఆ కోటకి, ఈ కోటకి నిర్మాణంలో ఎటువంటి తేడా కన్పించలేదు.

"ముందు మనం షీలాని అనుసరించాలి. ఆమె ఎక్కడ దిగుతుందో తెలుసుకుంటే, మన పని సులభం అవుతుంది" అన్నాడు విశ్వనాథ్.

అలాగేనన్నట్లు తలవూపాడు ప్రకాష్.

ఇద్దరూ రిస్క్ తీసుకుని, ప్రక్కలున్న గోడమీదికి దూకారు. అదృష్టవశాత్తు అది అందింది. రెండునిమిషాల తరువాత పైకి చేరుకున్నారు.

అక్కడక్కడ స్ట్రీట్ లైట్లున్నాయి. కొంత దూరంలో లీంపాంగ్, షీలాలు వెళుతూ కన్పించారు.

ఎవరూ తమని గమనించటంలేదని తెలుసుకొని, నిశ్శబ్దంగా క్రిందికి జారారు.

చాలాదూరం నడిచి ఒక భవనంలోకి వెళ్ళారు షీలా, ఆమె ప్రియుడు లీపాంగ్.

"ఇప్పుడెలా?" అన్నాడు ప్రకాష్. మరికొంత సేపటికి భవనం పై అంతస్థులలో ఒకదానిలో లైటు వెల్గింది.

"బహుశా వీళ్లే అయిఉంటారు. నాలుగో అంతస్థు అది." ఉత్సాహంగా అన్నాడు బ్రిగేడియర్ విశ్వనాథ్.

లీపాంగ్ బయటికి వస్తాడేమోనని ఒక పావుగంట వెయిట్ చేశారు గాని, ఫలితం లేకపోయింది.

ప్రకాష్‌వంక చూశాడు విశ్వనాథ్.

"ఈ భవనం వెనుక ఏదో ఖాళీస్థలం ఉన్నట్లుంది." అన్నాడు ప్రకాష్.

అతనిభావం గ్రహించాడు విశ్వనాథ్. "కాని మన దగ్గర తాడులేదుగా?"

"ముందు చూసి వద్దాం పద!"

ఇద్దరూ వెనక్కి చేరుకున్నారు. వెనక కొంచెం ఖాళీ స్థలం వుంది. దానితర్వాత మరో పర్వతం వుంది. భవనంపై అంతస్థులోని లైటు, కిటికీగుండా కన్పిస్తోంది. పైకి ఎలా చేరాలా అని ఆలోచిస్తున్నంతలోనే పైగదిలోని లైటు ఆరిపోయింది.

చీకట్లో వంటరిగా నిలబడిపోయారు ఇద్దరు.

# 8

సుమారు అరగంట గడిచింది. ఈ అరగంటసేపు ఏం చేయాలో తోచలేదు విశ్వనాథ్, ప్రకాష్‌లకు. భవనం

ముందునుంచి పోదామంటే చెక్ చేస్తున్నారు. బహుశా యివి గెస్ట్ రూమ్స్ కాబోలనుకున్నాడు విశ్వనాథ్.

పైనుంచి ఏదో తాడు క్రిందికి జారటంతో ఉలిక్కి పడ్డారు ఇద్దరూ. తలెత్తి చూశారు.

కిటికీలోనుంచి వంగి, ఎవరో చేతులూపుతున్నారు. మిగతా కిటికీలు మూసి ఉండటంతో చకచక పైకి చేరుకున్నారు.

ఆ గదిలో షీలా ఒక్కతే వుంది. ఎలక్ట్రిక్ దీపం లేదు. చిన్న కొవ్వొత్తి వెలిగించి వుంది.

వాళ్ళు పైకి రాగానే తాడు పైకిలాగి, తలుపు మూసింది.

"థాంక్స్! మా రాక ఎలా కనిపెట్టావ్?" అన్నాడు విశ్వనాథ్ సిగరెట్ ముట్టించుకుంటూ.

"లీషాంగ్ వదిలి వెళ్ళి, మరో గంటలో తిరిగొస్తానన్నాడు. మీ సంగతి గుర్తుకొచ్చింది. ఈపాటికి ఇక్కడికి చేరుకున్నా ఆశ్చర్యం లేదనుకుంటూ ముందువైపు చూశాను. ఎవరూ కన్పించకపోవటంతో వెనక్కవైపు వచ్చాను. చీకట్లో మీ ఆకారాలు అస్పష్టంగా కన్పించాయి. అంతే!"

"మేము కాబట్టి సరిపోయింది. అక్కడున్నది వాళ్లే అయితే...?"

"ఈపాటికి పరలోకంలో ఉండేవాళ్ళు!" అంది షీలా.

చిన్నగా నవ్వారు ఇద్దరూ.

"ఇక్కడికి ఎలా వచ్చావ్? ఐ మీన్...ఏ నెపం మీద?" అడిగాడు ప్రకాష్.

"మా తమ్ముడిక్కడే వైర్‌లెస్ రూంలో పని చేస్తు

న్నాడని, చూసి చాలాకాలం అయిందని చెప్పాను లీషాంగ్‌తో. నా మాటలు నమ్మాడు లీషాంగ్."

"అతను నీ గురించి ఎంక్వయిరీ చేస్తే?"

"అంతవరకు మీరూరుకుంటారా? వెంటనే బయలు దేరండి" అంది షీలా.

నిజానికి ప్రకాష్, విశ్వనాథ్ విపరీతంగా అలసి పోయారు. ఉదయం విమానం దిగిన దగ్గరనుంచి క్షణం కూడా తీరిక లేకుండా ముందుకు సాగుతున్నారు. అయినా వాళ్ళకిది అలవాటు కావడంవల్ల పెద్దగా బాధలేదు.

"లీషాంగ్ ఎక్కడికి వెళ్ళాడో తెలుసా?"

"తెలియదు. అప్పుడప్పుడు చాలామంది, ఆడవాళ్ళని ఈ రూమ్స్‌లోకి తెచ్చుకుంటారు రహస్యంగా. ఈ రూమ్‌ల బయట గట్టి కాపలా వుంటుంది."

"ఈ విషయం అధికారులకి తెలిస్తే?"

"వాళ్ళకి ఎందుకు తెలియదూ? ఇది ఓపెన్ సీక్రెట్." అంది షీలా నవ్వుతూ.

"అయినా రూల్స్...రూల్స్ మరి." అంది మరలా.

ఏదో ఆలోచిస్తుండిపోయాడు బ్రిగేడియర్.

"ఇంతకు జనరల్‌ని తెచ్చిన తరువాత యిక్కణ్నుంచి బయటపడే మార్గం ఆలోచించారా?" అంది.

అవునని జవాబిచ్చాడు ప్రకాష్. "టిబెట్‌కు వెళ్ళే దారిలో సుమారు మూడు మైళ్ళ దూరంలో చైనీస్ విమాన స్థావరం ఒకటి వుంది. అక్కడ యుద్ధవిమానాలు, చిన్న విమానాలు దిగటానికి అనువుగా రన్-వే నిర్మించు కున్నారు వాళ్ళు. అక్కడ వాళ్ళ విమానాలు కూడా ఎల్లప్పుడూ రెడీగా వుంటాయని తెలిసింది. మన ప్రభుత్వా

నికి చెందిన విమానం ఒకటి సరిగ్గా రేపు ఉదయం ఆరు గంటలకు అక్కడకు వస్తుంది. ఈ లోపు మనం జనరల్‌ని రెస్క్యూ చేసి తీసుకుపోవాలి'' వివరించాడు ప్రకాష్.

''అయితే టైం లేదు. త్వరపడండి!'' అంది షీలా.

''మా ఎక్స్‌ప్లోజివ్స్ అవీ...''

''తెచ్చాను!'' అని ఎయిర్‌బాగ్ అడుగునగల ఒక రహస్య అరలోనుంచి చిన్న సంచి తీసి యిచ్చింది.

''దాన్ని చెక్ చేశారు. ఏమీ బయటపడలేదు! అఫ్ కోర్స్...కమాండర్‌ని చూసి వదిలేసుంటారు నన్ను!''

అదే సమయంలో బయట వరండాలో బూట్ల చప్పుడయింది. ''లీషాంగ్ రావచ్చు!'' అని కిటికీలోనుంచి తాడుని క్రిందకి జారవిడిచింది. ఇద్దరూ క్రిందికి జారారు. అయితే క్రిందకి పూర్తిగా జారలేదు. మధ్యలో ఒక కిటికీ తెరిచి వుంది. సెంట్రీ ఎవడో చూస్తున్నాడు తొంగి. వాడి ముఖం బద్దలయింది విశ్వనాథ్ బూటు కాలి దెబ్బతో.

ఇద్దరూ ఆ కిటికీలోకే జారుకున్నారు. వాళ్ళు వెళ్ళి పోవటం చూసి, తాడు గబగబ పైకి లాగి ఒక మూల దాచింది షీలా. టక్కున లైటు వెలిగించి, తలుపు తీసింది.

మూడు నిమిషాలనుంచి తలుపు బాదుతున్న కమాండర్ లీషాంగ్ ముఖం నిద్రమత్తులో, పల్చటి గౌన్‌లోనున్న షీలాని చూడగానే ప్రసన్నమైంది. అప్పుడే నిద్రలో నుంచి లేచివచ్చినట్లుంది ఆమె ముఖం.

''బ్రహ్మాండమైన నిద్రపట్టింది'' సంజాయిషీ చెప్తూ వుంది షీలా, దారి తొలుగుతూ. లీషాంగ్ లోనికి వచ్చాడు. అయితే అతని ముక్కుపుటాలకు ఏదో వాసన తగిలింది.

సిగరెట్ల వాసన అది. పీకలు కూడా కన్పించాయి.

"నువ్వు సిగరెట్లు కూడా తాగుతావా?" అని అడగటంతో తెల్లబోయింది షీలా.

అంతకుముందు విశ్వనాథ్, ప్రకాష్‌లు సిగరెట్లు కాల్చి అక్కడే పీకలు పారేశారు. ఆ వాసనని పసిగట్టినట్లున్నాడు లీషాంగ్.

"ఎందుకు కాల్చను?" నవ్వుతూ అంది షీలా.

లీషాంగ్ మాట్లాడలేదు. సిగరెట్టు యిప్పుడే ఆర్పేసినట్లుంది. షీలా తాను నిద్రపోతున్నానని చెప్పింది. నిద్రపోతూ కాలుస్తుందా? ఎవరో వచ్చివుంటారు. షీలా ఏదో దాస్తుంది.

తన అనుమానం బయటపెట్టలేదు లీషాంగ్.

"నీ తమ్ముణ్ణి గురించి వాకబుచేశాను. ఆ పేరు గల వ్యక్తి వైర్‌లెస్ రూంలో ఉన్నాడట. ఇప్పుడే వెళ్ళి చూసొద్దాం. ప్రస్తుతం కమాండర్-ఇన్-చీఫ్, మిలిటరీ హెడ్స్ అంతా ఏదో సమావేశంలో ఉన్నారు కమాండర్-ఇన్-చీఫ్ ఇంట్లో. వాళ్ళకి తెలియకుండా మనం వెళ్ళి తిరిగిరావాలి. బయలుదేరు" అన్నాడు లీషాంగ్.

తాను ఇంకొక అధికారి ద్వారా వైర్‌లెస్ రూంలో పనిచేసే ఒకడి పేరు వినివుంది. అదే లీషాంగ్‌తో చెప్పింది. అతను, ఆ వ్యక్తిని కలుసుకొని తన గురించి ఇన్‌ఫాం చేయనందుకు సంతోషించింది షీలా.

"మరి మీరు పోలేదే ఆ సమావేశానికి?" అంది.

"నాకక్కడ పనిలేదు. టాప్ సీక్రెట్ సమావేశం అది. అయిదారుగురుకంటె ఎక్కువ లేరు."

జనరల్‌ని గురించి అడుగుదామా, వద్దా అని సంది

గ్ధంలోపడి, చివరకు ఒద్దనే నిర్ణయించుకుంది షీలా.

"జస్టే మినిట్. బాత్‌రూంకి వెళ్ళివస్తాను!" అని చెప్పి అటాచ్ చేయబడిన రూంలోకి దూరింది.

ఆమె లోనికి వెళ్ళగానే గదంతా కలయజూశాడు. కిటికీ దగ్గర మంచుముద్రలున్నాయి యింకా.

లీషాంగ్ తిరిగి వచ్చి సోఫాలో కూర్చున్నాడు.

అయిదు నిమిషాల తరువాత తిరిగి వచ్చింది షీలా. డ్రెస్ ఛేంజ్ చేసుకొని ఇద్దరూ బయలుదేరారు.

వైర్‌బాగ్‌లో తన తమ్ముడికోసం తెచ్చిన పళ్ళు న్నాయి. దానిని తీసుకొని వెంట నడిచించి షీలా.

ఇదివరకు ఆమె నివాసంలాగే ఉందా భవనం కూడా. భవనం మధ్యలో గుండ్రంగా క్రిందకి దిగుతూ పోయే మెట్లున్నాయి.

ఒక తలుపు చాటున ఎవరో కన్పించి, తమని పరీక్షగా చూడటంతో లీషాంగ్ చూడకుండా చేతిలోని కాగితాన్ని క్రిందకు జారవిడిచింది.

తలుపు సందుగుండా చూస్తున్న ప్రకాష్ వాళ్ళిద్దరూ వెళ్ళిపోగానే అటూ ఇటూ చూసి, చప్పున ఆ కాగితాన్ని లాక్కున్నాడు.

లోపల కాళ్ళుచేతులు కట్టివేయబడి, నోట్లో గుడ్డలు కుక్కబడి ఉందొక యువతి. ఆమె ప్రక్కనే క్రిందపడి ఉన్నాడో సైనికుడు.

ఆ కాగితాన్ని చదువుకుని, రెండు క్షణాల తరవాత బయటపడ్డారు బ్రిగేడియర్ విశ్వనాథ్, మేజర్ ప్రకాష్.

తన మామూలు ట్రిక్‌నే ప్లే చెయ్యడానికి నిశ్చయించుకున్నాడు విశ్వనాథ్. యిద్దరూ క్రిందికి దిగుతున్నారు.

దాదాపు మెట్ల చివరకు వచ్చేశారు. అక్కడ మెట్లకు తలుపులున్నాయి.

అక్కడ కాపలా వున్న సెంట్రీలు వీరిద్దరినీ, వాళ్ళ ఫ్లాగ్స్‌ని వెలుతుల్లో చూసి సెల్యూట్ చేశారు. కాని వాళ్ళ ఐడెంటిటీ అడిగారు.

"నాన్సెన్స్! నేనెవర్ననుకుంటున్నావ్?" అన్నాడు కోపంగా విశ్వనాథ్.

"సారీ కమాండర్! కమాండర్ లీషాంగ్ మమ్మల్ని హెచ్చరించి వెళ్ళారు," అన్నాడు.

అంతా అర్థం అయిపోయింది యిద్దరికీ. లీషాంగ్ తమని పసిగట్టాడు. "ఆల్ రైట్! ఇదిగో!" అంటూ ప్రకాష్ వంక చూస్తూ, జేబులో చేయి పెట్టాడు విశ్వనాథ్.

మరుక్షణం యిద్దరి చేతుల్లోని రివాల్వర్లు వారిని బలిగొన్నాయి. చటుక్కున తలుపులు మూసి గడియవేశాడు విశ్వనాథ్.

"ఆ శబ్దం నిని అందరూ వొస్తారు. రెడీ ఫర్ ఏక్షన్!" అరిచాడు విశ్వనాథ్. అప్పటికే ప్రకాష్ బాంబ్స్ తీసి అక్కడక్కడ అతికిస్తూ, ఎలాస్టిక్ వైర్‌తో కనెక్ట్ చేస్తున్నాడు. క్రింద తలుపు బద్దలుకొట్టటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఇద్దరూ ఒక్క ఊపులో షీలా గదిలోకి వచ్చిపడ్డారు. తాడుని కట్టి గబగబా క్రిందకు జారారు.

ఆపాటికే తలుపులు బద్దలుకొట్టుకుని, పైకి వచ్చిన సైనికుల కాళ్ళకు వైర్ తగలటం బాంబులు పేలటం మొదలయ్యింది. ఆ శబ్దానికి భయపడి పైనుంటున్న మరి కొంత మంది క్రిందికి పరుగెత్తారు.

భయంకరమయిన శబ్దాలతో ప్రళయం ప్రారంభం అయింది. ఆ సంచలనం గమనించి కాపలావున్న సైన్యం అక్కడ కమ్ముకోసాగింది.

ఆపాటికే తప్పించుకొని లోనికి చొరబడిన విశ్వనాథ్, ప్రకాష్‌లను గమనించే వారే లేకపోయారు.

ఎదురుపడిన యిద్దరు సెక్యూరిటి సిబ్బందిని మట్టి కరిపించి, వారి చేతుల్లోని మెషిన్ గన్స్ లాక్కున్నారు యిద్దరూ.

ఆ కోట మొత్తం బాగా గుర్తుంది యిద్దరికీ. ఇద్దరూ కమాండర్-యిన్-ఛీఫ్ నివాస భవనం వయిపు పరుగెత్తసాగారు.

దార్లో ఎదురవుతున్న సిబ్బందిని హెచ్చరిస్తూ, తాము ముందుకుపోతున్నారు. సైన్యం అంతా భవనంలోను ప్రేలుళ్ళవంక డైవర్ట్ అయివుంది.

మరికొంచెం సేపటికి భవనం బయట సమీపించింది, బయట సెంట్రీస్ కాపలా వున్నారు. సమావేశం అక్కడే జరుగుతుందని నిర్ధారణ అయింది. ఎయిర్ కండిషన్డ్ చేయబడింది భవంతి అంతా. తమ చప్పుళ్ళు వారికి విన్పించే అవకాశం లేదు. ఎదురు పడ్డవాణ్ని ఎదురు పడ్డట్టే కాల్చేశారు యిద్దరూ.

హాలు ఎంట్రన్స్ వద్దకు చేరుకొని లోపలికి దారి తీశారు. అక్కడ ఎదురయిన సేవకులు ఆహుతయి పోయారు.

సమావేశం జరుగుతున్న హాలు పైనవుంది. బయట బెల్ వుంది. దాన్ని నొక్కాడు విశ్వనాథ్.

రెండు నిమిషాల తరువాత తలుపు తెరుచుకుంది కొద్దిగా.

"అర్జెంట్ మెస్సేజ్!" అంటూ లోనికి ప్రవేశించాడు విశ్వనాథ్ అతని వెనకే ప్రకాష్ కూడా. లోపల వాళ్ళ ఎదురు చూస్తున్న వ్యక్తి—జనరల్ కూడా వున్నాడు.

అప్పటికి రాత్రి ఒంటిగంట దాటి పదినిముషాలయింది.

# 9

కమాండర్ లీషాంగ్ వెంట నడుస్తున్న షీలా, అతను వైర్‌లెస్ ఆఫీస్‌వైపు కాక మరో దిక్కుకు దారి తీయడంతో అతడు తనసెవరో కనిపెట్టాడా అన్న సందేహానికి లోనయింది. అయినా తన అనుమానాన్ని బయట ప్రదర్శించకుండా అతన్ని అనుసరించింది.

ఒక భవంతి ముందుకు వచ్చాడు. బయట నున్న సెంట్రీలు లీషాంగ్‌ని చూసి సెల్యూట్ చేశారు. లీషాంగ్, షీలాలు లోనికి నడిచారు.

అది లీషాంగ్‌కై కేటాయించిన భవనం. అన్ని ఆధునిక హంగులతో, సదుపాయాలతో అట్టహాసంగా వుంది.

షీలాని హాల్లో సోఫాలో కూర్చోపెట్టి, షీలాకి ఎదురుగా తను కూర్చొని అన్నాడు:

"ఇప్పుడు చెప్పు! మీ తమ్ముడి పేరేమిటన్నావ్? ఎలా ఉంటాడు?"

అంతకుముందు అతనితో వర్ణించిన వర్ణనను మరలా వల్లించింది.

రెండు క్షణాలామె ముఖంలోకి చూశాడు లీషాంగ్. ఇబ్బందిగా చూసింది షీలా.

"షీలా! నిన్ను నేను మనస్ఫూర్తిగా ప్రేమించాను. మీ ఇండియన్స్‌కి సెంటిమెంట్స్ ఎక్కువట. నిజం చెప్పు. నువ్వు ఇండియన్ ఏజంటువి కదూ?"

తాపీగా ఒక్కొక్క పదమే స్పష్టంగా అన్నాడు లీషాంగ్.

తలమీద పిడుగులు పడలేదు షీలాకి. కొద్దిగా కలవర పడింది. అతను తనని గ్రహించాడని తనకు ముందే తెలుసు. అయినా ఇలా బయటపడతాడనుకోలేదు.

"నేనా?" అంది తెల్లబోతూ, అమాయకంగా ముఖం పెట్టి.

"ఆల్ రైట్! నువ్వు సమర్థురాలైన ఏజంటువి. ఇక్కడి కెలా ప్రవేశించగలిగావో నాకర్థం గావటంలేదుగాని, ఇక్కడ స్థావరం సంపాదించడంలోనే నీ తెలివితేటలు బయటపడుతున్నాయి. నీ దేశంమీద నీ కెంత ప్రేమ ఉందో, నాకూ నా దేశంమీద అంతే ప్రేమ ఉంది. నీ ప్రాణాలు తీసయినా నీ చేత నిజం పలికిస్తాను."

షీలా లేచి నిలబడపోయింది. కాని లీషాంగ్ ఆమె భుజాలమీద చేతులు ఉంచి బలవంతంగా కూర్చోపెట్టాడు.

"నీ గురించి అధికారులకిగాని, కనీసం బయట ఉన్న సెంట్రీలకుగాని చెబితే కుక్కను కాల్చినట్లు కాల్చేస్తారు. కాని నిన్ను ప్రేమించిన నేరానికి నువ్వు వేశ్యవయినా నిన్ను అభిమానించినందుకు ఆ పాపం నేనే చేస్తాను. నీకు తెలిసిన రహస్యాలు చెప్పు. మన కోటలోకి ఎవరో ప్రవేశించారు గదూ? నా ఊహ నిజమైతే యిదివరకు జీప్ ప్రమాదంలో మరణించారనుకుంటున్న ఏజంట్లే అయి ఉంటారు. అవునా?"

కమాండర్ లీషాంగ్ ముఖం భయంకరంగా తయా రయింది. ఆమె గొంతు అతని చేతుల మధ్య నొక్కబడి పోతూంది. ఊపిరందక గిలగిల్లాడిపోతూంది షీలా. వది

లించుకోవటానికి విపరీమయిన ప్రయత్నం చేస్తూందామె.

సరిగ్గా అదే క్షణంలో బయట బాంబులు పేలిన శబ్దం విన్పించింది. కలకలం. చటుక్కున ఆమెని వదిలి నిలుచున్నాడు కమాండర్ లీహాంగ్. గుమ్మంవైపు అడుగులేయబోయాడు. అదే అతను చేసిన పెద్ద పొరపాటు. అది తన జీవితాన్నే మార్చేస్తుందని తెలిసుంటే ఆ పొరపాటు చేసేవాడు కాదేమో?

షీలా చటుక్కున గౌన్ గుండా తొడల దగ్గరికి చేతిని పోనిచ్చింది. లోపల టేప్‌తో అతికించబడిన మినీ పిస్టల్‌ను బయటికి లాగి లీహాంగ్‌ని గురిచూసి కాల్చేసింది టపటప.

వీపులో దూరాయి గుళ్ళు. దబ్బున క్రింద పడిపోయాడు కమాండర్.

బయటకు పరుగెత్తింది షీలా. పిస్టలు శబ్దానికి లోపలికి రాబోతున్న సెంట్రీలు కూడా ఆమె పిస్టల్ గుళ్ళకు ఆహుతయిపోయారు. ఒకడి దగ్గర మెషిన్‌గన్ లాక్కుని బయటపడింది.

అప్పటికే వీధుల్లోని సైనికులు పేలిపోతున్న భవనం వైపు పరుగెడుతున్నారు. కమాండర్-ఇన్-చీఫ్ భవంతి వైపు దారితీసింది షీలా.

ఆ సమయంలోనే లోపల ఉన్న అధికారులనందరిని బెదిరించి వారి ఆయుధాలు లాక్కున్నాడు బ్రిగేడియర్ విశ్వనాథ్. ప్రకాష్ మెషిన్‌గన్‌తో అందరినీ కవర్ చేస్తున్నాడు.

అందరినీ కలిపి కట్టేసి "సారీ జనరల్స్!" అని జనరల్ రత్నరాజన్ వంక తిరిగాడు. ఆయనను ఎటువంటి హింసలూ

పెట్టలేదని తెలుస్తూనేవుంది.

విశ్వనాథ్, రత్నరాజన్‌లు బయటికి నడవగానే ప్రకాష్ హాలులో కొన్ని స్తంభాలకు బాంబులు అతికించాడు. మరో ఎలాస్టిక్ వైర్‌ను గుమ్మందాకా రానిచ్చి కొద్దిగా తెరిచివున్న తలుపుకు కనెక్ట్ చేశాడు. ఇప్పుడు తలుపు ఏమాత్రం కదిలినా చాలు ఎక్స్‌ప్లోజివ్స్ భయంకరంగా పేలుతాయి. పైనున్న జనరల్స్‌కి సంగతి తెలియదు.

బయటకు రాగానే ఎదురైంది షీలా. జరిగింది క్లుప్తంగా చెప్పింది. అప్పటికే కొంతమంది సైనికులు వీరిని గమనించారు. కాని ప్రకాష్, షీలాల చేతుల్లోని మెషిన్‌గన్స్ వారికి జవాబు చెప్పాయి.

నలుగురు కేబుల్ కార్ స్టేషన్ వైపు పరుగులు తీశారు. దార్లో అడ్డం వచ్చినవారిని వచ్చినట్లే కాల్చిపారేస్తున్నారు.

పది నిముషాల తరువాత స్టేషన్‌ను సమీపించారు. లోపల ఉన్న సిబ్బంది కూడా ఆహుతయిపోయారు గుళ్ళకి.

ప్రకాష్ ఇనుపతలుపులవద్దకు నడిచి బాంబులు అరేంజ్ చేశాడు తెరవగానే ప్రేలేటట్లు.

విశ్వనాథ్ వెళ్ళి, ఇటునుంచి అటుకిగల టెలిఫోన్ వైర్లను తెంపి, రెండు స్టేషన్‌ల మధ్య సంబంధం లేకుండా చేశాడు.

ముగ్గురూ కేబుల్ కార్ ఎక్కగానే స్విచ్ ఆన్ చేసి, తానూ పరుగెత్తుకుంటూ పోయి ఎక్కాడు.

ఘుమ్మంటూ బయలుదేరింది కేబుల్ కార్.

ఆ సమయంలోనే దూరంగా భయంకరమయిన

విస్ఫోటం. పెద్ద పెద్ద జ్వాలలతో ఎగసిపడుతుందొక భవనం.

ఎవరో జనరల్, ఇతర అధికారులున్న భవనంను తలుపులు లాగివుండాలని భావించారు విశ్వనాథ్, ప్రకాష్‌లు.

కేబుల్ కార్ స్టేషన్‌ను సమీపించటంతో గబగబ పైకి ఎక్కాడు విశ్వనాథ్. షెడింగ్‌ని సమీపించగానే ఉలి సహాయంతో పైకెగిరాడు.

అదృష్టవశాత్తు ఏ దుర్ఘటనా జరగకుండానే పైకి చేరుకున్నాడు. కేబుల్ కార్ లోపలికి వెళ్ళిపోయింది.

అవతల అంత హడావుడి జరుగుతున్నా యిక్కడ ఎటువంటి అలికిడీ లేకపోవటం వారిలో అనుమానాన్ని కల్గించింది. బయట రోడ్ మీద ఎవరూ లేరు.

ఎదురవ్వబోయే ఆపద గురించి ఆలోచిస్తున్నారు విశ్వనాథ్, ప్రకాష్.

స్టేషన్ బయటికి అయిదడుగులు కూడా వేయకముందే ఎదురయింది ఆపద.

మూడు వైపులనుంచి ధన్ ధన్‌మంటూ మరతుపాకులు గర్జించాయి. చటుక్కున బోర్లాగా పడిపోయారు నల్గురు.

ప్రకాష్ జేబులోనుంచి హేండ్‌గ్రనేడ్ తీసి విశ్వనాథ్ కిచ్చాడు. ఇద్దరూ హేండ్‌గ్రనేడ్స్‌ను అటూ ఇటూ విసిరేస్తున్నారు.

భయంకరమైన శబ్దంతో ప్రేలుతున్నాయి. సైనికుల ఆర్తనాదాలు విన్పిస్తున్నాయి. తుపాకుల గర్జనలతో మారుమ్రోగిపోతోంది ఆ ప్రాంతం అంతా.

అటు ఇటునుంచి మిలిటరీ ట్రక్స్ దూసుకొచ్చాయి మీదకు. కాని మరుక్షణంలోనే అవి దగ్ధమయ్యాయి.

ఈ హడావుడిలో నలుగురూ ఎదురుగానున్న భవనం లోకి జారుకోవటం ఎవరూ గమనించలేదు.

ఎదురువచ్చినవారిని అలానే మెషిన్‌గన్‌లతో కాలుస్తూ ఒక గదిలోకి దూరారు. తమ వెంట తెచ్చిన నైలాన్ తాడుని క్రిందికి జారవిడిచి, దానిని దూలానికి కట్టి క్రిందికి జారారు. ఆ గది తలుపులకు కూడా బాంబులు అమర్చాడు ప్రకాష్.

ఆ సందు నిర్జనంగా ఉంది. కొంతదూరం పరుగెత్తేసరికి ఎదురుగా ఒక జీప్ అడ్డువచ్చింది.

ఆపమన్నట్లు సైగ చేశాడు విశ్వనాథ్.

జరిగిన విషయం ఇంకా సరిగ్గా తెలియని ఆ జీపు డ్రైవర్ జీప్‌ని ఆపాడు. అతని గుండెల్లో దిగబడిందొక బాకు. వెనక ఉన్న అధికారులిద్దరూ ప్రకాష్, రత్నరాజన్ చేతుల్లో ఆహుతి అయ్యారు.

నలుగురూ జీప్ ఎక్కి బయలుదేరారు.

ఆక్సిలేటర్‌ని బాగా అదిమి పోనిస్తున్నాడు విశ్వనాథ్.

సింహద్వారం దాటి గాలితో పందెం వేస్తున్నట్లు పరుగెత్తుతోంది జీప్. టైర్లు రోడ్‌కి రాచుకొని గీపెడుతున్నాయి. టర్నింగ్స్ వచ్చినపుడు ఒక మూలకి ఒరిగి, మరీ ప్రయాణిస్తోంది జీపు. లోపల షీలా, రత్నరాజన్‌లు అంతటి రాష్ డ్రైవింగ్ ఎరిగినవాళ్ళు కాదేమో అదిరి పోతున్నారు.

# 10

"ఎవరో వస్తున్నారు!" అన్నాడు కుమార్‌సాహ్ని తలుపు సందుల్లోనుంచి చూస్తూ. కెప్టెన్ డిసౌజా, చంద్రకాంత్‌లు చటుక్కున లేచి నిలబడి గన్‌లు అందుకున్నారు.

"బ్రిగేడియర్ విశ్వనాథ్, జనరల్‌ని రక్షించి తీసుకొస్తున్నట్లున్నారు!" అన్నాడు మరలా.

"ఎంతమంది?"

"నలుగురు. విశ్వనాథ్. మేజర్ ప్రకాష్, జనరల్. మరి నాలుగో వ్యక్తి ఎవరు?"

"షీలా అయివుంటుంది!"

చైనా సైనికుల్ని బురిడీకొట్టించి తిరిగి వచ్చిన విశ్వనాథ్ బృందాన్ని క్షేమంగా చూడగానే ఊపిరి పీల్చుకున్నారు డిసౌజా బృందం.

"బస్ బాగయిందా?" అని ఆత్రుతగా అడిగాడు విశ్వనాథ్ వచ్చీరావటంతోనే. అలా కాకపోతే మిషన్ అంతా చెడిపోతుంది. సరియైన వేళకు ఎయిర్‌పోర్ట్ చేరుకోవడం కష్టం. అదీగాక ఈపాటికి ట్రక్కులు అన్ని దిశల్లోనూ బయలుదేరే ఉంటాయి.

కెప్టెన్ డిసౌజా బాగయిందని జవాబివ్వటంతో గుండెల్లోంచి భారం తీసేసినట్లయింది.

జీప్‌ను విడిచిపెట్టి మరో నిమిషానంతరం బస్ బైలుదేరింది. డిసౌజా దగ్గరుంచిన ఎక్స్‌ప్లోజివ్స్‌ని తీసుకున్నాడు ప్రకాష్. ఎవరూ ఏమీ మాట్లాడుకోవటంలేదు.

భుజం నొప్పిగా ఉన్నప్పటికీ విశ్వనాథే డ్రైవింగ్ తీసుకున్నాడు. ఎవరెవరు ఏం చేయాలో చెప్పాడు అంతకుముందే.

షెడ్‌నుంచి బయటపడి రన్‌-వే దిశగా దూసుకుపోసాగింది.

అయితే రెండు ఫర్లాంగులు కూడా రాకముందే, చైనీస్ సైనికుల కంట పడనేపడ్డారు.

మొత్తం హిమాలయాలనే గాలించ నారంభించినట్లు న్నారు వారు. క్షణాల్లో విశ్వనాథ్ బస్ జాడ తెలిసాయి మిగిలిన జట్టుకి.

మూడు మిలటరీ ట్రక్కులు, మరో జీపు వారివెంట పడనారంభించాయి. ధనుస్సు నుంచి వెలువడిన బాణంలా దూసుకుపోతుంది బస్. ఇంజన్ మంచి కండిషన్‌లో ఉందో ఏమోగాని గాలిలా దూసుకుపోతూంది.

స్నోఫాల్ మరలా ఎక్కువయింది.

బస్సు వెనక అంతే వేగంతో వస్తున్నాయి ట్రక్కులు, జీపు. వాటిలోనుంచి మెషిన్ గన్ కాల్పులు ఆరంభం అయ్యాయి.

షీలా, రత్నరాజన్‌లు బస్సులో సీట్లమధ్య పడు కున్నారు. బస్సువెనక అద్దం చిల్లులు పడిపోయింది కాల్పు లతో. దానిని పూర్తిగా పడగొట్టి, కాల్పులు సాగించారు ప్రకాష్, డిసౌజాలు.

విపరీతమయిన స్పీడ్‌తో పోతున్నాయి. మెషిన్‌గన్ కాల్పులతో ఆ పర్వతప్రాంతం అంతా మారుమోగుతూ, దద్దరిల్లిపోతూంది.

అసలు నేలమీద నడుస్తుందా...అన్నట్లు నడుపు తున్నాడు విశ్వనాథ్.

విశ్వనాథ్ బృందం కూడా కాల్పులు సాగించడంతో వెనక వాళ్ళు కొంచెం తగ్గవలసి వచ్చింది. ఆ అవకాశం చాలు. మరింత తొక్కిపట్టాడు ఆక్సిలేటర్‌ని. మలుపులు కూడా ఎక్కువలేవు. వేగం కొంచెంమాత్రం తగ్గించి టర్న్ చేస్తున్నాడు.

నడుపుతూనే టైం చూసుకున్నాడు. ఉదయం అయిదు

న్నర గంటలు కావొస్తూంది. మరో ముప్పావుగంట టైంవుంది వారికి. సరిగ్గా ఆరింటికి వచ్చిన విమానం మరలా ఆరుంబావుకి గాల్లోకి ఎగురుతుంది. ఏమాత్రం ఆలస్యం అయినా తాము-తమంటత తాము నేపాల్ చేరు కొని అక్కడనుంచి బయటపడాల్సిందే.

దాదాపు అరవై మైళ్ళ స్పీడులో పోతూంది బస్. వెనక నుంచి గన్స్ చప్పుళ్ళు ఆగిపోయాయి. ఒక మలుపు తిరగ టంతో బస్ వేగాన్ని అందుకోలేకపోతున్నాయి వెనక ట్రక్కులు.

సుమారు రెండుమైళ్ళ దూరం వచ్చారు. మరో మైలుం టుంది. మరికొంత దూరం పోగానే ఎదురయిందొక చిన్న వంతెన.

దానిని చూడగానే చటుక్కున ఒక ఆలోచన వచ్చింది ప్రకాష్‌కి. విశ్వనాథ్ కూడా అతని ఐడియాని మెచ్చుకున్నాడు.

వంతెన దాటగానే ప్రకాష్, డిసౌజా క్రిందికి దూకారు ఆగిన బస్సులోనుంచి. ఇంజన్ మాత్రం ఆపలేదు విశ్వనాథ్.

ట్రక్కులు వారిని సమీపించాలంటే మరో నాలుగైదు నిమిషాలు పట్టవచ్చు. ఆ సమయం చాలు.

ఇద్దరూ క్రిందకి దూకి పరుగెత్తారు.

చిన్న వాగుమీద కట్టబడిన వంతెన అది. వాగులో నీళ్ళెక్కువలేవు. ఇద్దరూ స్తంభాలకు చకచక ఎక్స్ ప్లోజివ్స్ అంటించారు.

ప్రకాష్ ఎలాస్టిక్ వైర్‌తో వాటిని కలుపుతున్నాడు. సరిగ్గా ఆ క్షణంలోనే మలుపు తిరిగి ప్రత్యక్షమయ్యాయి మిలిటరీ ట్రక్కులు.

వెనక్కి పరుగెత్తారు ప్రకాష్, డిసౌజాలు.

ఎక్కి ఎక్కగానే కదిలింది బస్. కన్నుమూసి తెరి చేంతలో ఎదురయిన మలుపు తిరిగి వెళ్ళిపోయింది.

ట్రక్కులు ఆగిపోయాయి. టైంబాంబ్స్ ఆరేంజ్ చేసి వుంటారు. రెండు నిమిషాలు గడిచినా ప్రేలలేదు. మరలా కదిలాయి ట్రక్కులు.

శబ్దం చేసుకుంటూ వంతెనని సమీపించింది మొదటి ట్రక్కు. వంతెన ఈ చివరకు చేరుకుంది. సరిగ్గా ఆ క్షణం లోనే టైర్ల క్రింద ఏదో వైర్ పడింది.

మరుక్షణమే భయంకరమయిన విస్ఫోటంతో పేలి, సైనికుల శరీరాలతో పాటు, ట్రక్కు భాగాలు కూడా ఎగిరి క్రిందపడ్డాయి. వంతెన విరిగిపోయింది క్షణంలో.

జ్వాలల్లో మండిపోతున్న ట్రక్కుని చూసి వెనక వస్తున్న వాహనాలు రెండూ ఆగిపోయాయి.

విశ్వనాథ్ బృందం విమానాశ్రయాన్ని సమీపించింది.

రన్-వే చుట్టూ ఇనుప ముళ్ళతీగలతో చేసిన ఫెన్సింగ్ వుంది. ద్వారం మొదల్లోనే నాలుగయిదు భవనాలున్నాయి చాలా చిన్నవి. వారికి ముందు కొంచెం దూరంలో వరసగా నిలబెట్టబడి వున్నాయి పదివరకు మిగ్ విమానాలను పోలిన విమానాలు. వాటిమీద ఏ గుర్తులూ లేవు.

"గెట్ రెడీ!" అరిచాడు బ్రిగేడియర్ విశ్వనాథ్.

రివ్వున దూసుకుపోయి, గేట్లను ఛేదించుకుంటూ ఫెన్సింగ్ లోనికి ప్రవేశించింది బస్సు.

అక్కడ కాపలావున్న కొద్దిపాటి సిబ్బంది కాల్పులు సాగించారు. మెషిన్‌గన్స్‌లో అమ్యూనిషన్ అయిపో వచ్చింది. బాంబులు కూడా అయిపోయాయి. ఉన్న కొద్ది

పాటి మందుగుండుతోనే వారిని ఎదుర్కొన్నారు.

వాతావరణం మరోసారి భయంకరంగా తయారయింది. ఆ ట్రేసులలోనూ బ్రిగేడియర్ విశ్వనాథ్ చెవులకు విమానశబ్దం సోకింది. చెవులు రిక్కించి విన్నాడు. సందేహం లేదు. తమ విమానమే.

తన వాళ్ళను హెచ్చరించి బస్ ను నిలిపి వున్న విమానాల వైపు తిప్పాడు. ఎమర్జన్సీ కొరకు ఎల్లప్పుడూ రెడీగా వుంటాయవి ఫ్యూయల్ తో.

ఆక్సిలేటర్ మరింతగా తొక్కాడు. టైర్లు ఊడిపోతాయేమోనన్నట్లుంది ఆ వేగం.

బస్ లో వున్నవారంతా విశ్వనాథ్ ప్రక్కకు చేరారు. బస్సుని విమానాల ప్రక్కగా పోనిచ్చి అన్నిటిమీద మినీ బాంబులు వేసి నాశనం చేశారు.

పెళపెళ చప్పుడు చేస్తూ విమానాలన్నీ కాలిపోసాగాయి.

అదే సమయంలో రన్-వే మీద భారత విమానం దిగింది.

విశ్వనాథ్ బృందం సంతోషంగా అటు పరుగెత్తారు.

—: ఐపోయింది :—

# శవాలు చెప్పిన కథలు!

అజీజ్

అదే ఆవడి ఆర్డినెన్స్ ఫ్యాక్టరీ!

ఫ్యాక్టరీ మెయిన్ గేట్ ముందు జీప్ ఆపేడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి. గేటుదగ్గర డి. ఎస్. సి. (డిఫెన్స్ సెక్యూరిటీ కోర్) తాలూకు జవాన్లూ, ఆఫీసర్లూ ఉన్నారు.

రాజారెడ్డి ఆఫీసర్లకి తన ఐడెంటిఫికేషన్స్, మూవ్‌మెంట్ ఆర్డర్స్ తీసి చూపేడు.

అతన్ని అక్కడే వెయిటింగ్‌లో వుండమని చెప్పి, ఓ ఆఫీసర్ లోనికెళ్ళి ఐదునిమిషాల్లో తిరిగి వచ్చేడు.

"రండి కాన్ఫరెన్స్ రూంలో జనరల్ మీకోసం ఎదురుచూస్తున్నారు" అన్నాడు. అతన్ని అనుసరిస్తూ కాన్ఫరెన్స్ రూంవైపు నడిచేడు రాజారెడ్డి.

"వెల్‌కమ్ మిస్టర్ రాజారెడ్డీ! ఇప్పుడే ఒ.జి.పి. మీరు వస్తున్నట్లు ఫోన్ జేసి చెప్పేరు." అన్నాడు లెఫ్టినెంట్ జనరల్ కైలాశ్ సైగల్ అతన్ని సాదరంగా ఆహ్వానిస్తూ.

జనరల్ సైగల్‌తోబాటు ఫ్యాక్టరీ డైరెక్టర్ బ్రిగేడియర్ ధీరజ్ పాండే కూడా అక్కడే వున్నాడు.

రాజారెడ్డి ఇద్దరికీ విష్ జేసి, ఓ కుర్చీలో కూర్చున్నాడు.

"ఫ్యాక్టరీలోపలా, బైటా సాంకేతికంగానూ, వ్యక్తిపరంగానూ ఎన్నో కట్టుదిట్టాలున్నాయి. ఇక్కడ పనిలోకి తీసుకునే అతి సామాన్య ఉద్యోగి విషయంలోకూడా మూడు నాలుగుసార్లు పోలీస్ వెరిఫికేషన్ జరుపబడుతుంది. అప్పుడుగానీ వాళ్ళని ఉద్యోగంలోకి తీసుకోరు" అన్నాడు జనరల్.

"ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలో సీక్రెట్స్ లీక్ అవుతున్నాయని అసలు ఎలా బైటపడింది?" సిగరెట్ అంటించి అడిగేడు రాజారెడ్డి.

జనరల్ డెస్క్‌లోంచి ఓ ఫైల్ తీసి బల్లమీద పెట్టి, "చూడండి!" అన్నాడు.

రాజారెడ్డి ఫైల్ అందుకుని చూసేడు.

కొన్ని కాగితాలూ, ఓ కేబినెట్ సైజు ఫోటో ఉన్నాయందులో. ఫోటోలో ఓ ఆటోమేటిక్ గన్ పూర్తి నమూనా, దాని తాలూకు వివిధ భాగాలూ స్పష్టంగా చిత్రించబడున్నాయి.

వాటిని పరీక్షగా చూసి_ "ఫ్యాక్టరీనుంచి లీక్ అయిన నమూనాలు ఇవేనా?" అడిగేడు రాజారెడ్డి.

జనరల్ తలూపేడు.

"ఇవి మళ్ళీ మీ దగ్గరికెలా వచ్చాయి?"

"ఇరవై వేల నగదు చెల్లించి, మా రహస్యాలని మేమే కొనుక్కోవలసి వచ్చింది!"

ఆశ్చర్యంతో రాజారెడ్డి కళ్ళు విప్పారేయి. "ఎలా కొన్నారు? ఎవరిదగ్గర కొన్నారు?"

జనరల్ నవ్వి- "మన గూఢచారి విభాగం, మిలిటరీ సీక్రెట్ సర్వీస్ తమ రెగ్యులర్ ఏజెంట్సుతోబాటు కొందరు డూప్లికేట్ ఏజెంట్సుని కూడా పోషిస్తారని మీకు తెలుసుకదా?

ఆ డూప్లికేట్‌లు ఇటు మననుంచే కాదు, అటు శత్రు దేశపు గూఢచారి విభాగంతోనూ చేతులు కలిపి, వారి నుండీ జీతం పుచ్చుకుంటారు. ఈ సంగతి తెలిసి కూడా మనం తెలియనట్టు ఊరుకుంటాం! కారణం, ఒక్కోసారి మనం వాళ్ళ ద్వారానే శత్రుదేశానికి తప్పుడు సమాచారాలు అందించి శత్రుదేశాన్ని పల్టీ కొట్టించడానికి అవకాశాలు లభిస్తాయి. అటువంటి డూప్లికేట్ ద్వారానే మాకివి తిరిగి లభించేయి" అన్నాడు.

"ఫ్యాక్టరీలోని ఈ రహస్యాలు అతనికెలా అందేయి? ఎవ్వరందించేరు? అతన్ని అరెస్ట్‌జేసి విచారణ జరపలేదా మీరు?"

"నో,నో. అరెస్ట్‌జేసి, ఎన్ని హింసలు పెట్టినా చెప్పే వాడు కాదేమో! ఆ రాస్కెల్స్ అటువంటి మొండి తర్ఫీదు పొందివుంటారు. ప్రాణం పోయినా సరే, అసలు సంగతి బైటపెట్టరు.

అందుకే ఇవి కొన్నట్టు కొని, వాడికేమాత్రం అనుమానం రాకుండా గట్టినిఘా ఏర్పాటుజేశాం. ఆ విధంగా అసలు ద్రోహిని పట్టుకోవాలని ఆశించాం. కాని, మాప్లాను

పూర్తిగా పట్టుకొట్టింది. వాడి మీద నిఘా ఏర్పాటు జేసిన మూడవరోజు రాత్రి ఎవ్వరో వాణ్ణి కాల్చి చంపేరు."

"ఫ్యాక్టరీ సిబ్బందిలో మీ కెవ్వరి మీదైనా అనుమానం వుందా?"

"ఉంది. కేవలం అనుమానం! దానికి నిర్దుష్టమైన ఆధారాలేవీ మాకు లభ్యం కాలేదు. ఆ డూప్లికేట్ మరణం తరవాత, మిలిటరీ ఇంటలిజెన్స్ శాఖవారు ఫ్యాక్టరీలో, అనుమానితులకోసం గాలింపు ప్రారంభించేరు.

మూడు నెలలు శ్రమించేక, ఫ్యాక్టరీ సిబ్బందిలో అతి కీలకస్థానాల్లో పనిజేస్తున్న ఇద్దరు ఇంజనీర్ల పేర్లు బైటికి వచ్చాయి. మీరు వాళ్ళ నివేదిక ఒకసారి పరిశీలించండి" అంటూ బ్రిగేడియర్ వైపు తిరిగి—"ఆ ఫైల్స్ తీసుకు రండి" అన్నాడు జనరల్.

బ్రిగేడియర్ ధీరజ్ పాండే లేచి వెళ్ళి కొన్ని ఫైల్స్ తీసుకువచ్చాడు.

రాజారెడ్డి ఓ ఫైల్ అందుకుని చూడసాగేడు.

అందులో ఓ వ్యక్తి పాస్‌పోర్ట్ సైజు ఫోటో అతికించి వుంది. ఉంగరాల జుత్తు. కోటేరు ముక్కు. పల్చని పెదాలు. నిండైన బుగ్గలు. పెదాలమీద సన్నని మీస కట్టు. విజ్ఞానం తొణికిసలాడే చురుకైన కళ్ళు.

ఫోటో కిందే అతని పేరూ, ఒడ్డూ పొడుగూ, వ్యక్తి గత వివరాలు రాసివున్నాయి.

పేరు—ఆత్మప్రకాశ్. వయసు—35. క్వాలిఫికేషన్-మిలిటరీ ఇంజినీరింగ్ కోర్స్, ఫస్ట్‌క్లాస్ డిగ్రీ. రెండు యుద్ధాల్లో పాల్గొన్నాడు. ప్రస్తుతం ఫ్యాక్టరీలో గన్స్

మోల్డింగ్ సెక్షన్‌లో డిజైనింగ్ ఆఫీసర్‌గా పని జేస్తున్నాడు.

వివాహితుడు. ఇంకా సంతానం లేదు. భార్య విలాస జీవితానికి బాగా అలవాటుపడిన వ్యక్తి. ఎడ్రస్_డిఫెన్స్ కాలొనీ, బిల్డింగ్ నెంబర్ 3_36. ఫ్లాట్ నెంబర్_47.

ఆ ఫైల్ మూసి రెండో ఫైల్ అందుకున్నాడు రాజా రెడ్డి.

అందులోనూ ఓ వ్యక్తి ఫోటో, దానికింద అతని వివరాలూ రాసివున్నాయి.

పేరు__నిరంజన్ దాస్. వయసు__37. క్వాలిఫికేషన్స్__కెమిస్ట్రితో ఎమ్.ఎస్.సి. మూడు సంవత్సరాల మిలటరీ ట్రేనింగ్, ఫ్యాక్టరీలో మోలిక్యూలర్ లేబొరేటరీ ఇంఛార్జ్, రెండు యుద్ధాలు అటెండ్ జేసేడు.

అవివాహితుడు. కాని, అందమైన ఆడవాళ్ళ నగ్న చిత్రాలు పోగుజేసి దాచుకునే పిచ్చివుంది. పేకాటన్నా, రేసులన్నా పడిచస్తాడు.

"మిస్టర్ రాజారెడ్డీ! నా దగ్గిర ఒక పథకం వుంది. దాన్ని అమలుపరచి చూస్తే ఏమైనా ఫలితం వుంటుందేమోనని నా దృఢ నమ్మకం!" అన్నాడు జనరల్, ఇన్‌స్పెక్టర్ ఫైలు మూసేక.

రాజారెడ్డి తలూపి__"చెప్పండి" అన్నాడు.

"ఫ్యాక్టరీ దక్షిణదిశలో, చివర్న కొన్ని బేరక్స్ (సైనికులు నివసించే కట్టడాలు) ఖాళీగావున్నాయి. స్పెషల్ ట్రేనింగ్ నెపంతో ఇరవైమంది ఆఫీసర్లని అక్కడ సమీకరించాలి. ఆ గ్రూప్‌లో ఆత్మప్రకాశ్, నిరంజన్‌దాస్‌లతోబాటు మీరూ వుంటారు. జబల్‌పూర్

నించి ఆ ట్రేనింగ్ కోసం పిలిపించబడ్డ కేప్టెన్ గా మిమ్మల్ని వాళ్ళకు పరిచయం జేస్తాను. ఆవిధంగా వారితో మీరు స్నేహం జేసుకుని, ఆ ప్రమిత్రుడిగా సంచరిస్తూ వారి కదలికలు క్షుణ్ణంగా పరిశీలిస్తూ, వారితో చేతులు కలపడానికి సిద్ధంగా వున్నట్టు నటించాలి. ఆ విధంగా ఆ ద్రోహుల నిజస్వరూపం బైటపడుతుంది. ఏమంటారు?''

రాజారెడ్డి తలూపి, "పథకం బాగుంది. నాదొక మనవి. ఈ కేసులో నాకు మరొకరి తోడు అవసరం కలగవచ్చు. నాకు సహాయకుడిగా నా అసిస్టెంట్ డేవిడ్ ని తీసుకో వాలనుకుంటున్నాను,'' అన్నాడు.

జనరల్ కాసేపు ఆలోచించి_"ఆల్ రైట్! ఆఏర్పాటు కూడా జరుగుతుంది. మీ అసిస్టెంట్ ని లెఫ్టినెంట్ గా ఆ క్యాంప్ కు రప్పించాలి. మీరిద్దరూ స్నేహితులని యితర కేడెట్స్ కి అనుమానం రానివ్వకుండా జాగ్రత్తపడుతూ, మీమీ కార్యకలాపాలు సాగించాలి'' అన్నాడు.

## 2

జనరల్ కైలాశ్ సైగల్ వేసిన స్కీమ్ అమలులోకి వచ్చింది. ఆత్మప్రకాశ్, నిరంజన్ దాస్ లతో బాటు, సైన్యం లోని వివిధ ర్యాంకుల ఆఫీసర్లు స్పెషల్ ట్రేనింగ్ మిషతో అక్కడికి రప్పించబడ్డారు.

వారిలో ఇన్ స్పెక్టర్ రాజారెడ్డీ, సార్జంట్ డేవిడ్ కూడా వున్నారు. బేరెక్స్ చేరువలోనే కుక్ హౌస్, డైనింగ్ హాల్ వున్నాయి. వాటి వెనుక వైపు రిక్రియేషన్ భవనం వుంది. అందులో ప్లేయింగ్ కార్డ్స్, కేరమ్స్, చెస్, రేడియో, టెలివిజన్, లైబ్రరీ, బార్ మొదలైన ఎంటర్ టైన్ మెంట్ సౌకర్యాలన్నీ అమర్చబడ్డాయి.

రాత్రి భోజనాలయ్యేక అందరూ అక్కడ సమావేశ మయ్యేరు. జనరల్ సైగల్ వాళ్ళని ఉద్దేశించి ప్రసంగించ వలసి వుంది. కేడెట్స్ అందరూ నిశ్శబ్దంగా కుర్చీల్లో కూర్చునివున్నారు. బ్రిగేడియర్ ధీరజ్ పాండే, జనరల్ సైగల్ చిన్న వేదికమీద ఆసీనులైవున్నారు.

జనరల్ లేచి, అందర్నీ ఒకసారి పరికించి, చెప్ప సాగేడు.

"డియర్ ఫ్రెండ్స్!

ఈ ట్రేనింగ్ పీరియడ్ లో నేను మీమీద ఎక్కువ ఆంక్షలు పెట్టదలచుకోలేదు. అలా అని మిలిటరీ డిసిప్లిన్ కి విరుద్ధంగా ఎవ్వరూ ఎలాంటి అవాంఛనీయమైన పని జెయ్యడానికి వీల్లేదు.

నేను వెల్ఫేర్ తోబాటు, డిసిప్లిన్ మీదకూడా ఎక్కువ శ్రద్ధ చూపిస్తాడు. వాటిని ఉల్లఘించిన వారిపై కఠిన చర్య తీసుకోబడుతుంది. రాత్రివేళ మీ రిక్రియేషన్ కోసం యిక్కడ అన్ని ఏర్పాట్లూ చెయ్యబడ్డాయి.

రాత్రి పన్నెండు గంటలవరకు మీరక్కడ కులాసాగా గడపొచ్చు. ఇక్కడి కార్యభారమంతా బ్రిగేడియర్ ధీరజ్ పాండేగారికి అప్పగించబడింది. ఈ రోజునుంచి వీరే మీ ట్రూప్ కమాండింగ్ ఆఫీసర్. వారి పర్యవేక్షణలో మీరు మీ కోర్స్ విజయవంతంగా పూర్తి జెయ్యగలరని ఆశిస్తున్నాను" అంటూ ముగించేడు జనరల్.

మరుక్షణం కేడెట్స్ కరతాళ ధ్వనులతో హాలంతా మారుమోగింది.

జనరల్, బ్రిగేడియర్ ఇద్దరూ వేదిక దిగి బైటికెళ్ళి పోయేరు.

కేడెట్స్ అంతా బార్ కౌంటర్ దగ్గర గుమిగూడ సాగేరు.

రాజారెడ్డి రిస్టువాచీ చూసుకున్నాడు. తొమ్మిదిం బావు!

సార్జంట్ డేవిడ్ కూడా అక్కడే ఉన్నాడు మిలిటరీ యూనిఫాంలో. అతని షోల్డర్స్‌మీద లెఫ్టినెంట్ హోదా క్రౌన్స్ మెరుస్తున్నాయి.

బార్ కౌంటర్లో విస్కీ తీసుకుని ఓ రౌండ్ టేబిల్ ముందు కూర్చున్నాడు ఆత్మప్రకాశ్. నిరంజన్‌దాస్ అప్పటికే ఓ పెగ్ లాగించి ప్లేయింగ్ కార్డ్స్ ఆదే టేబిల్ వైపు పోతున్నాడు.

డేవిడ్ పక్కగా నడుస్తూ తగ్గుస్వరంలో ఏదో చెప్పి, నిరంజన్‌దాస్ ఉన్నవైపు నడిచేడు రాజారెడ్డి.

"ఎవరైనా రమ్మీ ఆడతారా?" అంటున్నాడతను రౌండ్ టేబిల్ ముందు నిల్చుని.

రాజారెడ్డి నవ్వి, "రండి. కూర్చుందాం!" అన్నాడు.

"గుడ్ కెప్టెన్! నా పేరు నిరంజన్‌దాస్!" అన్నాడతను చెయ్యి ముందుకి చాస్తూ.

"అయామ్ రాజారెడ్డి! రేడియోలజిస్టని. గ్లాడ్ టు మీట్ యూ." అంటూ షేక్‌హాండ్ ఇచ్చేడు రాజారెడ్డి స్నేహపూర్వకంగా.

ఇంతలో మరో ఇద్దరు వచ్చేరక్కడికి.

నలుగురూ నాలుగు కుర్చీల్లో తిష్ఠ వేసేరు.

"పాయింట్‌కి రూపాయి చొప్పున ప్రారంభిద్దామా?" అడిగేడు నిరంజన్.

"నో. నో. ఫిఫ్టీ పైసా చాలు!" అన్నాడు రాజారెడ్డి.

మిగతా ఇద్దరూ అతనికి సపోర్ట్ ఇచ్చేరు.

నిరంజన్‌దాస్ కార్డ్స్ కలిపి ముక్కలు పంచసాగేడు. వాళ్ళతో రమ్మీ ఆడుతున్నా, ఇన్‌స్పెక్టర్ ధ్యాస మాత్రం ఛెస్ ఆడేవారి టేబిల్ దగ్గర నిల్చుని చూస్తున్న ఆత్మప్రకాశ్ మీదే ఉంది.

ఆట జోరుగా సాగుతోంది. నిరంజన్‌దాస్ పేకాటలో బాగా చెయ్యితిరిగినవాడిలా వున్నాడు. గంటలోపలే ఇన్‌స్పెక్టర్ నలభై రూపాయలు ఓడిపోయేడు. మిగతా ముగ్గురూ వంతులవారీగా గెలుస్తున్నారు. ఇంకా అలా ఆడుతూపోతే ఉన్నదంతా ఊడ్చిపెట్టేలా ఉన్నారు.

అప్పుడే ఇన్‌స్పెక్టర్ దృష్టి హాల్లోంచి బైటికెళ్తున్న ఆత్మప్రకాశ్ మీద పడింది. డబ్బు అయిపోయిందనే నెపంతో వెళ్ళి పడుకుంటానని చెప్పి ఆవులిస్తూ లేచాడు.

బార్ కౌంటర్ దగ్గరికెళ్ళి ఓ పెగ్ విస్కీ తీసుకుని, గ్లాసు అలాగే చేతిలో పట్టుకుని వాకింగ్ స్టెప్స్ వేస్తూ తలుపువైపు నడిచేడు ఇన్‌స్పెక్టర్. బైట పిండారబోసినట్టు వెన్నెల కాస్తోంది. అక్కడక్కడా ఎదిగిన ఎత్తైన పొదలు. కొబ్బరి చెట్లు.

హాల్లో ఆడుకుంటున్న వాళ్ళ మాటలు తప్ప అక్కడ నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. ఆ చెట్ల మధ్యనించి, పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని, సన్నగా ఈల వేసుకుంటూ నడుస్తున్నాడు ఆత్మప్రకాశ్. ఇన్‌స్పెక్టర్ బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది.

ఒంటరిగా ఎందుకు వచ్చేడు బైటికి? వెన్నెల్లో షికారుకా? లేక మరేదైనా కారణం ఉందా?

ఆత్మప్రకాశ్ అటూ ఇటూ చూడ్డంలేదు. ఏదో ఇంగ్లీష్

రాగాన్ని ఈలవేసుకుంటూ నడుస్తున్నాడు. ఇన్‌స్పెక్టర్ చేతిలో విస్కీ గ్లాసు ఇంకా అలాగే ఉంది.

సవ్వడికాని అడుగులతో అతనిని వెంబడించసాగేడు. రిక్రియేషన్ రూంలో ఉన్నవారి మాటలు ఇప్పుడు చాలా సన్నగా వినిపిస్తున్నాయి. ఇద్దరూ ఏభై గజాలు నడిచి ఉంటారు.

ఇంతలో హఠాత్తుగా నిశ్శబ్దాన్ని చీలుస్తూ, "డిష్" మనే శబ్దం వినిపించడం, ముందు వెళుతున్న ఆత్మప్రకాశ్ చిన్నగా వెనక్కి ఉన్నపళంగా నేలకూలడం లిప్త పాటులో జరిగిపోయేయి.

దిగ్భ్రాంతితో ఇన్‌స్పెక్టర్ కాళ్ళకి బ్రేకులుపడ్డాయి. కిందపడ్డ ఆత్మప్రకాశ్‌లో చలనం లేదు.

ఏమిటా శబ్దం? ఎక్కణ్ణించి వచ్చింది? చుట్టుపక్కల పొదలు, చెట్లు. ఏ వైపునుండి వచ్చిందో అంచనా వెయ్యడం సాధ్యంకాదు. అప్పుడు జ్ఞాపకం వచ్చింది ఇన్‌స్పెక్టర్‌కి. అటువంటి శబ్దం సైలెన్సర్ బిగించిన పిస్తోలు పేలినప్పుడే వస్తుందని. ఎవ్వరో పొదలమాటున నక్కి ఆత్మప్రకాశ్‌ని కాల్చేరు. ఎవ్వరు?

తను కదలకూడదు. కదిలితే ఆ వ్యక్తికి తన ఉనికి తెలిసిపోతుంది. ఆత్మప్రకాశ్‌కి పట్టిన గతే తనకీ పడుతుంది. ఇన్‌స్పెక్టర్ ఊపిరి బిగపట్టి రాతిబొమ్మలా అలాగే నిల్చున్నాడు.

పదిహేను నిమిషాలు గడిచేయి.

అదే నిశ్శబ్దం! చుట్టుపక్కల ఎలాంటి అలికిడీ లేదు. హంతకుడు తనలాగే కిక్కురుమనకుండా కాచుకున్నాడా? తన ఓపికని పరీక్షిస్తున్నాడా? ఈ సందేహాలు తీర్చుకో

వాలి. ఇన్‌స్పెక్టర్ మరేమీ ఆలోచించకుండా చేతిలో ఉన్న గ్లాస్‌ని పొదలవైపు విసిరేడు.

మరుక్షణం "డిష్"మన్న శబ్దం.

క్షణం తరవాత పొదల్లోపడి పరిగెత్తుతున్న అడుగుల చప్పుడు. తనూ పరిగెత్తాడు. కాని లాభం లేకపోయింది. క్షణక్షణానికీ ఆ శబ్దం దూరమౌతూ వినిపించసాగింది.

ఐదు నిమిషాల తర్వాత ఇన్‌స్పెక్టర్ వెనుకకు తిరిగి వచ్చి ఆత్మప్రకాశ్ పడివున్నవైపు వెళ్ళేడు. బోర్లా పడున్న అతన్ని వెల్లికిలా తిప్పేడు.

సరిగ్గా అతని నుదుటిమీద రంధ్రం! దాంట్లోంచి ఉబికి పెదాలవరకూ కారిన ఎర్రని రక్తం! కళ్ళు రెండూ తెరిచి ఉన్నాయి. దీన్నిబట్టి హంతకుడు గురితప్పకుండా కాల్చడంలో మంచి ప్రావీణ్యం కలవాడని తెలుస్తోంది.

శత్రుపక్షంవారికీ, ఆత్మప్రకాశ్‌కీ సంబంధం ఉన్నట్టు ఈ సంఘటనతో తేలిపోయింది. తాము ఆత్మప్రకాశ్‌ని అనుమానిస్తున్నట్టు వాళ్ళు పసిగట్టి ఉంటారు. అతని ద్వారా తమ రహస్యం ఎక్కడ బైటపడుతుందో అని కాల్చిపారేసేరు.

రాజారెడ్డి బుర్రలో తళుక్కున మెరిసింది మెరుపు. ఆత్మప్రకాశ్ భార్యకూ్కడా తన భర్త రహస్యం తెలిసి ఉంటుందా? అతని ఇల్లు సోదాచేస్తే విద్రోహుల ఆచూకీ తెలిపే కాగితాలేవైనా దొరకవచ్చు. క్షణం వృధాచేస్తే ఆ అవకాశం కూడా చెయ్యిజారిపోతుందేమో? ఇన్‌స్పెక్టర్ మరేమీ ఆలోచించకుండా రిక్రియేషన్ హాల్లోకి వెళ్ళేడు. దేవిడ్ కనిపిస్తే ఆత్మప్రకాశ్ హత్యగురించి బ్రిగేడియర్‌కు తెలీజేసి, అక్కడి తతంగం చూసుకోమని చెప్పి వెళ్ళాలని, హాలంతా కలయజూసేడు.

డేవిడ్ లేడు!

అంతేకాదు, అంతక్రితం అక్కడ పేకాడుతూ కూర్చున్న నిరంజన్‌దాస్ కూడా లేడు!! ఇద్దరూ ఏమయ్యేరు? ఎక్కడికెళ్ళేరు?

# 3

ఆత్మప్రకాశ్ వుండే ఆరంతస్థుల సౌధం ముందు జీప్ ఆపి, రిస్టువాచీ చూసుకున్నాడు రాజారెడ్డి. పదిన్నర!

ఈ చివర్నించి ఆ చివరివరకూ వీధి నిర్జనంగా వుంది. ఎక్కడో చెత్తకుండీలో పడుకుని పెద్దగా ఏడుస్తోంది ఊరకుక్క.

ఆత్మప్రకాశ్ వుండేఫ్లాట్ నెంబర్ మననం జేసుకుంటూ జీప్ దిగి భవనంవైపు నడిచేడు. అందులో అనేక కుటుంబాలు నివసిస్తూవుంటాయి. పైఅంతస్తుల్లో అక్కడక్కడా ఇంకా లైట్లు వెలుగుతున్నాయి. పరిగెత్తుతున్నట్టు మెట్లెక్కుతూ ఏడు నిమిషాల్లో నాలుగో అంతస్తు జేరుకున్నాడు.

ఫ్లాట్ నెంబర్స్ చెక్ జేసుకుంటూ చివరికి ఆత్మప్రకాశ్ వాళ్ళ ఫ్లాట్ ముందు ఆగేడు. తలుపు మూసివుంది. లోపల లైటు వెలుగుతున్నట్టు తలుపు సందులోంచి కాంతి కనికనిపిస్తోంది.

గుమ్మానికున్న కాలింగ్ బటన్ నొక్కేడు. లోన బెల్ మోగుతున్న శబ్దం. రెండు నిమిషాల తరవాత లోపలినించి గడియ తీసినట్టు చిన్నచప్పుడు. కాని, తలుపు తెరుచుకోలేదు.

"ఎవ్వరు?" లోపలినించి పలికింది స్త్రీ కంఠం.

ఆ కంఠంలో తాగిన మత్తుకూడా మిళితమైవున్నట్టు

గమనించేడు ఇన్‌స్పెక్టర్. "ఆత్మప్రకాశ్ గారు మీకివ్వమని ఓ పేకెట్ యిచ్చిపంపేరు!" అన్నాడు పాచిక విసురుతూ,

"అలాగా! ఆ పాకెట్ కింద గుమ్మం దగ్గరపెట్టి వెళ్ళు. నే తీసుకుంటాను." అంది ఆమె జోగుతున్నట్టు.

ఊహించని ఆజవాబుతో నిర్వీర్యబోయేడు ఇన్‌స్పెక్టర్.

పనివాళ్ళు ఎవ్వరిచేతైనా ఏదైనా పంపితే స్వయంగా వచ్చి తీసుకోడమేగాక, తెచ్చినందుకు థాంక్స్ చెప్పడం రివాజు. అదేమీ లేకుండా గుమ్మం దగ్గర పెట్టి వెళ్ళమంటోందేమిటి? ఇంట్లో ఎవ్వరైనా వున్నారా? తను చూస్తానని భయమా? ఏదో అయ్యుంటుంది. తెలుసుకోవాలి.

గడియ ఎలాగూ తీసివుంది. ఒక్కతోపుతోసేడు తలుపుని. రెక్కలు భళ్ళుమంటూ తెరుచుకోవడం, ఆమె చిన్న కేకపెడుతూ గదిలో పడిపోడం రెప్పపాటులో జరిగిపోయేయి. ఒక్క ఉదుటున లోనికిదూరి, కాలితో తలుపు మూసేడు.

"ఎవరు నువ్వు? ఏమిటీ దౌర్జన్యం?" అంటూ నేల మీంచి లేవబోయిందామె.

రాజారెడ్డి మెరుపులా జేబులోంచి పిస్తోలు తీసి—

"లేవక! లేస్తే నిర్దాక్షిణ్యంగా చంపేస్తాను" అన్నాడు.

ఆమె లేచే ప్రయత్నం విరమించుకుని, మోచెయ్యి నేలమీద ఆనించి అలాగే పడుకుంది. అప్పుడు చూసేడు ఆమెనీ, ఆమె అవతారాన్నీ ఆమె చేతిలోవున్న వస్తువునీ!

దాదాపు ఇరవై ఎనిమిదేళ్ళుంటాయి. నున్నని గులాబి

రంగు ఒళ్ళు. భుజాలవరకూ కత్తిరించుకున్న జుత్తు. లోపలి ఒంపులన్నీ కనిపించే పల్చని స్లీపింగ్ గౌను. చేతిలో విస్కీ గ్లాసు.

ఇన్‌స్పెక్టర్ ఎక్స్‌రేకళ్ళు చకచక గదిని పరిశీలించేయి. గదినిండా పాశ్చాత్య పద్ధతిలో అమర్చిన ఖరీదైన సామాను. ఎదురుగా గోడకి నేలవరకూ వేలాడుతున్న పెద్దమఖమల్ కర్టెన్. ఆ గది పక్కనే మరోగది వుంది. ఇంట్లో ఇంకెవ్వరైనా ఉండివుంటే ఆ గదిలోనైనా వుండాలి. లేదా, ఎదురుగా గోడకి వేలాడుతున్న పరదా వెనకైనా నక్కి వుండాలి.

అతని మౌనాన్ని సాకుగా తీసుకుని అంది ఆమె. "కనీసం నన్ను లేచి కూర్చోనివ్వు. నిన్నూ, నీ పిస్తోలూ చూసి నేనేం భయపడ్డంలేదు."

ఇన్‌స్పెక్టర్ నవ్వి—"నీ నిర్భయానికి కారణం. ఇంట్లో నీకు తోడుగా ఇంకెవ్వరో వున్నారు. నీకాపద రాకుండా కాపాడతారు. ఆ వ్యక్తి పక్కగదిలో పొంచివుండాలి సమయంకోసం. లేదా ఆ కర్టెన్ వెనక నక్కి వుండాలి..."

ఇన్‌స్పెక్టర్ వాక్యం ఇంకా పూర్తికాకముందే కర్టెన్ మధ్య పిస్తోలు ఆకారం మొనదేలింది.

"ఢిష్, ఢిష్, ఢిష్!" ఒకటి కాదు మూడుసార్లు పేలింది పిస్తోలు కర్టెన్ వెనకనించి.

## 4

డేవిడ్ ఒంటరిగా టేబుల్ ముందు కూర్చుని, పేకాడుతున్న నిరంజన్‌దాస్‌నే గమనిస్తున్నాడు ఓరగా.

అప్పటికే ఆత్మప్రకాశ్‌ని వెంబడిస్తూ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి వెళ్ళి పావుగంటయింది. ఆత్మప్రకాశ్ బైటి

కెళ్ళినప్పుడే అనుమానం వేసింది డేవిడ్‌కి. అతని వెనకే నిరంజన్‌దాస్ కూడా వెళ్ళేవాడేమోనని. కాని, అతను లేవడంలేదు.

పూర్తయిన సిగరెట్ ఏష్‌ట్రేలో ఒత్తి గ్లాస్ అందుకున్నాడు డేవిడ్. సరిగ్గా అదే క్షణంలో నిరంజన్‌దాస్ పేకాట ఆపి కుర్చీలోంచి లేచాడు. మిగతావారితో ఏదో అని, తలుపువేపు నడిచేడు.

గ్లాసులో మిగిలిన విస్కీ ఒక్క గుక్కలో ఖాళీచేసి, బల్లమీద పెట్టి లేచాడు డేవిడ్. అప్పటికే నిరంజన్‌దాస్ తలుపు దాటేడు. డేవిడ్ అడుగులో అడుగు వేసుకుంటూ తనూ అటు నడిచేడు. ఆత్మప్రకాశ్, రాజారెడ్డి ఎటు వెళ్ళేరో తనకు తెలీదు.

ఏది ఏమైనా నిరంజన్‌దాస్, ముందు నిర్ణయించిన ప్రోగ్రాం ప్రకారం ఎక్కడికో వెళుతున్నాడని డేవిడ్ అనుమానం. నిజానికి నిరంజన్‌దాస్ వెళుతున్నది ఆత్మప్రకాశ్, రాజారెడ్డి వెళ్ళినవైపు కాదు. మరో దిశలో!

డేవిడ్ అతన్ని కొద్దిదూరం పోనిచ్చి, వెనక నిశ్శబ్దంగా వెంబడించసాగేడు. నిరంజన్‌దాస్ నడుస్తూ నడుస్తూ ఒకటి రెండుసార్లు రిస్టువాచీ చూసుకున్నాడు. కాసేపటికి ఇద్దరూ పొదలూ—చెట్లూ వున్న ప్రదేశాన్ని సమీపించేరు. ముందు వెళుతున్న నిరంజన్‌దాస్ చటుక్కున ఆగి అటూఇటూ చూడసాగేడు.

డేవిడ్ మెరుపులా కుడిపక్క వున్న పొదవెనక నక్కి చూడసాగేడు. సరిగ్గా అదేక్షణంలో కోకాకోలా కార్క్ ఊడదీసినట్టు "ఢిస్, ఢిస్!" మని వినిపించేయి శబ్దాలు.

అంతే! నిరంజన్‌దాస్ నేలమీంచి గజం ఎత్తు ఎగిరి

కాండం విరిగిన చెట్టులా నేలకూలేదు. డేవిడ్ గుండెలో గుర్రాలు దౌడుదీసేయి. సైలెన్సర్ బిగించిన పిస్తోలు పేలి నప్పుడే అటువంటి చప్పుడౌతుంది.

పిస్తోలు పేలిన తరవాత చడీ చప్పుడూ లేదు! హంతకుడు యింకా అక్కడే పొంచి ఉండివుంటాడు. డేవిడ్ నేలమీద పడుకుని నిశ్శబ్దంగా అవైపు పాకసాగేడు. కొద్ది దూరం వెళ్ళాడో లేదో, దురదృష్టవశాత్తు ఓ ఎండు పుల్ల అతని కిందికి వచ్చి విరిగి చిన్న శబ్దమైంది.

మరుక్షణం పిస్తోలు పేలడం, గుండు పొదల ఆకులు చీల్చుకుంటూ దూసుకుపోవడం జరిగిపోయేయి. డేవిడ్ ఊపిరి బిగబట్టి అలాగే పడుకున్నాడు. హంతకుడు నిస్సందేహంగా తనకి చేరువలోనే వున్నాడు. వెన్నెల కాస్తోంది. నిజమే. కాని, ఆ పొదల మధ్య హంతకుడు ఎక్కడున్నాడో అంచనా వెయ్యడం కష్టం!

తను వెనక్కి వెళ్ళిపోదామన్నా అవకాశంలేదు. ఈ చాటునించి తను ఏమాత్రం బైటికి వచ్చినా హంతకుడి పిస్తోలుకు టార్గెట్ సులువుగా దొరుకుతుంది.

డేవిడ్ బుర్రలో ఓ వుపాయం మెరిసింది. మోకాళ్ళ మీద కూర్చుని జేబులోంచి రివాల్వర్ తీసి ఎడంచేతిలో రెడీగా పట్టుకున్నాడు. కుడిచేత్తో కాలిబూటు లాగి దూరంగా పొదలమధ్య విసిరేడు. సర సర చప్పుడయింది.

"ఢిష్!"మంది పిస్తోలు.

డేవిడ్ ఉపాయం ఫలించింది. హంతకుడి పిస్తోలునించి వెలువడ్డ మెరుపు పొదల్లో అతనెక్కడ నక్కిఉన్నాడో స్పష్టంగా ఇండికేట్ జేసింది. డేవిడ్ ఇంకేమీ ఆలోచించకుండా రివాల్వర్ అటు గురిపెట్టి కాల్చేడు. ఆ

భయంకర నిశ్శబ్దాన్ని చీలుస్తూ పొదల్లోంచి చావుకేక వినిపించింది.

ఐనా, చెవులు రిక్కించి కూర్చున్నాడు డేవిడ్. అది పొంచివుండి ఎత్తుకూడా కావచ్చు. తనకి గుండు తగిలినట్టు గావుకేక పెడితే, కాల్చిన వ్యక్తి తను చచ్చేనని పరిగెత్తుకు వస్తాడు. ఆ తర్వాత......

పావుగంట వరకూ అలాగే కూర్చుని కాచుకున్నాడు డేవిడ్. అవతలినుంచి ఎటువంటి రెస్పాన్స్ రాకపోవడంతో నేలమీద పడుకునే కేక వినిపించినవైపు పాకసాగేడు.

పదిగజాలు వెళ్ళగానే కనిపించింది ఆకారం!

ఓ చెట్టుబోదెకు వీపు ఆనించి కూర్చున్న మానవాకారం!

డేవిడ్ అక్కడే ఆగిపోయేడు. ఆ ఆకారంలో కదలిక లేదు. తొందరపడితే ప్రమాదం. జాగ్రత్తకోసం రెండవ కాలికున్న బూటు తీసి ఆకారంమీదికి విసిరేడు. ఐనా ఎటువంటి చలనం కలగలేదు.

అప్పుడు కొద్దిగా ధైర్యం వచ్చింది డేవిడ్‌కి. అతను చచ్చివుంటాడు. లేదా, మూర్ఛపోయి ఉంటాడు. లేచి, అడుగులో అడుగు వేసుకుంటూ అతన్ని సమీపించేడు. ఆనందంలో డేవిడ్ గుండె ఉరకలు వేసింది.

తన గురి తప్పలేదు. అతని ఛాతీమీద పెద్ద రంధ్రం చేస్తూ దూసుకుపోయింది గుండు. అతను చచ్చేడు. డేవిడ్ గబగబ శవం జేబులు వెదికి చూసేడు. సిగరెట్ పాకెట్ లైటర్, ఓ మడత కత్తి, కొంత డబ్బూ తప్ప మరేమీ లేవు.

అతన్ని అక్కడే వదిలి, నిరంజన్‌దాస్ పడున్న చోటికి పరిగెత్తేడు. అతని శరీరంలో రెండు రంధ్రాలు కనిపించేయి. ఒకటి కంఠం దగ్గిర. రెండోది ఛాతీమీద. అందుకే గుళ్ళు తగిలేక అతని నోటినుంచి చిన్న శబ్దం కూడా బైటికి రాలేదు.

డేవిడ్ చక చక అతని జేబులు వెదికేడు. పాంటు పై జేబులో కర్చీఫ్, తాళంచెవుల గుత్తి తప్ప మరేం లేవు. లోపలి జేబులో అతని ఐడింటిఫికేషన్ కార్డ్, మనీపర్స్ ఉన్నాయి.

పర్స్ తెరిచి చూసేడు. కొన్ని నోట్లూ చిల్లరా ఉన్నాయి. అరలో ఓ మూల మడతబెట్టిన చిన్న కాగితం కనిపించింది. వేళ్ళతో దాన్ని బైటికి లాగి విప్పేడు.

"రాత్రి సరిగ్గా పదిన్నరకి... తూర్పు దిశగా—
చెట్లూ, పొదలూ ప్రారంభమయ్యే చోట! 'ఎ'"
అని రాసి ఉంది.

సాలోచనగా తలూపేడు డేవిడ్. దాంట్లో రాసివున్న ప్రదేశమే ఇది. ఆ కాగితాన్ని జేబులో కుక్కుతూ, గబ గబ రిక్రియేషన్ హాల్ వైపు నడిచేడు. హాల్లో ఒకరిద్దరు ఇంకా ఏవో ఆడుకుంటున్నారు.

రాజారెడ్డిగానీ, అత్మప్రకాశ్ గానీ ఎక్కడా కనిపించ లేదు.

# 5

కర్టెన్ వెనక పిస్తోలు మొన కనిపించగానే అది ఇంకా పేలకముందే రాజారెడ్డి మెరుపులా నేలమీద పడి పోయేడు.

పిస్తోలు పేలడం, అంతకుముందు అతను నిలుచున్న

తలుపు మధ్య మూడు రంధ్రాలు ఏర్పడటం కన్నుమూసి తెరిచేలోగా జరిగేయి.

కింద పడుతూనే రివాల్వర్ అటు గురిపెట్టి ట్రిగ్గర్ వత్తేడు రాజారెడ్డి.

"ఢాం!" గది మారుమోగింది.

కర్టెన్ వెనకనుంచి ఓ భారీ శరీరం కర్టెన్‌తోబాటు నేలకూలింది. బహుశా కింద పడుతున్నప్పుడే అతని ప్రాణాలు ఎగిరిపోయుంటాయి. అతని చేతిలో సైలెన్సర్ బిగించిన పిస్తోలు ఉంది. అందుకే పిస్తోలు గొట్టం మరో బెత్తెడు పొడుగయింది. ఆ కారణంవల్లే కర్టెన్ వెనక పిస్తోలు ఆకారం కనిపించింది.

నేలమీంచి లేచి శవాన్ని సమీపించేడు. అతని దుస్తులు గాలించేడు. స్పేర్ బుల్లెట్స్, దువ్వెన, సిగరెట్ కేస్, డ్రైవింగ్ లైసెన్స్, మనీపర్స్ కనిపించేయి.

పర్స్ తెరచి చూసేడు. వందరూపాయల నోట్ల దొంతర. అన్నీ కొత్తనోట్లు! లెక్కపెట్టేడు. నాలుగువేల తొమ్మిదివందల చిల్లర. డ్రైవింగ్ లైసెన్స్ అందుకుని పరిశీలించేడు. అందులో అతని ఫోటో, పేరూ వున్నాయి. పేరు చదివేడు. అబ్దుల్ రజాక్!

పర్సు జేబులో వేసుకుని లేచేడు. ఆమె వేనిటీ బ్యాగ్ కూడా అక్కడే, టీపాయ్‌మీదుంది. దాన్ని అందుకుని చూసేడు. అందులోనూ వంద వందరూపాయల నోట్ల దొంతర. మొత్తం ఐదువేలు!

జేబులోంచి అబ్దుల్ రజాక్ పర్సు తీసి, అందులోని నోట్ల నెంబర్లూ ఆమె బ్యాగ్‌లోని నోట్ల నెంబర్లూ చెక్ జేసేడు. అన్నీ ఒకే సీరీస్‌వి!

దీన్నిబట్టి స్పష్టమౌతోంది. అబ్దుల్ రజాక్ అనబడే ఈ వ్యక్తిద్వారానే ఆత్మప్రకాశ్ కి ప్రతిఫలం ముడుతోందన్న మాట.

వేనిటీ బ్యాగ్ పెట్టి, పిస్తోలు ఊపుతూ ఆమెవైపు తిరిగేడు. "లే!"

"ఎవరు నువ్వు? ఏమిటీ దౌర్జన్యం?" అంది లేచి నిల్చుంటూ.

రాజారెడ్డి నవ్వి-"సి. బి. ఐ. ఏజెంటుని!" అన్నాడు నింపాదిగా.

ఏ దొంగో అయుంటాడనుకున్న ఆమె మొహం వివర్ణమైంది.

"భోగవిలాసాలు మరిగి, శత్రుదేశంతో చేతులు కలిపి, మాతృదేశానికి ద్రోహం చేస్తూ జల్సాగా జీవించాలనుకున్న మీ బండారం బద్దలైంది. నేనడిగే ప్రశ్నలకి సూటిగా జవాబి స్తేసరి. లేదా, ఆడదానివని కనికరించను.

ఎంత మొండి ప్రాణం నోటినించైనా, కావలసింది వెళ్ళగక్కించడం నా ప్రత్యేకత. పిచ్చివేషాలు వేసికూడా ప్రయోజనం ఉండదు. రాబోయే ప్రమాదాన్ని మెరుపు కన్నా వేగంగా ఎలా ఎదుర్కుంటానో ఈపాటికి గ్రహించి వుంటావ్. ముందు నీ ముద్దు పేరేమిటో చెప్పు!"

అతని మాటలు ఆమెమీద పూర్తి ప్రభావం వేసేయి.

"పల్లవి!" అంది వణుకుతూ.

"ఈ అబ్దుల్ రజాక్ ద్వారానే కదూ మీకు డబ్బు ముట్టేది?"

పల్లవి పలకలేదు.

"మర్యాదగా అడిగితే చెప్పాలని ముందే హెచ్చరిం

చేను.'' అన్నాడు ఇన్‌స్పెక్టర్ అడుగు ముందుకు వేస్తూ.

ఐనా ఆమె పెదవి విప్పలేదు.

''పల్లవీ! ఇక ఏం దాచినా నిష్ప్రయోజనం. కొన్ని గంటల క్రితం క్యాంపులో నీ భర్త నా కళ్ళముందే హత్య జెయ్యబడ్డాడు.''

''అబద్ధం!'' అంది పల్లవి దాదాపు అరుస్తూ.

ఇన్‌స్పెక్టర్ నవ్వి- ''శవాన్ని కళ్ళారా చూసేవరకు నమ్మవన్నమాట. సరే, కొద్దిసేపట్లో అదీ జరుగుతుంది. ప్రభుత్వం నీ భర్తని అనుమానిస్తున్నట్టు అతని బాస్‌కి ఎలాగో తెలిసిపోయింది. అందుకే, అతను తమ రహస్యాలు వెల్లడి జెయ్యకుండా అతన్ని శాశ్వతంగా ఈ లోకంనించి పంపేసేరు.

నీ భర్త పతనానికీ, చావుకీ కారణమైన చీడపురుగుల గురించి నీకేమాత్రం తెలిసినా వెంటనే చెప్పేయ్. పోయిన నీ భర్త ఎలాగూ తిరిగిరాడు. కనీసం మాతో సహకరించి, అతను మాతృభూమికి జేసిన పాపాల్ని ప్రక్షాళనం గావించు,'' అన్నాడు.

ఆమె మొహంలో ఇంకా అనుమానపు ఛాయలు పోలేదు. కాసేపు తీవ్రంగా యోచించి తలెత్తింది. ''మీరేదో ఎత్తు వేస్తున్నారని నా అనుమానం! ఆయన హత్య జెయ్యబడ్డాడని అబద్ధం చెప్పి, నా నోరు విప్పడానికి ప్రయత్నిస్తున్నారు.''

ఇన్‌స్పెక్టర్ భుజాలెగురవేసి- ''ఆల్‌రైట్ నీ భర్త శవాన్ని చూద్దువుగాని, పద! ముందీ శవాన్ని స్థానిక పోలీసులకప్పగించాలి.'' అంటూ పక్కనే వున్న టెలిఫోన్ వైపు నడిచేడు.

కాసేపు ఫోన్లో మాట్లాడి, రిసీవర్ దించి_ "కమాన్ మూవ్!" అన్నాడు తలుపువైపు చూపిస్తూ.

ఇద్దరూ ఇంట్లోంచి బైటపడి, గబగబ మెట్లు దిగి కిందికి చేరుకున్నారు. రోడ్డు ప్రక్క తన జీవ్ ఉంది. అప్పటికే చంద్రుడు అస్తమించేడు బైట చీకటిగా వుంది.

ఇద్దరూ జీవ్ ఎక్కేరు. రాజారెడ్డి ఇంజన్ స్టార్ట్ చేద్దామని వంగి, ఇగ్నిషియన్ కీ మీద చెయ్యి వేసేడు. అంతే!

చీకట్లో_ "ఢిస్!"మన్న శబ్దం వినిపించింది.

ఇన్స్పెక్టర్ పక్కన కూర్చున్న పల్లవి గావుకేక పెడుతూ ఒరిగిపోయింది. తక్షణం తన శరీరాన్ని ముద్దలా ముడుచుకున్నాడు ఇన్స్పెక్టర్.

మళ్ళీ రెండుసార్లు_ "ఢిస్, ఢిస్!"మన్న శబ్దం.

రాజారెడ్డి తిన్నగా సీట్లో కూర్చుని ఉంటే, ఆ రెండు గుళ్ళూ అతని శరీరంలో తిష్టవేసేవి. ఒళ్ళు ముడుచుకోడం వల్ల గుళ్ళు రెండూ అతని వీపుమీంచి దూసుకుపోయేయి.

మరుక్షణం చీకట్లో పడి ఎవ్వరో పారిపోతున్న అడుగుల చప్పుడు వినిపించింది. క్షిప్తపాటులో ఆ చప్పుడు దూరమవసాగింది.

పల్లవి ఇంకా చావలేదు. గుండు తగలవలసిన చోట తగలేదు కాబోలు. గట్టిగా ఊపిరి తీసుకుంటూ వదలుతోంది.

ఇన్స్పెక్టర్ గుండెలో ఆశ పొంగి పొర్లింది.

ఆమెని రెండు చేతుల్లో పొదివి పట్టుకుని_ "పల్లవీ! పల్లవీ!" అన్నాడు ఆత్రంగా.

పల్లవి పలకలేదు.

అప్పుడు గమనించేడు ఇన్స్పెక్టర్. ఆమె మెడ కుడివైపు ఏర్పడ్డ గాయాన్ని. గాయంలోంచి ఇంకా రక్తం

కారుతోంది. వెచ్చని చిక్కని రక్తం!

"పల్లవీ! పల్లవీ! కళ్ళు తెరువ్!" అన్నాడు కుదుపుతూ. పల్లవి మెల్లగా కళ్ళు తెరిచి, అతన్ని రెప్ప వెయ్యకుండా చూడసాగింది.

"పల్లవీ! ఎవ్వరో నిన్నూ, అబ్దుల్ రజాక్‌నూ చంపాలనే ఇక్కడ పొంచివున్నాడు. ఆ హంతకుడెవ్వరో కాస్త ఆలోచించి చెప్పగలవా?"

పల్లవి జవాబివ్వలేదు. తెరిచిన కళ్ళు మూసుకుంది. ఉఛ్వాస నిశ్వాసాలతో ఆమె ఛాతీ ఎగిరిపడుతోంది. కాసేపటికి మెల్లిగా కళ్ళు తెరిచింది.

"హోటల్...హోటల్ గోల్డ్ స్టార్...అ..."అంతే, ఆమె తల ప్రక్కకి వాలిపోయింది.

ఇన్‌స్పెక్టర్ నరనాడులూ కృంగిపోయేయి.

సరిగ్గా అదే సమయంలో ఓ జీపు దూసుకువచ్చి వాళ్ళ పక్కన ఆగింది. అది పోలీస్ జీప్. పల్లవి ఇంట్లోంచి రాజారెడ్డి ఫోన్ చేసి పిలిపించిన స్థానిక పోలీసులు వాళ్ళు.

నలుగురు కానిస్టేబుళ్ళూ, ఓ సబిన్‌స్పెక్టర్ జీప్‌లోంచి బిల బిల దిగేరు. శవాన్ని కానిస్టేబుళ్ళ కప్పగించి, ఇన్‌స్పెక్టర్ని వెంటబెట్టుకుని మెట్లెక్కి పల్లవి ఇంట్లో ప్రవేశించేడు రాజారెడ్డి.

అక్కడ పడున్న అబ్దుల్ రజాక్ శవాన్ని సబిన్‌స్పెక్టర్ కప్పజెప్పి, కావలసిన ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చి, గబ గబ ఫోన్ వైపు నడిచేడు. క్యాంపులో ఉన్న బ్రిగేడియర్ ధీరజ్ పాండే రెసిడెన్స్‌కి రింగ్ జేసి రిసీవర్ అందుకున్నాడు.

"ఎస్! బ్రిగేడియర్ స్పీకింగ్." అవతలినుంచి వినిపించింది,

"నేను రాజారెడ్డి మాట్లాడుతున్నాను సార్!"

"మిస్టర్ రెడ్డీ! మీరెక్కడికెళ్ళారు? ఇంతవరకూ మీ కోసం క్యాంపులో వెతికించి విసిగిపోయేను. ఆత్మప్రకాశ్, నిరంజన్‌దాస్ ఇద్దరూ హత్య చెయ్యబడ్డారు!"

"వాట్!?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యంగా.

ఆత్మప్రకాశ్ హత్య తాను కళ్ళారా చూసేడు. కాని, అంతలోనే నిరంజన్‌దాస్ కూడా చంపబడటం అతనికి వింతగా తోచింది.

"నిరంజన్‌దాస్ హత్య మీ అసిస్టెంట్ డేవిడ్ కళ్ళ ముందే జరిగిందిట. అంతేకాదు, డేవిడ్ తన చాక చక్యంతో నిరంజన్‌ను చంపిన హంతకుణ్ని కాల్చి పారే సేడు. మూడు శవాలూ ఇంకా ఇక్కడే ఉన్నాయి. డేవిడ్ ద్వారా ఆ సంఘటన తెలియగానే, జనరల్ సైగల్ గారికి ఫోన్ జేసి చెప్పేను. ఆయన కొద్దిక్షణాల్లో ఇక్కడికి రాబోతున్నారు. మీరు వెంటనే బయలు దేరండి." అన్నాడు బ్రిగేడియర్ అవతలినుంచి.

రాజారెడ్డి అంతవరకు జరిగిందంతా అతనికి వివరించి, "పల్లవి మరణిస్తూ హోటల్ గోల్డ్‌స్టార్ పేరు ఉచ్ఛరిం చింది. ఒక్క నిమిషం ఆమె ప్రాణాలు నిలిచి వుంటే, బహుశా ఇంకేమైనా చెప్పేదేమో! దురదృష్టం. ఐనా, చివరి శ్వాస విడుస్తూ ఆ హోటల్ పేరు చెప్పిందంటే, తప్పకుండా అక్కడేదో క్లూ దొరకవచ్చు. అందుకే నేను తక్షణం అక్కడికెళ్ళి కనుక్కోవాలనుకుంటున్నాను.

శత్రువు తనతో సంబంధం ఉన్నవాళ్ళందర్నీ వంతుల వారీగా మట్టుబెడుతున్నాడు. తన రహస్యం బయటపడ కుండా జాగ్రత్తపడుతున్నాడు. ఏది ఏమైనా హోటల్

గోల్డ్ స్టార్ లో ఏదో మిస్టరీ ఉంది. అది తెలుసుకోవాలి. ఆ పని నా ఒక్కడివల్ల జరక్కపోవచ్చు. దయచేసి నా అసిస్టెంట్ డేవిడ్ ని తక్షణం ఆ హోటల్ కి బైలుదేరి అక్కడ నాకోసం ఎదురుచూడమనండి.'' ఇన్ స్పెక్టర్ రాజారెడ్డి అన్నాడు.

''ఆల్ రైట్! ఇప్పుడే పంపిస్తాను'' అవతల క్లిక్ మంది.

రాజారెడ్డి ఫోన్ పెట్టేసి ఇల్లంతా నిశితంగా గాలించసాగాడు.

## 6

హోటల్లో అడుగుపెట్టి హాల్లో కూర్చున్న వాళ్ళను ఓ మారు పరీక్షగా చూసేడు రాజారెడ్డి. నగరంలో బాగా పేరున్న హోటల్ అది. రాత్రింబవళ్ళూ నడుస్తుంది. హాల్లో అక్కడక్కడా కూర్చుని తింటూ తాగుతున్నారు కస్టమర్స్.

ఓ మూల ఒంటరిగా కూర్చుని విస్కీ శాబోలు చప్పరిస్తున్నాడు ఓ వ్యక్తి. నల్లని గెడ్డం, మీసాలు. కళ్ళకి గోల్డ్ ఫ్రేం పాయింటెడ్ జోళ్ళు.

డేవిడ్ వున్నాడేమోనని హాలంతా కలయజూసేడు. ఈపాటికి డేవిడ్ వచ్చి తనకోసం ఎదురుచూడవలసింది. ఇంకా రాలేదు. వచ్చేక అతనితో సంప్రదించి పథకం వెయ్యాలి. అంతవరకూ తొందరపడకూడదు.

ఆలోచిస్తూ వెళ్ళి ఓ టేబుల్ ముందు కూర్చున్నాడు ఇన్ స్పెక్టర్. ఊరికే కూర్చుంటే ఇతర్ల దృష్టిలో పడవచ్చు. బేరర్ తో ఓ పెగ్ విస్కీ తెప్పించుకుని చప్పరించసాగేడు.

ఇంతలో బైటనించి ఓ వ్యక్తి హోటల్లో ప్రవేశించేడు.

సన్నగా పొడుగ్గా ఉన్నాడు. బ్లాక్ సూటు. కాళ్ళకి బూట్సు.

తలుపుదగ్గరే ఆగి ఓమారు అందర్నీ పరీక్షగా చూసి, బార్ కౌంటర్ వైపు నడిచేడు. ఏదో లిక్కర్ తీసుకుని, కాసేపు అక్కడే కూర్చుని తాగి, గ్లాసు చేతిలో పట్టుకుని పచార్లు జేస్తున్నట్టు రాజారెడ్డి కూర్చున్నవైపు వచ్చేడు.

అతన్ని దాటి ముందుకు పోబోతూ ఆగి_"ఎక్స్‌క్యూజ్ మీ! ఈ రోజు ఒకటవ తేదీ కదూ?" అడిగేడు తగ్గు స్వరంలో.

ఇన్‌స్పెక్టర్ తల విదిలించి_ "నో! మూడో తేదీ!" అన్నాడు.

"థాంక్యూ!" అంటూ అతను వడి వడిగా బాత్‌రూం వైపు వెళ్ళేడు.

అప్పుడు రివిజన్ అయింది రాజారెడ్డిలో అతను అడిగిన ప్రశ్న! ఎవ్వరైనా తేదీగాని, టైమ్‌గాని అడగాలనుకుంటే_ 'ఈ రోజు తేదీ ఎంత?' అంటారు.

కాని, అతను_ 'ఈ రోజు ఒకటవ తేదీ కదూ?' అన్నాడు. అతనికి తేదీ తెలీనప్పుడు అలా అడగడంలో అర్థంలేదు. బాగా ఆలోచించేక అందులోని అర్థం ఏమిటో రాజారెడ్డికి బోధపడింది. సి. బి. ఐ. ఏజెంట్లు పరస్పరం గుర్తించుకోడానికి 'ఒకటి' అనే పదాన్ని వాడతారు.

ఐతే, ఆ వ్యక్తి సి. బి. ఐ. ఏజంటా? తనకేదైనా ముఖ్య విషయం చెప్పడానికి వచ్చేడా? దేనికైనా మంచిది, ఓసారి కనుక్కుంటే నష్టం ఏమిటి? అనుకుంటూ తనూ లేచి అతను వెళ్ళిన బాత్‌రూంవైపు నడిచేడు.

బాత్‌రూం తలుపు దగ్గరగా వేసివుంది. రాజారెడ్డి

సందేహించకుండా లోన అడుగుపెట్టేడు. ఆ వ్యక్తి ఒంగుని వాష్ బేసిన్‌లో చేతులు కడుక్కుంటున్నాడు.

"ఈ లోకంలో సవాలక్ష వెధవలు జీవిస్తున్నారు. వాళ్ళతో వేగలేక చావాలి!" అన్నాడు రాజారెడ్డి తనలో తను గొణుక్కుంటున్నట్టు. 'ఒకటి' అనే పదానికి తిరుగు జవాబు 'సవాలక్ష' ఆ వ్యక్తి నిజంగా సి.బి.ఐ. ఏజెంటైతే ఆ వాక్యంలోని జవాబును గ్రహించి తనతో మాట్లాడతాడు. ఇన్‌స్పెక్టర్ అనుమానం నిజమే అయింది.

అతను మెల్లిగా వెనక్కి తిరిగి- "నిజం చెప్పేరు!" అన్నాడు నవ్వుతూ.

ఇన్‌స్పెక్టర్ గుండె గతుక్కుమంది.

ఆ వ్యక్తి చేతిలో నల్లగా నిగనిగ మెరుస్తోంది. పిస్తోలు. అది సైలెన్సర్ బిగించిన పిస్తోలు!!

పళ్ళు పట పట కొరికేడు ఇన్‌స్పెక్టర్. అతను ఏజెంటు కాడు. శత్రుపక్షం మనిషి. వాళ్ళకి ఎలాగో సి.బి.ఐ. కోడ్ సిగ్నల్ తెలిసిపోయింది. హాల్లో అంతమంది మధ్య తనని చంపడం రిస్కు గనక, మోసంతో ఇక్కడికి రప్పించుకున్నాడు.

తన జేబులోనూ ఉంది పిస్తోలు. ఆ వ్యక్తి దాన్ని తీసే వ్యవధి ఇవ్వడు. చిరుతలా అతనిమీదికి లంఘించాలన్నా అవకాశంలేదు. అతను కేవలం గజన్నర దూరంలో వున్నాడు.

అతని వ్రేలు ట్రిగ్గర్ని వత్తబోతోంది. ఇహ ఒక్క క్షణంలో తన జీవితం సమాప్తం! నిస్సహాయంగా కళ్ళు మూసుకున్నాడు రాజారెడ్డి.

"ఢాం!" చెవులు పిక్కటిల్లేయి.

చావు కేక!

సైలెన్సర్ బిగించిన పిస్తోల్లోంచి అటువంటి శబ్దంరాదు; ఆశ్చర్యంతో కళ్ళు తెరిచేడు ఇన్‌స్పెక్టర్. ఎదురుగా వున్న వ్యక్తి గుండె పట్టుకుని నేల కూలుతున్నాడు.

నివ్వెరబోతూ వెనుదిరిగి చూసేడు.

తలుపు మధ్య అంతక్రితం హాల్లో కనిపించిన, గడ్డం వ్యక్తి నిల్చునున్నాడు. అతని చేతిలో పొగ విడుస్తున్న పిస్తోలు వుంది.

రాజారెడ్డి అటు చూడగానే, అతను చిన్నగా నవ్వుతూ పెట్టుకున్న గడ్డాన్ని తీసేడు.

"నువ్వా!?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యంగా.

డేవిడ్ తలూపి_ "మీరు రాకముందే నేనీ వేషంలో ఇక్కడికి వచ్చి మీకోసం కాచుకున్నాను. తరువాత మీరు రావడం, ఇతను మీతో ఏదో మాట్లాడ్డం, మీ రిద్దరూ ఒకరి వెనుక ఒకరు బాత్‌రూంలోకి దూరడంతో సంగతేమిటో చూద్దామని ఇటు వచ్చేను. మీరు కోరినట్టు బ్రిగేడియర్, నన్నీ హోటల్లో మిమ్మల్ని కలుసుకోమని చెప్పేసరికి జాగ్రత్తకోసం ఈ వేషం వేసుకోక తప్పింది కాదు. కారణం, కొన్ని గంటల క్రితం నా కళ్ళముందే నిరంజన్‌దాస్ చంపబడ్డాడు..." అన్నాడు.

"ఇటువంటి సూక్ష్మ బుద్ధి, మెళకువ ఉండబట్టే ప్రతి కేసులోనూ నిన్ను నాకు తోడుగా ఎన్నుకుంటున్నాను డేవిడ్! ఈ రోజుతో నీకెంతో ఋణగ్రస్తుడినయ్యేను" అంటూ కింద పడున్న ఆ వ్యక్తిని బూటుకాలితో వెల్లకిలా తిప్పేడు రాజారెడ్డి.

గుండు తగిలిన మరుక్షణం ప్రాణం పోయివుంటుంది.

అతని జేబుల్లో సామాన్యమైన వస్తువులు తప్ప మరేమీ లేవు.

"ఇది ఆరవ శవం! శత్రువు వేసిన పథకానికి ఈ ఒక్క రాత్రే ఆరుగురు బలయ్యేరు." అన్నాడు రాజారెడ్డి పెదవి విరుస్తూ.

"స్కోరు పెద్దదే! కాని, రిజల్ట్ మాత్రం జీరో!" అన్నాడు డేవిస్. ఇన్‌స్పెక్టర్ బుర్రలో తళుక్కుమంది ఓ ఆలోచన. "డేవిడ్! స్థానిక పోలీసుల్ని పిలిపించి ఈ శవం సంగతి చూసుకో. నేను కాస్త బ్రిగేడియర్‌తో మాట్లాడి వస్తాను." అంటూ గబ గబ బైటికి నడిచేడు.

కౌంటర్లో ఉన్న ఫోన్ ద్వారా బ్రిగేడియర్ రెసిడెన్స్‌కి రింగ్ జేసి రిసీవర్ అందుకున్నాడు. ఐదు నిమిషాల తరువాత బ్రిగేడియర్ ధీరజ్ పాండే లైన్‌లోకి వచ్చేడు.

రాజారెడ్డి ఇక్కడ జరిగిన సంఘటన గురించి చెప్పగానే "మైగాడ్! ఒక్క రాత్రిలో ఇన్ని హత్యలా? మీకింకా హంతకుల ఆచూకీ ఏమీ దొరకలేదా?" అన్నాడు దిగ్భ్రాంతితో.

"ఇప్పటివరకూ తెలియలేదు. కాని, శవాలు చిన్న క్లూ ఇచ్చాయి. దాని ఆధారంతో ఓ పథకం అల్లేను. బహుశా రెండు రోజులదాకా నేను క్యాంప్‌కు రాకపోవచ్చు. రేపంతా పరిశోధనలో నే గడిచిపోవచ్చు. దయచేసి మీరు రేపు రాత్రి ఎనిమిది గంటలకి, మౌంట్‌రోడ్లో ఉన్న స్కైలైన్ హోటల్ బార్ రూంలో నాకోసం వెయిట్ జెయ్యండి. అక్కడ మీకు కొన్ని వివరాలు చెప్పగలను," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"అలాగే" అన్నాడు బ్రిగేడియర్.

# 7

రాత్రి సరిగ్గా ఎనిమిది గంటలకి స్కైలైన్ హోటల్ బార్ రూంలో అడుగు పెట్టేడు బ్రిగేడియర్ ఫిరజ్ సాండే. అతనిప్పుడు మిలిటరీ యూనిఫాంలో లేడు. బ్రౌన్ సూటు వేసుకున్నాడు.

బార్ జనంతో కిటకిట లాడుతోంది. ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి కనిపిస్తాడేమోనని చుట్టూ కలయజూసేడు. అతనింకా రాలేదు. రిస్టువాచీ చూసుకుంటూ ఓ ఖాళీ టేబిల్ వైపు నడిచేడు బ్రిగేడియర్. బేరర్ రాగానే టూ పెగ్స్ జిన్ తెప్పించుకుని రాజారెడ్డి కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

పదిహేను నిమిషాల తరవాత ఓ యువతి బార్‌రూంలో ప్రవేశించింది. ఆమెని చూడగానే అక్కడ వున్నవాళ్ళందరి కళ్ళు తళతళ మన్నాయి.

ఇరవై ఎనిమిదేళ్ళుంటాయి ఆమెకి. గులాబి రంగు ఒళ్లు. భుజాలవరకూ కత్తిరించుకున్న జుత్తు. లిప్‌స్టిక్‌తో ఎరుపెక్కిన పెదాలు. తాగకున్నా తాగినట్టు మత్తుగా చూసే కళ్ళు. బొడ్డు కనిపించేలా కట్టుకున్న ఎర్రని జార్జెట్ చీర. అదే రంగు స్లీవ్‌లెస్ బ్లౌజు.

చూడగానే మగాడి నరాలు జివజివలాడేలా బొడ్డు ఊపుకుంటూ బార్ కౌంటర్ వైపు నడిచింది. గ్లాసులో రెండు మూడు పెగ్‌లు విస్కీ పోయించుకుని ఖాళీ టేబిల్ వైపు వెళుతూ ఓమారు అందర్నీ పరికించింది.

బ్రిగేడియర్ మీద దృష్టి పడగానే ఆమె కాళ్ళకి బ్రేకులు పడ్డాయి. కనుబొమలు ముడిచి ఔనా, కాదా అన్నట్టు అతన్ని సమీపించింది. "ఎక్స్‌క్యూజ్ మి! నా

జ్ఞాపకశక్తి సరైనదైతే మీ పేరు ధీరజ్ పాండే కదూ?''
అంది గుర్తుపట్టటానికి ప్రయత్నిస్తూ.

అతను తలూపి– ''ఔను! మీరెవరు?'' అన్నాడు మర్యాదగా.

ఆమె విరగబడి నవ్వి– ''మీ మగాళ్ళ జ్ఞాపకశక్తి ఇంత పల్చగా వుంటుందని ఇప్పుడే తెలిసింది మైడియర్ పాండే! నీ మొహం ఇంతగా మారిపోయినా, నేను గుర్తుపట్టగలిగేను. పదేళ్ళ క్రిందటి నీ గర్ల్ ఫ్రెండ్ మృణాళిన్ని మర్చిపోయేవా?'' అంది.

''గర్ల్ ఫ్రెండ్!?'' బ్రిగేడియర్ కనుబొమలు ముడివడ్డాయి. ఎంత ప్రయత్నించినా ఆమెను ఎక్కడ చూసేడో జ్ఞాపకం రావడం లేదు. అతని వాలకం చూసి ఆమె గట్టిగా నిట్టూర్చింది.

''నీవు నిజంగా నన్ను మరిచినట్టున్నావ్. మీ మగజాతే ఇంత. పదేళ్ళ క్రితం మనం లక్నోలో ఓ కాక్ టేల్ పార్టీలో కలుసుకున్నాం గుర్తుందా? అప్పుడు నువ్వు కర్నల్ హోదాలో ఉండేవాడివి.

బహుశా నీకు ఈ విషయంకూడా గుర్తు లేదేమో! ఒకసారి మూడు రోజులు సెలవు పెట్టి నన్ను సిమ్లా షికారుకి తీసికెళ్ళావ్!''

బ్రిగేడియర్ మొహం క్షణంలో వికసించింది. ''ఓ, హలో మృణా! అయామ్ వెరీ సారీ! ఇప్పుడంతా జ్ఞాపకం వచ్చింది. పాక్ యుద్ధంలో నేను తీవ్రంగా గాయపడ్డాను. అప్పటినుంచి నా జ్ఞాపక శక్తి సన్నగిల్లింది. యుద్ధంలో గాయపడటంవల్ల ఇప్పుడు నాకు వెనుకటి అందంకూడా లేదు. ఆడవాళ్ళు నన్ను చూడగానే ఆమడదూరం పారి

పోతారు'' అన్నాడు విచారంగా.

మృణాళిని అతనికెదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ అతని చేతిమీద చెయ్యి వేసింది. "బాధపడకు డార్లింగ్! నా కళ్ళకి మాత్రం నువ్వప్పుడెలా ఉన్నావో ఇప్పుడూ అలాగే ఉన్నావ్. సిమ్లాలో నీతో గడిపిన ఆ మూడు రాత్రులు నేనింతవరకూ మర్చిపోలేదు. అందుకే ఇంత త్వరగా నిన్ను గుర్తుపట్టగలిగేను. నీ భార్యా పిల్లలూ ఎలా ఉన్నారు? కులాసాయేనా?''

బ్రిగేడియర్ కళ్ళల్లో కాంతి ఆరిపోయింది. "ఆమె నాకు డైవోర్స్ ఇచ్చి పిల్లలతో సహా వెళ్ళిపోయింది. ఇంతకీ నువ్వీ మద్రాసులో ఏం చేస్తున్నావ్? ఒంటరిగా వచ్చేవా?'' అడిగాడు ఆశ్చర్యంగా.

ఆమె నవ్వి- "ఏడేళ్ళ క్రితం నేను ఓ నవాబును పెళ్ళి జేసుకున్నాను. ఇప్పుడతను లోకంలో లేడు. అతని ఆస్తంతా నాకు దక్కింది. దాన్ని ఎలా ఖర్చు పెట్టాలో తెలియక, దేశాటన జేస్తూ ఇటువంటి హోటళ్ళలో కులాసాగా కాలం వెళ్ళబుచ్చుతున్నాను'' అంది.

బ్రిగేడియర్ ఇంకా ఏదో అడగబోయేడు. అప్పుడే ఓ బేరర్ వచ్చి- "బ్రిగేడియర్ ధీరజ్ పాండే మీరే కదూ?'' అన్నాడు.

బ్రిగేడియర్ తలూపేడు.

"మీకు ఫోన్ కాల్ వచ్చింది సార్."

మృణాళినిని కాసేపు కూర్చోమని చెప్పి లేచాడు ధీరజ్ పాండే. బార్ కౌంటర్లో ఉన్న ఫోన్ రిసీవ్ జేసుకున్నాడు.

"అయామ్ వెరీ సారీ సార్! పరిస్థితులు తారుమారైన

దృష్ట్యా చెప్పిన టైంకి రాలేకపోయేను. ప్రస్తుతం నేను శత్రువులకి సంబంధించిన ఓ ముఖ్యమైన వ్యక్తిని వెంబడిస్తున్నాను. నాకు పూర్తి విశ్వాసం ఉంది. అతని ద్వారా వాళ్ళ స్థావరం ఎక్కడో తెలిసిపోతుందని!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి అవతలినుంచి.

"వెరీ గుడ్! ఇప్పుడు మీ రెక్కణ్నించి మాట్లాడుతున్నారు? మీకు సహాయంగా ఇంకెవ్వరైనా పంపమంటారా?" అడిగేడు బ్రిగేడియర్ ఆతృతగా.

"నో సర్! ఆ వ్యక్తి ఇప్పుడే ఓ బార్‌లోకి ప్రవేశించేడు. దానికెదురుగా ఉన్న ఓ రెస్టారెంట్‌లోంచి మాట్లాడుతున్నాను. అతన్ని వెంబడిస్తూ ఏ క్షణంలో ఎక్కడుంటానో నాకే తెలీదు... అదుగో! అతను బార్‌లోంచి బైటికి వస్తున్నాడు... ఇక ఉంటాను" అవతల క్లిక్‌మంది.

రిసీవర్ దించి మృణాళిని దగ్గరికెళ్ళేడు బ్రిగేడియర్. "ఇప్పుడు నేను ఫ్రీ అయ్యేను. ఎన్నో ఏళ్ళ తరవాత మళ్ళీ కలుసుకున్నాం. ఈ రాత్రి నా ఆతిథ్యం స్వీకరించడానికి నీకేమైనా అభ్యంతరమా?" అడిగేడు.

మృణాళిని పకపక నవ్వి – "నో! అదేం లేదు. నీ ఆతిథ్యం తప్పక స్వీకరిస్తాను. పద!" అంటూ లేచింది.

బ్రిగేడియర్ బిల్ పేజేసి, ఆమె వెంట బైటికి నడిచేడు.

# 8

వీధిలో జన సంచారం లేదు.

మసక చీకట్లో అటూ ఇటూ చూసుకుంటూ ఆ మేడని

సమీపించేడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి. అతని వెనకే పిల్లిలా అడుగులు వేస్తూ అనుసరిస్తున్నాడు డేవిడ్.

రెండంతస్తుల చిన్న సైజు మేడ అది. మేడ చుట్టూ కాంపౌండ్ వాల్ కట్టబడి వుంది. మెయిన్ గేటు పక్కనే పెద్ద సైన్‌బోర్డ్ ఉంది.

'సిలోన్ టూరిస్ట్ గైడ్ సెంటర్ అండ్ ట్రావెలింగ్ ఏజెన్సీ.'

సాలోచనగా తలూపుతూ జేబులోంచి సైలెన్సర్ బిగించిన పిస్తోలు తీసేడు రాజారెడ్డి. తన వెనక రమ్మన్నట్టుగా డేవిడ్‌కు సైగజేసి, మూసివున్న గేట్‌వైపు నడిచేడు. గేటు తెరచుకుని ఇద్దరూ కాంపౌండ్‌లోకెళ్ళేరు.

సింహద్వారం మూసివుంది. ద్వారాన్ని సమీపించగానే ఇన్‌స్పెక్టర్ పక్కకి తప్పుకుని చీకట్లో నక్కి నిల్చున్నాడు.

డేవిడ్ గడపకున్న కాలింగ్ బజర్ నొక్కి రెడీగా నిల్చున్నాడు. ఐదు నిమిషాల తరవాత ఎవ్వరో తలుపు దగ్గరికి వస్తున్న బూట్సుల సవ్వడి వినిపించింది.

"ఎవ్వరు?" లోపలినుంచి వినిపించింది మగ కంఠం.

"టెలిగ్రాం సర్!" అన్నాడు జేబులోంచి మడత బెట్టిన కాగితం తీస్తూ.

గడియ తీస్తున్న శబ్దం. తలుపు తెరచుకుంది!

ఓ వ్యక్తి ఇవతలకి వచ్చి- "ఏదీ టెలిగ్రాం?" అంటూ చెయ్యి చాపేడు.

అతను ఇవతలికి రావడం, అంతవరకూ చీకట్లో నక్కి వున్న రాజారెడ్డి పిస్తోలు పిడితో మెరుపులా అతని బుర్ర మీద దెబ్బ తియ్యడం రెప్పపాటులో జరిగిపోయేయి. ఆ వ్యక్తి కిక్కురుమనకుండా అక్కడే కూలేడు. అతన్ని

పక్కకి ఈడ్చి ఇద్దరూ లోన అడుగుపెట్టేరు. ఇప్పుడు ఇద్దరి చేతుల్లోనూ రివాల్వర్స్ రెడీగా ఉన్నాయి.

అది హాలు! అక్కడ ఎవ్వరూ లేరు. ఓ గోడవారగా పైకి మెట్లున్నాయి. పైనుంచి ఎవ్వరో ఎవర్నో హింసలు పెడుతున్నట్టు మూలుగులూ, చిన్నచిన్న కేకలూ వినిపిస్తున్నాయి.

ఇద్దరూ నిశ్శబ్దంగా మెట్లెక్కి పైకి చేరుకున్నారు. పైన మూడుగదులున్నాయి. మధ్య గదిలోంచి వినిపిస్తున్నాయి మాటలూ, మూలుగులూ. తలుపు సగంవరకూ మూసివుంది. లోపల లైటు వెలుగుతోంది.

ఆ సందులోంచి లోనికి చూసిన డేవిడ్ దిగ్భ్రాంతితో నివ్వెరబోయేడు.

గది మధ్య కుర్చీలో ఓ స్త్రీ కట్టేయబడుంది. ఆమెకిరుపక్కలా ఇద్దరు వ్యక్తులు, చేతుల్లో హంటర్స్ పట్టుకు నిల్చున్నారు.

మరోవ్యక్తి ఆమెముందు నిల్చుని ఏదో అంటున్నాడు.

అతను ధీరజ్ పాండే!

బ్రిగేడియర్ ధీరజ్ పాండే!!

ఆ యువతి ఎవ్వరో కాదు.

అనేక కేసుల్లో తమతో కలిసి పనిజేసిన లేడీ ఇన్వెస్టిగేటర్ షీలా!

డేవిడ్ ఇంకా ఆ దిగ్భ్రాంతినించి తేరుకోకముందే, అప్పటివరకూ సైట పీఛలో పొంచివుండి ఎదురు చూస్తున్న జనరల్ కైలాశ్ సైగల్, ఐ. జి. పి. ఇద్దరూ నిశ్శబ్దంగా అక్కడికి చేరుకున్నారు.

లోపల బ్రిగేడియర్ కంఠం మారుమోగింది. ''ఇప్పు

నైనా నిజం చెప్పు. ఎవరు నువ్వు? నోరు తెరిపించడానికి మా దగ్గర అనేక పద్ధతులున్నాయ్. నీవు భరించలేవు. ఆ దుర్దశ రాకముందే బుద్ధిగా చెప్పేయ్."

"ఎన్నిసార్లని చెప్పను? నేను మృణాళిని!"

పక పక నవ్వి- "ఇంకా నీకు జ్ఞాపకశక్తి రాలేదన్న మాట. అన్వర్! ఏదీ మన ఫార్ములా నెంబర్ టూ శాస్త్ర వుపయోగించి చూడు. అప్పుడైనా ఈమెగారికి జ్ఞాపకం వస్తుందేమో తనెవరో?" అన్నాడు బ్రిగేడియర్.

షీల పక్కన నిల్చున్న ఇద్దర్లో ఒకడు, జేబులోంచి మడత కత్తి బైటికి తీసేడు.

ఇక చూస్తూ నిల్చుని లాభంలేదు. పిస్తోలు సిద్ధంగా పట్టుకుని గదిలో అడుగు పెట్టి- "గుడీవ్‌నింగ్ సర్! మీరింత రిస్కు తీసుకోనవసరం లేదు. ఆమె ఎవరో నేను చెబుతాను." అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి వినయంగా.

బ్రిగేడియర్ అదిరిపడి వెనుదిరిగి- "నువ్వా?" అన్నాడు గుడ్లు తేలవేసి.

"ఔను సార్. నేనే! బహుశా, నావల్ల మీకేదైనా సహాయం అవసరమౌతుందేమోనని ఇలా వచ్చేను."

బ్రిగేడియర్ నవ్వలేక నవ్వి- "బార్‌లో ఈమె మీద నాకు అనుమానం వేసింది. అందుకే ఇక్కడికి తీసుకువచ్చి దర్యాప్తు జేస్తున్నాను" అన్నాడు.

"అలాగా దర్యాప్తు జెయ్యదలచుకున్నవారు ముక్కూ మొహం తెలియని ఈ భవనంలోకి ఎందుకు తెచ్చేరు? పోలీస్ హెడ్‌క్వార్టర్స్‌కి తీసికెళ్ళవచ్చుగా? మీరు అనవసరంగా శ్రమపడ్డారు సార్! ఈమె పేరు షీలా. మా డిపార్ట్‌మెంట్‌లో కొమ్ములు తిరిగిన లేడీ ఇన్‌వెస్టిగేటర్!"

"లేడీ ఇన్వెస్టిగేటరా?" బ్రిగేడియర్ కంఠం వణికింది.

"ఔను సార్! నేనే ఈమెని మృణాళిని పేరుతో మీదగ్గరికి పంపేను."

రాజారెడ్డి కంఠం మారిపోయింది. "మిస్టర్ ధరజ్ పాండే! ఇంతవరకూ నీ నాటకం నిరాటంకంగా సాగింది. కానీ, నీవు చేసిన చిన్న పొరపాటువల్లే నీ బండారం బద్దలు కొట్టింది. ఒక్కొక్కసారి శవాలే కథలు చెబుతుంటాయి. నీవు చంపిన శవాలే నీ గురించి 'క్లూ'లు ఇచ్చాయి.

ముఖ్యంగా నిన్న రాత్రి గోల్డ్ స్టార్ హోటల్లో నన్ను చంపడానికి ఆ వ్యక్తిని పంపి చాలా పెద్ద పొరపాటు చేశావ్.

పల్లవి ఇంటినించి నేను గోల్డ్ స్టార్ హోటల్ కెళ్తున్నానని నీకు తప్ప మరో ప్రాణికి తెలీదు. అలాగే, సి. బి. ఐ. కోడ్ సిగ్నల్ ఇతర్లకి తెలియడం అసంభవం! అటువంటిది అతనికెలా తెలిసేయి? అలాగే మేము రంగంలోకి దిగింది ఎవరెవరిపై నిఘావేసింది నీకు, జనరల్ గారికే తెలుసు. అటువంటిది మేము రంగంలోకి దిగీదిగగానే ఒక్క రాత్రిలో ఆరు హత్యలు జరిగాయి.

అప్పుడే నా అనుమానం నీమీదికి మళ్ళింది. నా సందేహాలు నివృత్తి చేసుకోవడానికి నిన్ను స్కైలైన్ హోటల్ కి రమ్మని చెప్పి, లేడీ ఇన్వెస్టిగేటర్ షీలను మృణాళిని పేరుతో నీ దగ్గరకి పంపి మేమంతా హోటల్ బైట నీకోసం కాచుకున్నాం.

షీలను వెంటపెట్టుకుని నీవు హోటల్లోంచి బైటికివచ్చి కార్లో బైలుదేరావ్. మా వెనకే మేమూ ఫాలో అయ్యాం.

నీ కారు ఈ మేడలోకి తిరిగింది. ఆ విధంగా మాకు మీ స్థావరం తెలిసిపోయింది..." ఇన్‌స్పెక్టర్ ఇంకా ఏదో అంటూనే వున్నాడు.

హఠాత్తుగా బ్రిగేడియర్‌లోనూ, అతని అనుచరులోనూ చలనం వచ్చింది. వాళ్ళింకా తెగించకముందే, బైట నిల్చున్న జనరల్ సైగల్, ఐ. జి. పి. డేవిడ్, మెరుపులా లోనికి దూరి ముగ్గుర్నీ చుట్టుముట్టేరు.

ధీరజ్ పాండే మొహంలో నెత్తురుచుక్క లేదు.

రాజారెడ్డి నవ్వి— "ఇక లాభంలేదు. ఎంత తెగించినా నిష్ప్రయోజనం. నువ్వసలు బ్రిగేడియర్ ధీరజ్ పాండే కావని నా అనుమానం!

భారత సైన్యంలో, తన మాతృభూమికి ద్రోహం తలపెట్టేంతటి నీచుడెవ్వడూ లేడు. బ్రిగేడియర్ ధీరజ్ పాండేను ఎక్కడో మట్టుపెట్టి, ప్లాస్టిక్ సర్జరీద్వారా ఆయనలా నటిస్తూ, ఫ్యాక్టరీలో అత్మప్రకాశ్, నిరంజన్ దాస్‌లను లోపరచుకుని డిఫెన్స్ సీక్రెట్స్, నీ దేశానికి పంపుతున్నావ్. నువ్వు పాకిస్తాన్ గూఢచారివి! అవునా!" అన్నాడు.

డేవిడ్ ముందుకువచ్చి అతని దవడలకింద చేతులు వేసి బలంగా లాగాడు.

అతని ముఖంమీది మాస్క్ తొలిగిపోయింది. ఇప్పుడు ఆ గదిలో బ్రిగేడియర్ పాండే లేడు. అతని స్థానంలో ఎవ్వరో కొత్త వ్యక్తి వున్నాడు.

మిషన్ విజయవంతంగా ముగిసింది.

—: ఐపోయింది :—



## [ఐదవ భాగము]

"ఎ... ఱ్ఱ... మ... ను... షు... లు..." క్రోధంగా గొణిగాడు వృద్ధ నాయకుడు.

"ఈ తిమింగలం మాక్కావాలి." దర్పంగా అరిచాడు కత్తిలా చెయ్యెత్తి ఎఱ్ఱమనుషుల పడవలోంచి ఓ వ్యక్తి.

అతని భుజానికీ, నడుం చుట్టూ తోలు పట్టకాలున్నాయి. కళ్ళ చుట్టూ ఎర్ర రంగు వేసుకున్నాడు, భయంకరంగా.

ఎత్తయిన విగ్రహం.

కర్కశమైన కళ్ళు.

ఛాతి నగ్నంగా ఉంది రంగుల్తో, మెడలో దంతాల గొలుసు.

ముప్ఫయి ఏళ్ళకంటె ఎక్కువ ఉండదు అతని వయస్సు. బహుశా, అతనే ఎఱ్ఱమనుషుల నాయకుడై వుండాలి!!

"ఎవరు వాళ్ళు?" అడిగేను నాయకుణ్ణి, ఆశ్చర్యంగా, అతని ప్రక్కగా జేరి. నాయకుడు కొంచెం డీలా పడి పోయినట్లు ముఖం పెట్టాడు.

"మిజూరా! (మేజర్ అనలేక నన్ను అలా పిలుస్తాడు నాయకుడు). ఎఱ్ఱమనుషులు మా జాతికి ఆగర్భ శత్రువులు. మన దీవికి పశ్చిమంలో ఓ దీవివుంది. ఎఱ్ఱమనుషుల దీవి అని పిలుస్తాం దాన్ని. తాము ఎఱ్ఱగా, అందంగా ఉన్నామని వాళ్ళ గర్వం. దేవత పుత్రులమని చెప్పుకుంటూరు. వాళ్ళు మమ్మల్ని ఎప్పుడూ బానిసల్లా చూడడానికి ప్రయత్నిస్తారు.

మేము తిమింగలాల వేటకు ఎప్పుడొచ్చినా మేం వేటా డిన దాన్ని దొంగలించుక పోతారు. అలా ఎన్నోసార్లు పోరాటాలు జరిగాయి. ఎంతో మంది మా జాతి మనుషు లను కోల్పోయాను యుద్ధంలో. వారం రోజులకు ఉప యోగపడే తిమింగలాన్ని మేము ప్రాణాలను తెగించి, పోరాడి నెగ్గకుంటే ప్రతిసారి వారు క్రూరంగా దోచు కోవటం జరుగుతోంది.

కొండ దేవత మా మొరాలకించటం లేదు. ఆహారం దక్కకపోగా, ఎప్పుడూ యిద్దరు ముగ్గురితో ప్రాణాలు దక్కించుకొని సాగిపోవటం జరుగుతోంది. ప్రతి పోరా టంలో యిలా, నాజాతి మనుషులను కోల్పోతే యిక కొద్ది రోజుల్లో నా, గూడెం మనుషుల్ని వారికి బానిస లుగా అప్పచెప్పి నేను దేవత ఎదురుగా పొడుచుకుని ప్రాణం విడుచుకోవాల్సి వస్తుంది," అన్నాడు రుద్ర

కంఠంతో వృద్ధ నాయకుడు.

నా చెయ్యి నాయకుడి భుజంమీద పడింది.

"నాయకా! సముద్రం మీద దిక్కులేని చావు చావకుండా, మమ్మల్ని ఆదరించేవు. ఎల్లమనుషులకు నేను బుద్ధి చెబుతాను. కాని పోరాటం జరిగే కాస్సేపూ నా ఆజ్ఞలు నీ మనుషులంతా స్వీకరించాలి. అమలుపరచాలి."

"మిజోరా! నీమీద నాకు నమ్మకం వుంది. నాగూడెం మనుషులంతా నిన్ను అభిమానిస్తున్నారు," అంటూ చెప్పమన్నట్లు చూసాడు నాయకుడు.

"సాధారణంగా మీ పోరాటం ఎలా సాగుతుంది?" అడిగేను.

"ముందు పోరాడ్డానికే ఇరు పక్షాలూ నిర్ణయించుకుంటాం. పడవలు ఎదురెదురుగా వస్తాయి. ఈటెలు విసురుతూ యుద్ధం చేస్తాం. చచ్చిన వాడల్లా సముద్రంలో పడతారు."

రెండు ఆటవికుల పక్షాలకీ పథకాలు రూపొందించే విజ్ఞత లేదని తెల్సిపోయింది నాకు.

"శాన్యోరా! బైనాక్యులర్స్ సహాయంతో చూసి చెప్పు. ఎల్ల మనుషులెంత మంది వుంటారు?" అడిగేను.

ఆమె బైనాక్యులర్స్ కళ్ళముందు పెట్టుకుంది.

"40 మంది" అంది శాన్యోరా. "మన బలగం ముప్పై."

"తూటాలెన్నున్నాయి?"

"పాతిక భయంకర్! కాస్త ఆలోచించు. అవి ఖర్చు పెట్టేస్తే భవిష్యత్తులో కష్టాల్లో పడతాం!" అంది శానోరా.

"పొదుపుగా వాడతా" అన్నాను.

"నల్ల ముద్దులూ!...మర్యాదగా తిమింగలాన్ని అప్ప గిస్తారా? ఈటెలు మీ గుండెల్లో నాటడం ప్రారంభించ మంటారా?" రెండు చేతులూ నోటి చుట్టూ పెట్టి పొలికేక పెట్టాడు ఎఱ్ఱమనుషుల నాయకుడు.

వృద్ధ నాయనుడి ముఖంలో ఎక్సైట్ మెంట్ కన్పడు తోంది.

"నాయకుడా! మన దగ్గర మందమైన చెక్క లున్నాయా? వాటిని పడవ పొడువునా మనం అడ్డు పెట్టుకోవాలి. శత్రువుల ఈటెలు వాటికి తగిలి క్రిందకు రాలిపోతాయి," అడిగాను.

నాయకుడి ముఖం వికసించింది.

"మిజోరా! ఆ వుపాయం మాకింతవరకూ తట్టలేదు. క్షణంలో ఆ ఏర్పాటు చేస్తాను," అంటూ వెనుదిరిగాడు.

"మన బలగంలో గజయీతగాళ్ళు నలుగురు కావాలి," అన్నాను. నాయకుణ్ణి ఆపి.

"ఉన్నారు చేపల్లా జారుతూ మాయమౌతారు. ఏం?"

"తర్వాత చెప్తాను. యుద్ధానికి సిద్ధం కండి" అన్నాను గంభీరంగా. కొద్ది క్షణాల్లో ఆ నిశ్చల సముద్రం మీద పోరు జరగబోతుంది.

మా పడవలోంచి ఓ ఆటవికుడు నిలబడి బలంగా కొమ్ము బూరా ఊదాడు.

అదే యుద్ధ సంకేతం!!

* * *

"హాయిరే, ముసలిపీనుగా! గతంలో తిన్న దెబ్బలు మర్చిపోయావ్. ఇద్దరు కొత్తమనుషులు కనపడుతున్నారు

వారి అండ చూసుకొనా నీ ఆశ? మరోసారంటూ పోరాటం లేకుండా ఈసారి నీతలకాయ వేరు చేసి చంకలో పెట్టి పట్టుకపోతాను,'' పరిహాసంగా నవ్వుతూ అరిచాడు ఎఱ్ఱ మనుషుల నాయకుడు.

అతను సైగ చేస్తూ చెయ్యి గాలిలో విసిరాడు. అంతే! అటువైపునుంచి రివ్వున ఈటెలు గాలిలోకి లేచాయి. రెండు వైపులనుంచీ పోరు భీకరంగా సాగుతూంది. ఈటె లెగురుతున్నాయి. పడవ చుట్టూ ఏర్పాటు చేసిన కొయ్య కవచం కొంతవరకూ శత్రువుల ఈటెలను పడగొడు తోంది.

శాన్యోరా, నేను రెండు కొయ్య స్తంభాల వెనుక కవర్ తీసుకున్నాం. తుపాకీ ఎక్కుపెట్టి ఎఱ్ఱమనుషుల నాయకుడి పక్కగా వున్న మరో వ్యక్తికి గురిపెట్టాడు.

''ధన్''మంది తుపాకీ. అతను కెవ్వున అరుస్తూ నీటిలో పడ్డాడు.

''భయంకర్!'' అని అరుస్తూ చటుక్కున స్తంభం వెనక్కి లాగింది శాన్యోరా.

ఎఱ్ఱమనుషుల నాయకుడు విసిరిన ఈటె రివ్వున ఎగిరి స్తంభంలో నాటుకుంది.

కొద్దిలో అపాయం తప్పింది.

''భయంకర్! లెట్ మి హేవ్ ఛాన్స్. ఐ విల్ షూట్ దట్ బాస్టర్డ్!'' అంటూ తటాలున నాచేతిలో తుపాకీ లాక్కుని ఎఱ్ఱమనుషుల నాయకుడికేసి గురిపెట్టింది శాన్యోరా.

అది గమనించి అవతలి పడవలోని నాయకుడు చటుక్కున తప్పుకోవడం, శాన్యోరా పేల్చడం ఒకేసారి జరిగింది.

గురి తప్పి అతని ఎడమభుజంలో దిగబడ్డాయి రెండు తూటాలు. వృద్ధనాయకుడు అది గమనించి, ఎగిరి గంతేసి నంత పనిచేశాడు. పదిహేను నిముషాలు గడిచాయి. అప్పటికి మా బలగంలో అయిదుగురు మరణించారు.

ఇద్దరు గాయపడ్డారు.

ఈటెలు ఎగురుతూనేవున్నాయి! శత్రువులు పదిమంది చచ్చిపడినట్లు అంచనా వేశాం. ఎఱ్ఱమనుషుల నాయకుడు వెఱ్ఱెత్తిపోయి తన మనుషులికి ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. నాయకుడు కుడిచేత్తో ఈటెలు విసురుతూనే వున్నాడు.

వృద్ధనాయకుణ్ణి వెనక్కి లాగాను. "నేనిచ్చిన విస్కీ బాటిల్ ఇప్పుడు నీదగ్గరుందా?" అడిగాను ఆత్రుతగా.

"దేనికి? సగం తాగేశాను" అన్నాడు విస్కీ బాటిల్ తల వెనుకనుంచి తీస్తూ.

"ఫర్వాలేదు. చూస్తూవుండు!"

చకచకా అయిదు ఈటెలు తీసాను. వాటి మధ్య భాగంలో నాచొక్కా చింపి గుడ్డపేలికలు చుట్టాను. వాటిని విస్కీతో తడిపి వెలిగించాను. ఇప్పుడు ఈటెల మధ్యభాగాలు కాగడాలా మండుతున్నాయి.

"నాయకా! నాకు ఈటెలు విసరడం రాదు. ఇవి అవతలి పడవలో మధ్యభాగంలో పడే ఏర్పాట్లు చెయ్యి" అన్నాను అయిదూ అతని కందిస్తూ.

విషయం అర్థం అయిన నాయకుడు కేరింతలు కొట్టాడు.

మండే ఈటెలో ఒకటి తను తీసుకుని మిగతా నాలుగు ఆటవికులకిచ్చాడు.

సరిగ్గా ఒకేసారి అయిదు ఈటెలు ఎఱ్ఱమనుషుల మధ్య నాటుకున్నాయి.

కెవ్వున ఆర్తనాదాలు వినిపించాయి. రెండు ఈటెలు ఇద్దరి గుండెల్లోంచి దూసుకుంటూ పోయి ఆ రంధ్రాల్ని మంటల్లో కాల్చేస్తున్నాయి. మరో మూడు పడవ మధ్యలో పడి ఎఱ్ఱమనుషుల నడుం వద్ద ధరించిన బొచ్చు చర్మాలను “భగ్గున” అంటించాయి. పడవ మధ్యలో మంటలు రేగుతున్నాయి! పిచ్చికేకలు వేస్తూ చిందులు త్రొక్కసాగారు ఎఱ్ఱమనుషులు. మందే ఈటెల్ని ఆర్పటానికి సముద్రంలో తప్ప, లోపల కావాల్సిన నీరులేదు. సందిగ్ధంలో పడి ఒక్క క్షణం నిశ్చేష్టుడై నిలబడి పోయాడు ఎఱ్ఱమనుషుల నాయకుడు.

మండుతున్న ఈటెలను లాగి, సముద్రంలో పారేసి ఆజ్ఞ ఇవ్వసాగాడు.

అతని మాటలు ఎవ్వరూ వినిపించుకోవడంలేదు.

“రవ్...రవ్...” మంటూ పెద్దగా లేస్తున్నాయి మంటలు. ఈటెలు విసరడం మర్చిపోయి తోలు బట్టలు విప్పేసి తొక్కిసలాడుకొంటున్నారు.

“యిదే సమయం. విసరండి ఈటెలు.” గర్జించాడు వృద్ధ నాయకుడు. పులిమీది పుట్రలా మరికొన్ని ఈటెలు ఎగిరాయి వారిమీదకు. వృద్ధ నాయకుడు హృదయపూర్వకంగా నవ్వి నా భుజం తట్టాడు, “నీ మేలు మరిచిపోలేను మిజోరా!” అంటూ.

“నాయకా! తీరిగ్గా కృతజ్ఞతలు చెప్పదువు గాని, నువ్వు యిందాక చెప్పిన ఈతగాళ్ళేరి?”

“అందులో ఒకడు మరణించాడు. ముగ్గురే ఉన్నారు” అన్నాడు నాయకుడు.

“వెంటనే పిలువ్.”

క్షణంలో ముగ్గుర్ని ముందుకి హాజరు పెట్టాడు నాయకుడు.

వారికి రహస్యంగా ఏదో చెప్పేను.

వాళ్ళు తల వూపి పడవ వెనుక భాగంలోంచి చటుక్కున సముద్రంలోకి దూకేరు.

ఈలోగా ఎఱ్ఱమనుషుల నాయకుడు మండే దుస్తుల్ని సముద్రంలో పారేసి, తన మనుషుల్ని హడావుడి లోంచి మేల్కొలిపాడు. తిరిగి ఈటెలు రాసాగాయ్.

"ఇక ఈటెలు ఎవరూ విసరకండి. ఆ చెక్కల గోడల వెనుక తాపీగా కూర్చోండి!" శాసించాను. పడవలోని ఆటవికుల నుండి ఎదురుదెబ్బలు తగలడం లేదు.

ఆశ్చర్యంగా చూస్తున్నారు చావగా మిగిలిన పదిమందీ ఎఱ్ఱమనుషులూ, వారి నాయకుడు.

రెండు క్షణాలు గడిచాయి.

అంతే...!! ఎఱ్ఱమనుషుల పడవ హఠాత్తుగా ఓ వారగా ఒరిగిపోయి సముద్రంలోకి తిరగబడింది. నా పెదవులపైన నవ్వు వెలిసింది.

దృఢకాయులైన ముగ్గురు ఈతగాళ్ళు మంచి సమయంలో పడవను తిరగ్గొట్టేరు.

ఎఱ్ఱమనుషులు చెల్లాచెదరై తోక ముడుచుకుని ఈదుకుంటూ వెళ్ళిపోసాగారు.

"అందరూ లేవండి. నలుపే గెలిచింది. ఈత కొడుతున్న ఎఱ్ఱ శరీరాలపై ఈటెలు విసరండి." అరిచాను.

మళ్ళీ ఈటెలు ఎగిరి ఎఱ్ఱమనుషుల వీపులమీద నాటుకున్నాయి.

"ఎఱ్ఱమనుషుల నాయకుడు కనపడ్డం లేదు." అన్నాను శాన్యోరాతో.

"బ్రతికుంటే బజ్జీలు తినొచ్చని అనుకొని మునుగీత కొట్టి ఉడాయించుంటాడు." అంది శాన్యోరా నవ్వుతూ.

వృద్ధ నాయకుడు శాన్యోరాను, నన్నూ కలిపి చుట్టేసి కౌగలించుకున్నాడు.

*    *    *

సూర్యుడు నడి నెత్తిమీది కొస్తున్నాడు.

ఆకుల బుట్టల్లో ఉన్న పళ్ళు భోంచేసి, ఆటవికులతో పాటు పడవ అంతర్భాగంలో ఓ గంట విశ్రాంతి తీసుకున్నాం.

తర్వాత నాయకుడి పిలుపుమీద అంతా పడవ తట్ట మీదికి ఎక్కాం. తిమింగలం పడవకి సమాంతరంగా కట్టబడి ఉంది.

తోకకి అడ్డంగా పదునుగా చెక్కబడ్డ సన్నని పొడుగాటి పదునైన ఈటె గుచ్చి కదలకుండా అటూ ఇటూ తాళ్ళతో పడవమీద ఉండే కొయ్య గుంజకు కట్టేశారు.

"ఇప్పుడేం చేస్తారు? దాన్ని" అడిగాను నాయకుడ్ని.

"తలమీద కెక్కి మధ్యభాగంలో గొయ్యితీసి క్రొవ్వు తోడతాం." అన్నాడు నాయకుడు, విస్తుపోతూ వింటున్న నాకేసి నవ్వుతూ చూస్తూ.

మరి కొన్ని ప్రశ్నలు వేసి నా సందేహాలు తీర్చుకున్నాను.

కొద్ది నిముషాల తర్వాత నాయకుడి ఆధ్వర్యంలో పనులు చకచకా జరుగసాగాయ్.

ఓ పొడుగాటి తాడుతో, ఒక కొస పడవ మీదున్న కొయ్య గుంజకు కట్టేరు. నాయకుడు ఓ పారలాంటి పని ముట్టుని తీసుకుని ఆ తాడు రెండో కొస ఆధారంగా చేసు

కుంటూ పడవ అంచు మీదుగా వెళ్ళి అవతలివైపు దిగాడు సరిగ్గా ఆ తిమింగలం నెత్తిమీద.

జారిపోకుండా ఆ తాడు కొస అలాగే పట్టుకొని చేతి లోని పారతో నిలబడి తలను ఏ భాగంలో ప్రేటు వెయ్యాలా? అని పరీక్షించడం మొదలు పెట్టాడు. పాత బడిన యింటి గోడలలో గుప్తమైన బంగారం కోసం వెదికే వాడిలా నాయకుడు అతి జాగ్రత్తగా ఆ పని సాగిస్తు న్నాడు.

మరో పదిహేను నిముషాల్లో ఆ తిమింగలం తల దొల్చి మూడడుగుల వెడల్పులో లోతైన గొయ్యి ఏర్పరచాడు.

ప్రత్యేకంగా మరో తాడు క్రిందకు దింపారు ఆట వికులు.

దానికి పారను కట్టేశాడు.

పారను పైకి చేదుకొని ఆ స్థానంలో ఈసారి బొక్కెన కట్టి క్రిందకు దింపారు ఆటవికులు. నాయకుడు తిమింగలం తలమీద నిలబడి ఆ బొక్కెనను గోతిలోకి దింపాడు.

తర్వాత బొక్కెనను అందులో కదిపి పైకి లాగమ న్నాడు. పడవమీది ఆటవికులు చకచకా బొక్కెనను పైకి లాగారు.

శాస్త్రోరా, నేను ఆశ్చర్యపోతూ ఆ బాల్చీలోకి చూశాం.

ఇప్పుడా బొక్కెన పాలతో నిండిన కుండలా కనపడు తోంది!

సంతర్పణ కోసం నీళ్ళు మోసుకొచ్చి గంగాళాలలో పోసినట్టు దానిని కొయ్య తొట్టిలోకి నింపారు ఆటవికులు.

పని చకచకా సాగుతోంది!

నాయకుడు బొక్కెన తిమింగలం తలలో అమర్చడం— నాయకుడు చెప్పగానే దానిని పైకి లాగడం—క్రొవ్వును తొట్టెలోకి ఒంపడం... నిముష నిముషానికి మెల్లి మెల్లిగా తిమింగలం తైలంతో తొట్టెలు నిండుతున్నాయ్.

"తర్వాతేం చేస్తారు?" అడిగింది శాన్యోరా రెండు సిగరెట్లు పెదిమల మధ్య పెట్టుకొని ముట్టించి నాకొటిస్తూ.

సరిగ్గా... అదే సమయంలో...

"మిజోరా! నాయకుడు జారిపడి తిమింగలం తల కాయలో పడ్డాడు." అంటూ గగ్గోలు పెట్టసాగారు ఆట వికులు.

* * *

అదిరి పడ్డాను!... సిగరెట్టు సముద్రంలోకి విసిరేశాను.

"ఏం జరిగిందసలు?" కంగారుగా అడిగాను, ఎత్తైన పడవ అంచుమీంచి ఇంతకు ముందు నాయకుడు నిలబడిన ప్రదేశంవైపు చూస్తూ.

"మిజోరా! నాయకుడు మేం బొక్కెన దించుతూంటే పైకి చూస్తున్నాడు. అంతలో కాలు జారింది. అంతే! నూతిలోకి పడ్డట్టు దబ్బున లోపలికి పడ్డాడు.

"మిజోరా! వెంటనే ఏదో చెయ్యాలి. లేకపోతే ఊపిరి ఆడక నాయడుకు మాకు కాకుండా పోయే ప్రమాద ముంది."

చకచకా ఆలోచించసాగాను.

కంగారులో ఉపాయం తట్టలేదు.

"బొక్కెన ఆ గోతిలోకి వదిలితే అది పట్టుకుని పైకి రాగలడేమో." సన్నగా గొణిగాను. శాన్యోరా కలుగ జేసుకుంది.

"లాభం లేదు డియర్! లోపల కొట్టు మిట్టాడే మనిషికి పైన ఉన్న బొక్కన కనిపించే అవకాశం లేదు. అసలా స్థితిలో కళ్ళలోకి తిమింగలపు నూనె వెళ్ళకుండా కళ్ళు మూసుకుంటాడు. అయ్ గాట్ ఏన్ అయిడియా" అంటూ ఓ ఉపాయం చెప్పింది శాన్యోరా.

"బ్రిలియంట్ అయిడియా." శాన్యోరాను కౌగలించుకున్నంత పని చేశాను. చటుక్కున ఆటవికుల వైపు తిరిగాను.

"మీ దగ్గర ఎవరి వద్దనైనా కత్తి వుందా?"

బొడ్లోంచి ఓ చురకత్తి తీసి రివ్వున నావైపు విసిరాడు ఆటవికుల గుంపులోంచి ఒక వ్యక్తి.

చటుక్కున దాన్నందుకున్నాను నేర్పుగా.

ఇక ఆలస్యం చేయలేదు నేను. ఎత్తైన పడవ అంచు మీంచి నిలబడి దబ్బున సముద్రంలోకి దూకాను, తిమింగలం ప్రక్కగా.

జర్రున తిమింగలం తల క్రింది భాగంవైపు ఈదాను.

ఉజ్జాయింపుగా దాని తల సెంటర్ పాయింట్ వెదికేను.

హాల్వా కోసినట్టు దాని చుట్టూ క్రింది భాగాన్ని మూడడుగుల వెడల్పులో చురకత్తితో కోయసాగాను. అదే పరిధిలో అదే భాగంలో కత్తితో కన్నం చేయసాగాను.

మూడు నిముషాల్లో నా ప్రయత్నం ఫలించింది.

తిమింగలం ప్రసవించినట్లుగా జర్రున ఆ కన్నంలోంచి బయటపడ జారాడు నాయకుడు. అతని ముఖం, శరీరం అంతా జిగురుగా తిమింగలపు క్రొవ్వుతో కలిపి వచ్చేసింది. నీటిలోకి రాంగానే అతని భుజాన్ని ఓ చేత్తో గట్టిగా పట్టు

కొని, రెండు సార్లు జాడించేను. ఇప్పుడు క్రొవ్వు గివ్వు నీటిలో కలిసిపోయాయి. స్నానం చేసినంత శుభ్రంగా వున్నాడు నాయకుడు. ముఖం చేతులతో తుడుచు కున్నాడు.

భారంగా ఊపిరి పీలుస్తున్నాడు.

పడవపైనుంచి సంతోషంతో పిచ్చికేకలు వేస్తూ బల మైన త్రాడు విసిరారు ఆటవికులు. అప్పటికి బాగా తేరు కున్న నాయనుడు "మిజోరా! ఈ రోజు రెండు సార్లు రక్షించావ్. నీ రుణం తీర్చుకోలేను" అన్నాడు పైకి తేలి చేతులు నీటిపై తపతప లాడిస్తూ.

"నాయకా! దాన్నే ఛాందసం అంటారు మా భాషలో అవేవో పైన చెబుద్ గాని, తాడెక్కు ముందర" అన్నాను అతని నడుం తోస్తూ.

తడిసిన దుస్తుల్తో నాయకుడి వెనకే నేనూ తాడెక్కు సాగాను.

* * *

సాయంత్రానికల్లా, అంతా దీవికి చేరుకున్నాం.

శాన్యోరాతో కలిసి నేను చేసిన సాహసాలు నాయ కుడి పబ్లిసిటీ వల్ల విని ఆ దీవిలో ఆడా, మగా మమ్మల్ని దేవుడూ, దేవతలా పూజించినంత పనిచేసారు.

శాన్యోరా, నేనూ నాయకుడి కుటీరంలో కూర్చున్నాం. వీలు చూసుకుని నాయకుడ్ని అడిగేను.

"నాయకా! నీకు కొద్దో గొప్పో సహాయం చేశాను. నా కోరిక ఒకటి వుంది."

"దానికెంత సందేహమా?" నాయకుడు గల గలా నవ్వుతూ అన్నాడు.

"అడుగు మిజోరాం! నీవు కోరితే కత్తితో పొడుచుకు చావమన్నా చస్తాను" అన్నాడు నా చేతులు పట్టుకొని.

ఆటవికులతో యింతే!

అనుమానిస్తే ప్రాణం తీస్తారు.

నమ్మితే ప్రాణం ఇస్తారు.

"అంత పైశాచిక కోరిక కాదు. మేము వెళ్ళిపోవాలి. రేపే మా ప్రయాణం ఏర్పాట్లు నువ్వు చెయ్యాలి." అన్నాను దృఢంగా.

వృద్ధ నాయకుడు ఎవరో వెనుక పాటుగా వచ్చి హఠాత్తుగా ఈటెతో పొడిచినట్టు అదిరి పడ్డాడు.

"మిజోరా! ఏమిటి నువ్వనేది?" వెలవెలపోయాడు నాయకుడు. "మేమేదైనా అపచారం చేసామా?"

ఆప్యాయంగా అతని భుజాలు రెండు చేతులతో పట్టుకున్నాను.

"అలాంటిదేం కాదు. దయచేసి ఎక్కువ ప్రశ్నలు వెయ్యొద్దు నాయకా! మేమొక అతిముఖ్యమైన కార్యం మీద బయలుదేరాం. అది సఫలీకృతమైతే, మేమాశించిన ప్రపంచం ఏర్పడితే, హెలికాప్టర్‌లో ఎగిరి వచ్చి కొన్ని నెలల పాటు నీ ఆతిథ్యం స్వీకరిస్తాము" కలవరించినట్లు గబగబా మాట్లాడాను.

నాయకుడికేం అర్థం కానట్లు నా వేపు చూసాడు.

"మిజోరా! తప్పదా?"

"నాయకా! నన్ను అర్థం చేసుకొని క్షమించాలి. ఈ దీవిలో_నీ స్నేహంలో ఏర్పడ్డ తియ్యటి అనుభూతులు మర్చిపోలేను ఎన్నటికీ."

నాయకుడు కొద్ది క్షణాలు మౌనంగా ఉండిపోయి తల పంకించాడు.

"ఓ సహాయం చెయ్యాగలర్సు మీకు." అన్నాడు నిశ్శబ్దాని ఛేదిస్తూ.

"ఏమిటది?" అడిగాను కుతూహలంగా.

"యింతకు ముందు ఈ దీవిలో వుండి చచ్చిపోయిన మనిషికి ఓ యంత్రపు బోటు వుండేది. పశ్చిమ తీరాన పొదల మధ్య దాచాం దానిని. మీకు ఉపయోగపడుతుందేమో."

"మోటర్ బోట్." అంది ఆశ్చర్యంగా శానో్యరా. ఆ ఒక్క మాట అర్థం అయి.

ప్రొఫెసర్ గదిలో డీసెల్ ఆయిల్ డబ్బాలు ఎందుకున్నాయో నా కప్పుడు అర్థమైంది.

"ఎన్నాళ్ళయింది అక్కడ దాన్ని ఉంచి" అడిగాను జేబులోంచి సిగరెట్ పాక్ తీస్తూ.

"నెల రోజులయి వుంటుంది" చెప్పాడు నాయకుడు.

సిగరెట్టు ముట్టించేను. "శానో్యరా! వాడకపోడం వల్ల దాని యింజన్ తుప్పు పట్టి ఉండాలి ఈపాటికి."

"భయంకర్! అది పని చేసేట్లు చెయ్యాలి మనం. నాలుగు తెడ్ల సహాయంతో అరేబియన్ సీ దాటి పోర్ట్ సూడాన్ వెళ్ళలేం." అంది శానో్యరా దృఢంగా.

అంతలో సోనా రెండు కొబ్బరి బోండాలు తీసుకు వచ్చింది. మా ఇద్దరి చేతుల్లో పెట్టి నాయకుడి వెనక వెళ్ళి మౌనంగా నిల్చుంది.

"సోనా! మిజోరాం రేపు వెళ్ళిపోతున్నాడమ్మా!" భారంగా చెప్పాడు నాయకుడు కూతురి వేపు తిరిగి.

"విన్నాను బాబా! బయటి మనుషులను మనం నమ్మకూడదు. నిన్న ఏం పళ్లు తిన్నామో మనం జ్ఞాపకం ఉంచు

కోము. బయటి మనుషులూ అలాగే మనసిచ్చిన మనుషులను త్వరగా మర్చిపోతారు.''

జోనా మాటలకు నివ్వెర పోయాను.

ఒక ఆటవిక యువతికి యింతటి భావ పరంపరా?

నాయకుడిచ్చిన సంజాయిషీనే మళ్ళీ జోనాకిచ్చాను.

నిర్లిప్తంగా లోపల్కి వెళ్ళిపోయిందామె.

''నాయకా! మేము అలా దీవి అంతా తిరిగి యంత్రపు పడవను కూడా పరీక్షించి వస్తాం.'' అంటూ లేచాను.

''అలాగే మిస్టర్! కొత్తవి రుచికరమైన తిమింగలపు మాంసంతో భోజనం. త్వరగా వచ్చేయండి.''

బోటు వుండే ప్రదేశం గుర్తులు మరికొన్ని అడిగాను.

''మనిషిని పంపుతాను.'' అన్నాడు నాయకుడు.

''పర్వాలేదు'' అన్నాను చెప్పమన్నట్లుగా.

చెప్పాడతను.వృద్ధ నాయకుడివద్ద శలవు తీసుకున్నాం.

''ఏమిటి జోనా చెప్పింది?'' అడిగింది శాన్యోరా బయటికి రాగానే.

''మనం రేపు వెళ్ళిపోతున్నాం అని చెప్పాడు నాయకుడు. ఎందుకిద్దరూ? మిజోరాదీ, నాదీ ఒకటే ఒంటి రంగు. ఆ తెల్ల దొరసానిని మాత్రం యివ్వాళే తోలేస్తే బావుంటుందేమో అంది జోనా.'' అన్నాను నవ్వుతూ.

''యుఁ్యా లస్టీ రాట్'' కోపంగా చెయ్యెత్తింది శాన్యోరా.

''నన్ను చంపక డార్లింగ్! డైరీలోని ఆటవిక భాషను నేర్చుకోక పోవడం నీ ఖర్మ!'' అన్నాను పైకెత్తిన ఆమె చేతిని, నా నడుం చుట్టూ వేసుకొని ముందుకి నడిపిస్తూ.

మోటర్ బోట్ నా మెదడులో మెదుల్తోంది.

(సశేషం)

# సప్లిమెంట్ పోటీ - 31

31, 32, 33, 34, 35 __ అక్షరాలను తీసుకొని మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలు చేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు జూన్' 77 నెల మాసపత్రికలో చూడండి.

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

# మీరే ఎన్నుకోండి?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది. *



# క్రైమ్‌లో తమాషాలు

## బుద్ధు—

ఒక రచయిత్రి బొత్తిగా సరసం తెలియని భర్తతో విసిగిపోయి, అతనితో విసిగిపోయానని ఆత్మహత్య చేసుకుంటున్నానని ఉత్తరం వ్రాసి, బల్లమీద పెట్టి, నిద్ర మాత్రలు మింగింది. అదృష్టవశాత్తు బ్రతికింది.

స్పృహ వచ్చిన భార్య మొహంలోకి తొంగిచూస్తూ అన్నాడు భర్త—

"నీ కథలో కాగితం కాబోలు, బల్లమీద మర్చిపోయావు. ఎగిరిపోతుందని తీసిపెట్టాను" అని ఆ ఉత్తరం చేతిలో పెట్టాడు.

—ఎమ్. వి. సుబ్బలక్ష్మి, చిక్కడపల్లి.

## అదృష్టం!—దురదృష్టం!!

"ఇంతకూ అదీ సంగతి. వడ్డీ తీసుకుందువుగాని, డబ్బు మాత్రం ఇప్పించు" ప్రాధేయపడ్తున్నట్టు అడుగుతున్నాడొకాయన.

"అది సరేలే! డబ్బెక్కడ పోతుంది. వడ్డీ ఎక్కడ పోతుంది, వెంకట్రాజం. అట్లా మాట్లాడతావేమిటి? సాయంత్రం వచ్చి డబ్బు పట్టుకెళ్ళు" వడ్డీవ్యాపారి పార్వతీశం చెప్పాడు.

"చాలా కృతజ్ఞుడ్ని పార్వతీశం. నీ మేలు ఎన్నడూ

మర్చిపోను. సాయంత్రం మా అబ్బాయి కాలేజినుండి రాగానే పంపుతాను డబ్బివ్వు. ఆఁ. అన్నట్లు మావాడు నీకు తెలియదు కదూ! పేరు వెంకటేశ్వర్లు. బి.కాం., చదువుతున్నాడు" చెప్పాడా వ్యక్తి. తర్వాత అతను వెళ్ళిపోయాడు.

ఇదంతా వాళ్ళముందునుండి వెళ్ళిన చిల్లరదొంగ సదానందం విన్నాడు.

వెంకట్రాజాన్ని వెంబడించి ఇల్లు తెలుసుకుని అద్దె బట్టలకోసం వాషింగ్ షాప్‌వైపు పరుగెట్టాడు.

"నమస్కారమండీ. నాపేరు వెంకటేశ్వర్లు. వెంకట్రాజం గారి అబ్బాయిని. మీరేదో డబ్బిస్తానన్నారుట" చేతులు జోడిస్తూ చెప్పాడా అబ్బాయి.

"రా. రా. లోపలికి రావోయ్!" కుర్చీ చూపిస్తూ పిలిచారు పార్వతీశంగారు.

"ఆఁ. ఏం చదువుచున్నావు బాబూ!"

"బి.కాం., అండి" నిన్నటి మాటలు జ్ఞాపకం చేసుకుంటూ చెప్పాడు చిల్లరదొంగ సదానందం.

"నిన్న మీ నాన్నగారు చెప్పారు. అయినా కొన్ని విషయాలు నాకు తెలియకుండానే అడిగేస్తుంటానోయ్" నొచ్చుకుంటున్నట్లు చెప్పారాయన.

"డబ్బు తెస్తానుండు." అంటూ కుర్చీలోనుండి లేచిపోతూ "మీ అన్నయ్య ఇప్పుడేం చేస్తున్నాడోయ్!" అడుగుతూ లోనికెళ్ళారాయన.

పచ్చి వెలక్కాయ గొంతు కడ్డం పడ్డట్లు ఫీలయ్యాడు సదానందం. అయినా సమాధానం చెప్పకుంటే ఏం అను

మానం. చెప్పితే ఏం అనుమానం వస్తుందో? సంధి గ్ధంలో పడ్డాడు సదానందం. పార్వతీశానికి వెంకట్రాజం కుటుంబంతో ఈమధ్య ఎక్కువ సంబంధం లేదని జ్ఞప్తికి తెచ్చుకుని, "ఏం లేదండి. ఉద్యోగంకోసమే వెతుకు తున్నారు" నింపాదిగా చెప్పాడు.

బీరువా తెరిచి డబ్బు లెక్కెడుతున్న పార్వతీశం అదిరి పడ్డాడామాట విని. వెంటనే ఏదో నిశ్చయానికొచ్చినట్లు 800 రూపాయలను చేతిలోకి తీసుకుని, బయటకొచ్చి "నాయనా వెంకటేశ్వర్లు, మీ నాన్నేమో నన్ను వెయ్యి రూపాయ లడిగారు. కాని నా దగ్గరేమో ఎనిమిది వందలే వున్నాయి. కాసేపిలా కూర్చో. మిగతా రెండొందలు పక్కింట్లో అడి గిస్తాను" అంటూ ఎనిమిదొందల రూపాయలను చేతబట్టు కొని బయటకు నడిచారాయన.

సదానందం సంతోషంగా ఇంట్లో వున్న ఫొటోలవంక చూస్తూండిపోయాడు.

పది నిముషాల తర్వాత పోలీసులతో సహా ఇంట్లోకడుగు బెడ్తున్న పార్వతీశంను చూస్తూనే బయటకు పరుగెత్త బోయాడు సదానందం. కాని గడపలోనే పోలీసులకు చిక్కాడు పాపం.

"వీడేనండి ఇన్‌స్పెక్టర్‌గారూ! మా స్నేహితుని అబ్బాయిగా నటిస్తూ, నన్ను మోసంచేసి డబ్బు పట్టుకెళ్లాలని చూసాడు. నాకు కూడా అనుమానం రాకపోవును. కాని మీ అన్నయ్య ఏంచేస్తున్నాడోయ్. అని పరధ్యాన్నంలో నేనడిగిన ప్రశ్నకు ఉద్యోగాన్వేషణలో ఉన్నాడని, సమాధానం రావడం

నేనదిరిపోయాను. అసలు వెంకట్రాజంకు ఒక్కడే కొడుకు. కొడుకు పుట్టగానే వాడి భార్య చనిపోయింది. ఆ తర్వాత మేమిరువురం విడిపోయాం. అది వేరే విషయం. కాని వాడి సమాధానం విన్న నేను మిమ్మల్ని పిలవకుండా ఉండలేక పోయాను." ఆయాసపడ్తూ చెప్పారాయన.

"ఇట్స్ ఆల్ రైట్. పార్వతీశంగారూ. వీడ్ని మేం స్టేషన్‌కి తీస్తుకెళ్తాం. మీరొచ్చి స్టేట్ మెంట్ ఇవ్వండి" అని చెప్తూ సదానందం చేతులకు బేడీలు వేశాడు ఇన్‌స్పెక్టర్.

"నా అదృష్టం బాగుంది" గొణుక్కున్నాడు పార్వతీశం.

'నా అదృష్టం బాగులేదు' అనుకుంటూ అంతవరకూ పోలీసులకందని సదానందం పోలీసులవెంట నడిచాడు.

—ఏ. విజయభాస్కర్, వరంగల్.

## తప్పని అదృష్టం!

వెంకటేశం ఆ రోజు చాల సంతోషంగా వున్నాడు. అతడు సంతోషంగా ఉండడానికి కారణం లేకపోలేదు. నిన్నంతా అతనికి కుడికన్ను అదిరింది. అందుకే అతను సంతోషంగా వున్నాడు.

ఒకనాడు, ఇలాగే కుడికన్ను అదిరితే బజారునుండి వస్తూవుండగా బంగారం ఉంగరం దొరికింది. ఎవరిదో మరి. లూజు అయి పడిపోయి వుండాలి. ఇంకోసారి ఇలాగే కుడికన్ను అదిరితే పోస్టాఫీసు సేవింగ్ కాతాలో సెకండ్ ప్రైజ్ 10 వేలు వచ్చింది. ఇలాగే రెండు మూడు సంఘటనలు జరిగాయి.

ఒకనాడు ఆఫీసులో అందరూ లాటరీ టిక్కెట్లు కొంటే

వెంకటేశం తనుకూడ రెండు లాటరీ టిక్కెట్లు కొన్నాడు. ఈవేళే లాటరీ ఫలితాలు తెలుస్తాయి. అందుకే అతను చాలా సంతోషంగా వున్నాడు.

ఆ సాయంత్రం—

లాటరీ ఫలితాలు వచ్చాయి. కాని వెంకటేశానికి ప్రైజు రాలేదు. కుడికన్ను అదిరేటప్పుడల్లా ఏదైనా లాభం కలిగేది. కాని లాటరీలో ప్రైజు రాలేదు అని ఆలోచిస్తుండగా పోలీసు ఇన్‌స్పెక్టర్, ఇద్దరు కానిస్టేబుల్స్ లోపలకు వచ్చారు.

"వెంకటేశం మీరేనా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"అవును. నేనే వెంకటేశాన్ని" అని తత్తరపాటుగా నిల్చున్నాడు.

"సారీ సార్, మీకు చాల విచారకరమైనవార్త చెప్పాలి. మీ అబ్బాయి కాలేజీకి వెళ్ళేదారిలో ఘోరమైన ఏక్సిడెంట్ జరిగింది. హస్పటల్‌కు తీసుకు వెళ్ళేలోపలే మరణించాడు." తలమీద హేట్ తీసి విచారంగా చెప్పాడు.

అంతే! కుప్పకూలిపోయేడు వెంకటేశం.

అయితే వారం తిరుగకుండానే వెంకటేశానికి ఇన్‌సూరెన్స్‌వాళ్ళు 25 వేలు పంపారు. నెలరోజులక్రితమే కొడుకు పేరుమీద ఇన్‌సూరెన్స్ కట్టాడు. ఆ డబ్బు వచ్చింది వెంకటేశానికి. తనను తప్పని ఈ అదృష్టానికి మురవాలో, ఏడవాలో తెలియలేదు వెంకటేశానికి.

—ఉప్పల గణేష్, రాజాం.



